# శ్రీమద్రామాయణ కల్పవృక్షము బాలకాండ ఛందోవస్తుశిల్పము

## (సిద్ధాంత గ్రంథం)

(ఆచార్య తూమాటి దోణప్ప పలనాడు పరిశోధన స్వర్ణపతకం పొందిన గ్రంథం)

డా॥ పవని ఆర్. హరినాథ్,
ఎం.ఏ., పిహెచ్.డి.,

(This Book is published with the financial aid of Tirumala Tirupati Devasthanams Under their Scheme 'Aid to publish religious books'.)

పవని ప్రచురణాలు
అనంతపురం

Srimad Ramayana Kalpavrikshamu Balakanda - Chandovastu Silpamu (Ph. D., Thesis Submitted to Sri Krishna devaraya University, Anantapur)

తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ముద్రితం

ప్రథమ ముద్రణ - 1992

ప్రతులు - 1000

ముఖపత్ర శిల్పి - శ్రీ శీలావీర్రాజు

వెల : రూ. 60-00



ప్రతులకు :
శ్రీమతి పవని మైథిలి,
3/55, II రోడ్, జార్జిపేట,
అనంతపురం - 515004

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
4-1-435, విజ్ఞాన భవన్, బ్యాంకు స్ట్రీట్
హైదరాబాదు - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
విజయవాడ, హైదరాబాదు, అనంతపురం,
విశాఖపట్టణం, హన్మకొండ, గుంటూరు,
తిరుపతి, కాకినాడ

ముద్రణ : పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ 1-1-517/B/1, న్యూబాకారం,
గాంధీనగర్, హైదరాబాదు-500 380, ఫోన్: 611413.

# అంకితం

మా సర్వము తానైయైన మా అమ్మ

## పవని సరోజినీదేవికి

కై మోడ్పుతో -

# కృతజ్ఞతలు

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం చేసిన తెలుగు విశ్వవిద్యాలయా నికి కృతజ్ఞతలు

నాకు పరిశోధనాంశాన్ని సూచించి, తగిన ప్రణాళిక రూపొందించి, సంప్రదాయ సాహిత్యాధ్యయన రహస్యాలను విప్పిచెప్పి, చిన్న సంశయంతో వెళ్ళినా కూడా ఛిన్నసంశయుణ్ణిచేసి, వాత్సల్యంతో ప్రోత్సహించి పర్యవేక్షించిన ఆచార్యులు డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు గారికీ-

విలువైన సలహాలతో నన్నునేక విధాల ప్రోత్సహించే ఆచార్యులు డా॥ శలాక రఘునాథ శర్మ గారికి, డా॥ కొలకలూరి ఇనాక్ గారికి, నాపట్ల సోదర భావంతో నన్నాదరించే 'ఆంధ్రభారతి' అధ్యాపక బృందానికీ-

నా పరిశోధన కొనసాగుతున్నవేళ నన్ను 'జూనియర్ రీసర్చి ఫెలో'గా ఎంపిక చేసి ఆర్థికసాయ మందించిన యూనివర్సిటీ గ్రాంటుల సంఘం వారికీ, నాకు ఈ అవకాశం కలిగించిన శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయాధిపతులకూ-

నా ఈ గ్రంథానికి పరీక్షకులుగా వ్యవహరించిన ఆచార్యులు- డా॥ గంధం అప్పారావుగారు, డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు; డా॥ కె శ్రీరామమూర్తిగార్లకూ-

ఈ గ్రంథాన్ని 1988 సం॥నికి ఉత్తమ పరిశోధన గ్రంథంగా ఎంపిక చేసి, ఆచార్య తూమాటి దొణప్ప పలనాడు రీసర్చి గోల్డ్ మెడల్ బహూకరించిన న్యాయ నిర్ణేతల సంఘానికీ-

తమ విలువైన అభిప్రాయాలిచ్చి ఆశీర్వదించిన ఆచార్యులు, జ్ఞానపీఠ బహుమతి గ్రహీత, ప్రముఖ కవి డా॥ సి. నారాయణరెడ్డి గారికి, ప్రముఖ విమర్శకులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారికి, ఆచార్య శలాక రఘునాథశర్మ గారికి, ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు గారికీ-

అందమైన ముఖచిత్రాన్ని అనతికాలంలో చిత్రించిన శ్రీ శీలా వీర్రాజు గారికీ-

ముచ్చటైన ముద్రణతో అతితక్కువ కాలంలో గ్రంథాన్ని ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ శ్రీనివాస్ గారికీ, వారి సిబ్బందికీ-

కృతజ్ఞతలు.

ముద్రణకాలంలో నాకు చేదోడు వాదోడుగా నిలచిన నా తమ్ముడు పవని భానుమూర్తికి, చిరంజీవి ఎన్. ఏ. రఘుకు శుభాశీస్సులు.

హితులై, స్నేహితులై, ప్రసంగాలై, చర్చలై, వ్యాసాలై, ప్రేరణలై, ప్రత్యక్షంగా పరోక్షంగా తోడ్పడిన-

ఎందరో మహానుభావులు అందరికీ వందనములు.

# నమస్సుమాంజలి

నాకు జన్మనిచ్చిన తల్లిదండ్రులు శ్రీమతి పవని సరోజినీదేవి కీ॥ శే॥ శ్రీ పవని రామచంద్రరావు గార్లకు-

నాలోని సాహిత్యాభిలాషను పల్లవావస్థలోనే పసిగట్టి పందిళ్ళు ప్రాకించిన సహృదయులు మా అన్నలు డా॥ పవని అరవిందబాబు, శ్రీ పవని రాధాకృష్ణ గార్లకు-

నాకు రీసర్చికి ఏ యే పుస్తకాలు అవసరమో, తానై కనుక్కొని అనేక అమూల్య గ్రంథాల నందించి నా సాహిత్య వ్యవసాయంలో సాయం చేసిన మా వదిన శ్రీమతి పి. విజయలక్ష్మి గారికి-

దుర్భరమైన నైరాశ్యం క్రమ్మి నా సర్వశక్తులూ నీరసించిన వేళల్లో అనంతమైన ధైర్యాన్నిచ్చి వెన్నుతట్టి నిలిపిన మా వదిన శ్రీమతి ప్రమీలారాణి గారికి-

పరిశోధనా దశలో అనేకమార్లు ఆరోగ్యం చెడి తీవ్ర జ్వరాలతో ప్రకంపించిపోయిన వేళల్లో తన అద్భుత హోమియో వైద్యంతో ఆపద్బాంధవుడై ఆదుకొని మాకొక పెద్ద అండగా నిలిచిన మా మామ శ్రీ జి.వి. చలపతిగారికి-

నా కాలిలో ముల్లు దిగితే తమ కంట కన్నీరొలికే ప్రేమతో ననుకాచే మా అమ్మకు, వదినలకు, అన్నలకు, తమ్మునికీ-

ఏ తల్లి నా సర్వ చైతన్యాన్నీ శాసిస్తూందో ఆమెకూ—

నమస్సుమాంజలి.

# విషయసూచిక

**విశేషచ్ఛందాలు :**



**సామాన్య ఛందాలు :**



**IV. వాల్మీకి-విశ్వనాథ :**

# ఆశీస్సు

ప్రాచీన సంస్కృత కవుల్లో మురారిది అత్యంత విలక్షణ కంఠం. అందుకే విమర్శకులు 'మురారేః తృతీయః పంథా' అన్నారు. అంటే మురారిది సాహిత్యరంగంలో మూడో మార్గమన్నమాట.

ఆధునిక తెలుగు సాహిత్యంలో విశ్వనాథ సత్యనారాయణగారిది అలాంటి విలక్షణ వ్యక్తిత్వం. కథ, నవల, వ్యాసం, కావ్యం, నాటకం - లాంటి వివిధ ప్రక్రియల్లో అంచులుముట్టిన ధిషణా సంపన్నుడు ఆయన. అంతేకాదు. ఏ ప్రక్రియను చేపట్టినా దాంట్లో తన ప్రత్యేక ముద్రను నిక్షేపించిన అసదృశ ప్రతిభాశాలి ఆయన.

విశ్వనాథవారి సమస్త కృతులపైన ఇంతవరకు విస్తృత పరిశోధనలు జరిగాయి. ఒక్కొక్క పుస్తకం మీద ఎం.ఫిల్ లేక పిహెచ్.డి సిద్ధాంత వ్యాసాలు వెలువడ్డాయి. ఇక ఆయన రచనల సర్వాంగీణ పరిశీలనకు బదులు సూక్ష్మాంశ సమీక్ష అవసరమయింది. 'శ్రీ మద్రామాయణ కల్ప వృక్షం' లోని బాలకాండను తీసుకుని, అందులోని ఛందోవస్తు శిల్పం గురించి చేసిన పరిశోధన ఫలం ఈ సిద్ధాంత గ్రంథం. డా॥ పవని రామచంద్ర హరినాథ్ మంచి భావుకుడు; నిరంతర కవితా స్వాదకుడు. కల్పవృక్ష బాలకాండలోని ఛందో వస్తు శిల్ప వైఖరులను సునిశితంగా పరిశీలించి ఈ గ్రంథాన్ని రూపొందించాడు. వస్తువు గురించి విశ్లేషించడం అంత దుస్తరమైంది కాదు. కానీ ఛందస్సు గురించి పరిశీలించడం శ్రమతో కూడుకున్న పని. కారణం, సామాన్యంగా పద్యకావ్యాల్లో ప్రయోగించే వృత్తాలతోపాటు విశ్వనాథవారు పుంఖానుపుంఖంగా కావ్య వ్యవహారగతంకాని విశేష వృత్తాలను ప్రయోగించారు. ముందు వాటి లక్షణాలను పట్టుకోవడమే కష్టసాధ్యం. ఆ తరువాత వాటిని సమన్వయించి చూపడం మరింత ప్రయాసకరం. డా. హరినాథ్ ఈ దుస్తర కార్యాన్ని సుకరం చేసుకుని లక్ష్యం సాధించాడు. అటు వస్తుగత విశేషాలనూ, ఇటు ఛందోగత విచిత్రాలనూ సమప్రజ్ఞతో విశ్లేషించి ఈ గ్రంథాన్ని రచించిన చి॥ డా॥ పవని హరినాథ్‌కు నా అభినందన పూర్వకమైన ఆశీస్సులు.

6-5-91
హైదరాబాదు

**ఆచార్య సి. నారాయణరెడ్డి**

# అంతా బంగారం

శ్రీమద్రామాయణ కల్పవృక్షం ఆధునిక యుగంలో అవతరించిన నవ్య సంప్రదాయ మహా కావ్యం. దాని రచన మూడు దశాబ్దాలకు పైగా సాగింది. దాని మీద విమర్శ కూడా మొదలై అర్ధ శతాబ్ది దాటింది. కావ్య సమగ్ర పరిశీలనం, పాత్రల పరిశీలనం, అనువాద పరిశీలనం, ప్రభావ పరిశీలనం, తత్త్వ దర్శనం, కావ్యశిల్పానుశీలనం మొదలైన అంశాల మీద వ్యాసాలూ, పరిశోధన వ్యాసాలూ, సిద్ధాంత వ్యాసాలూ అధిక సంఖ్యలో వచ్చాయి. సమగ్ర పరిశీలనం తరువాత సాధారణంగా అంశానుశీలనం, సూక్ష్మ విషయ వివేచనం మొదలౌతుంది. ఆ అధ్యాయానికి మిత్రులు డాక్టర్. పవని రామచంద్ర హరినాథ్‌గారు వెలువరిస్తున్న ఈ సిద్ధాంత వ్యాసం ఒక నవ్యారంభాన్ని చేస్తున్నది. అందుకు నేను సంతోషిస్తున్నాను, రచయితను అభినందిస్తున్నాను.

ఈ శతాబ్దం ఆరేడు దశకాల్లో పరిశోధకులు విస్తృతాంశాలను ఎన్నుకొని, వివరణాత్మకంగా, విశ్లేషణాత్మకంగా సిద్ధాంత వ్యాసాలను సంతరించి, తమకు దొరికిన సామగ్రినంతా వర్గీకృత పద్ధతిలో అందులో పొందుపరిచేవారు. ఆ పరిశోధనలు తరువాతి తరానికి ఎంతో మేలు చేశాయి. 'అవి పరిమాణంలో బండ్లకెత్తేటట్లు ఉంటాయి', 'చదవటానికి విషయ సాగరాల్లాగా ఉంటాయి' లాంటి మాటలు వినపడ్డా, ఒక్కొక్క రంగంలో ఎన్ని సమస్యలున్నాయో తెలుసుకొనటానికి అవి ఎంతో తోడ్పడ్డాయి. ఎనిమిదో దశకంలో కవుల మీదా, కావ్యాల మీదా, కావ్యాలలోని సమస్యల మీదా పరిశోధనలు సాగాయి. ఆ వరుసలో మరొక అడుగు ముందుకు వేసి, కావ్యభాగంలో పరిశీలనాంశాలను ఎన్నుకొని నిర్వహించే సూక్ష్మాంశ వివేచన విధానానికి ఈ సిద్ధాంత వ్యాసం మరొక శుభారంభం చేస్తున్నది.

ఆధునికయుగంలో వెలసిన రచనలలో ఒక కాండనో, ఒక భాగాన్నో పరిశోధనకోసం తీసుకొని సిద్ధాంతవ్యాసం వ్రాయటానికి వీలున్న గ్రంథాలెన్ని ఉన్నాయి? శ్రీమద్రామాయణ కల్పవృక్షం పేరు మొదట చెప్పుకోవలసిందే.

ఆ తరువాత మరొక పేరు చెప్పాలంటే పదిసార్లు ఆలోచించవలసిందే ఆ సత్యాన్ని డాక్టర్ హరినాథ్‌గారు ఎన్నుకొన్న పరిశోధనాంశం అనుమానం లేకుండా ప్రకటిస్తున్నది.

శ్రీమద్రామాయణ కల్పవృక్ష కావ్య మూర్తిమత్వాన్ని సంభావిస్తున్నప్పుడు సహృదయుడు ఈశావాస్యోపనిషత్తులోని శాంతిపాఠాన్ని అనుభవకోశంలో మననం చేసుకొంటాడు. "ఓం. పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే, పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే." దర్శనంలోనూ, అనుభూతి ప్రదానంలోనూ కల్పవృక్ష కావ్యమంతా ఒక సంపూర్ణ మూర్తిమత్వం కలిగిన రసజగత్తు. అందులో ప్రతి కాండం ఒక పూర్ణంలోని పూర్ణభాగంలాగా ఉంటుంది. ఒక్కొక్క కాండంలోనూ అయిదేసి ఖండాలున్నాయి. వాటిలో ఖండంగా కనపడే కావ్యభాగం కూడా ఒక పూర్ణకళామూర్తిగా గోచరిస్తుంది. ఇటువంటి అనుభూతి కలిగించే శక్తి వాల్మీకి రామాయణానికీ, వ్యాసభారతానికీ, శ్రీమద్భాగవతానికీ, కవిత్రయ భారతానికీ (ప్రబంధమండలి వంటి అనుభవం) ఇదివరలో ఉండేది. ఇప్పుడు శ్రీమద్రామాయణకల్పవృక్షానికి ఈ ఖ్యాతి దక్కుతుంది. అందులోని ఏ ఖండమైనా స్వయంసంపూర్ణం. కాని, ఒక పూర్ణంలో నుండి పుట్టి ఆ పూర్ణంలో లయించే ఒక పూర్ణభాగం. బాలకాండ మీది పరిశోధనం ఆ అనుభూతి సూత్రంతో అన్వయించుకుంటే అన్వయమౌతుంది.

పరిశోధనలో పరిధి తగ్గినకొద్దీ పరిశ్రమ పెరుగుతుంది. విస్తృత పరిధిలో వాస్తవాల వ్యక్తీకరణకు ప్రాధాన్యం లభించే అవకాశం ఉంది. నియతపరిధిలోని పరిశోధనలో సత్య నిరూపణకు ఎక్కువ స్థానం లభిస్తుంది. డాక్టర్ హరినాథ్‌గారు తామెన్నుకొన్న పరిశోధనాంశ స్వరూప స్వభావాలను లెస్సగా దర్శించారు కాబట్టి తమ సిద్ధాంత వ్యాసాన్ని వాస్తవ విశేషాల సంపుటీకరణంగా కాకుండా, సత్య వివేచన శిల్ప మందిరంగా మలచుకున్నారు. ప్రతిపాద్యాంశాన్ని బట్టి ప్రణాళికను రూపొందించుకొనటం పరిశోధన మర్మజ్ఞులు ప్రదర్శించే వివేకం.

నవలకు కూడా కావ్యత్వాన్ని కల్పించిన కళా సరస్వతి విశ్వనాథవారని విమర్శకులు కీర్తించారు. అలాగే కావ్యంలో కూడా కథామర్మాలను, నవలావిలాసాలనూ వస్తుపరంగా సంవదించిన నవ్య సంప్రదాయ కావ్య నిర్మాణ దక్షులు

విశ్వనాథవారని కల్పవృక్షం స్పష్టం చేస్తున్నది. అందువలన కల్పవృక్షం చదువుతూంటే కథానిర్మాణంలో, వస్తు సంవిధాన శిల్పంలో ప్రాచీన కావ్యంలా అనిపించదు. అటువంటి స్వభావం కలిగిన కావ్యం మీద పరిశోధన చేస్తున్న రచయిత రచియించే సిద్ధాంత గ్రంథం ఎలా ఉంటుందో అని పఠిత ఉత్కంఠతతో ఉంటాడు. డాక్టర్ హరినాథ్‌గారి గ్రంథం ఒక నవ్యతను సంతరించుకొన్న అమరికతో, పొందికతో, పోహళింపుతో వెలువడటం గమనించిన పఠిత తృప్తినీ, సంతోషాన్ని ప్రదర్శిస్తాడని నేను గాఢంగా విశ్వసిస్తున్నాను.

ఈ సిద్ధాంతవ్యాసంలో వస్తుశిల్పం, ఛందశ్శిల్పం అనే రెండు శాఖలు తప్పకుండా ఉండాలి. అవి బాలకాండకు సంబంధించినవి. వస్తుశిల్పానుశీలన నిర్వహణంలో డా॥ హరినాథ్‌గారు నవ్య శిల్ప దృష్టిని ప్రదర్శించారు. గతానుగతికంగా సిద్ధాంత గ్రంథం వ్రాసే వారయినట్లయితే ఈ గ్రంథంలో ఎన్నో వివరణాత్మకమైన అంశాలు చేరి బరువెక్కించి ఉండేవి. ఎలాగంటే - వస్తుపరంగా వ్రాయదలచుకొన్నప్పుడు మూలకథ, రామాయణ కల్పవృక్ష కథ, మార్పులు, చేర్పులు, కూర్పులు వాటి ఔచిత్య విచార చర్చ మొదలైనవి ఈ గ్రంథంలో మచ్చుకైనాలేవు. రచయితకు మొదట తెలియవలసింది ఏవి వ్రాయకూడదో వాటి ప్రసక్తి; ఆ తరువాత ఏవి వ్రాయాలో వాటి ప్రయుక్తి. ఈ రెండూ బాగా తెలిసి వ్రాసిన సిద్ధాంత గ్రంథ రచనా శిల్పి డాక్టర్ హరినాథ్.

పరిశోధకునికి కాలజ్ఞానం అవసరం. హరినాథ్ కలానికి కాలజ్ఞానం, కళా విజ్ఞానం - రెండూ ఉన్నాయి. కాలజ్ఞానం అంటే నేననుకొంటున్నది ఈ సందర్భంలో ఏమిటంటే - రచయిత ఒక కాలంలో ఒక పరిశోధన చేస్తున్నప్పుడు అంతకు పూర్వం ఆ అంశం మీద జరిగిన పరిశోధనంతా చదివి, దానికంటే విశిష్టంగా ఏమైనా చెప్పదలచుకొన్నప్పుడే ఏమైనా వ్రాయాలి అనే జ్ఞానం కాలజ్ఞానం. క్రొత్తగా తాను చెప్పేది లేనప్పుడు చెప్పిన వారి మాటలన్నీ గుదిగూర్చి చెట్ట భారతాలు కట్టలు కట్టటం సముచితంకాదు. ఈ రచయిత ఈ కాలజ్ఞానాన్ని అణువణువునా జీర్ణించుకున్నవాడు. అందువలన ఈ సిద్ధాంత గ్రంథంలో చెప్పదలచుకొన్న అంశాలు సూటిగా సంగ్రహంగా సారవంతంగా చెపుతున్నట్లుంటాయి కాని, ప్రవాహంలో పడిపోతున్నట్లుండవు. పరిశీలనలో ఎంత శాస్త్ర దృష్టి ఉందో ప్రపంచనంలో కూడా అంత శాస్త్ర దృష్టిని ప్రదర్శించారు వీరు. కాలజ్ఞానాన్ని

సిద్ధాంత గ్రంథ రచనలో కళా విజ్ఞానంగా వెలువరించటం డాక్టర్ హరినాథ్‌గారి మరో మంచి గుణం.

విశ్వనాథవారి రచనలో పద్యశిల్పం, ఛందశ్శిల్పం - అనే అంశాలు ప్రత్యేకంగా అధ్యయనం చేయతగినవి. కొంతమంది కొంత ప్రయత్నం చేశారు. శ్రీమద్రామాణకల్పవృక్షంలోని విశేషచ్ఛందాలను గురించి కూడా విశేషంగా విమర్శలూ, పరిశోధనలూ వచ్చాయి. బాలకాండకు సంబంధించినంతవరకు డాక్టర్ హరినాథ్‌గారు విశేషచ్ఛందశిల్పవివేచనం చేశారు. ఇటువంటి ఛందశ్శిల్ప పరిశీలనకు పాటిబండ మాధవశర్మగారు చూపించిన శిల్పమార్గమే ప్రామాణికంగా గోచరిస్తున్నది. దానినే వీరు గ్రహించటంలో ఔచిత్యం ప్రకటించారు. ఏమైనా, ఎన్నుకొన్న విషయంలో ఏమి చెప్పాలో, ఎలా చెప్పాలో తెలిసి వ్రాసే రచయిత డాక్టర్ హరినాథ్.

ఈ గ్రంథం పరిశోధన గ్రంథమైనా పఠితకు బరువు కలిగించకుండా ఆసక్తిని కలిగిస్తుంది; మొదలుపెడితే చివరిదాకా చదివిస్తుంది; రచయిత చిత్తశుద్ధిని, స్పష్టతను అడుగడుగునా చాటుతుంది. అందుకే కాబోలు-1988 సం॥ ఆచార్య తూమాటి దొణప్ప స్వర్ణపతకం ఈ గ్రంథం పొందింది.

కావ్యం బంగారం; సమస్య బంగారం; పద్ధతి బంగారం; పతకం బంగారం. దీని భవిష్యత్తు కూడా బంగారం కావాలని కోరుకుంటున్నాను. శ్రీమద్రామాయణకల్పవృక్షంలోని ఒక్కొక్క కాండమీద ఇటువంటి సిద్ధాంత గ్రంథాలు రావాలని ఆశిస్తున్నాను. వాటి కిది నమూనాగానో, మార్గదర్శిగానో ఉండాలని ఆకాంక్షిస్తున్నాను.

హైదరాబాదు
10-4-1991

**జి. వి. సుబ్రహ్మణ్యం**

# ఆశీరభినందన

చిరంజీవి పవని రామచంద్ర హరినాథ్ చాలా పసితనంలో ఉన్నప్పుడే నాకు తెలియవచ్చినవాడు. ఇప్పటికీ అతనిని చూస్తుంటే ఆ పసితనపు జ్ఞాపకాలే నా మదిలో మెదులుతూ ఉంటాయి. తరువాత స్నాతకోత్తర విద్యలో ప్రవేశించి నపుడు అతని మేధలో ఒక పరిణతి కొట్టవచ్చినట్లు కనపడుతూ ఉండేది. పరి శోధనలో అతని ప్రజ్ఞ ఎంతటి ఉన్నత శిఖరాలకు ఎగబ్రాకిందో చెప్పటానికి ఈ పుస్తకమే ప్రబలసాక్ష్యం.

ఈ చిరంజీవి పైకి ఏమీ తెలియని వానిలా కనిపిస్తాడు. రెండుమాటలు మాటాడితే 'ఓహో! ఈ పుట్టలో గట్టిపామే ఉన్నట్లుందే' అనిపిస్తాడు. నాలుగు పంక్తులు వ్రాస్తే 'నలుగురి'లాంటి వాడు కాదని రుజువు చేస్తాడు. ఇక ఈ పుస్త కాన్ని వ్రాసి ఉదాత్తకావ్యాన్ని ఉత్తమ విమర్శకుడు ఎలా చూడాలో నిరూ పించాడు.

చూడటం వేరు, చూపటం వేరు. ఈ రెండింటిలో ఇతనిది విశిష్టమైన విలక్షణమైన ధోరణి. ఈ బాణిలో కావ్యానుశీలనం చేయటం అందరికీ చేతనైన విద్య కాదనుకుంటాను. అందుకే ఈ 'పసివాణ్ణి' మనసారా అభినందిస్తున్నాను. ఇంకా సమున్నతమైన మెట్లు ఎక్కేశక్తి కలుగుగాక అని ఆశీర్వదిస్తున్నాను.

శలాక రఘునాథశర్మ

26-4-91
శ్రీ వేంకటేశ్వరపురం,
అనంతపురం.

# విమర్శ కల్పకం

కవితారూపతపస్సు చేసెదను శ్రీకంఠా, మనస్సంయమా
ది విధానంబులఁ జేతకాని తనమైతిన్ మూర్త సంవిత్కళా
యువతీ భోగః హరింప జేయుటకు మారోద్దృం జుమీ యింద్రియా
ది వికారంబులు భావనా విమల వాక్తీర్థంబు లేపారగన్
(అరణ్యకాండ-శబరీ 409

తన గొంతులోన నూగు నినాదములపూర్వ
నినదితంబులు పైకి నిట్టవొడిచి
తన గుండెలోన డాగిన మెత్తనగు చోట్లు
భావరూపములంది పైకి వచ్చి
తన సృష్టిలోన నుండిన కొత్త మాధుర్య
సీమలు క్రేళ్ళుగా జెంగలించి
తన యాత్మ తానెఱుంగని యొక్క యానంద
పరిధి రేఖా స్వయం వ్యక్తి కలిగి

కనుగొలకులందు గన్నీళ్ళు గార్చి మైగ
గుర్పొడువ దనదేహ మా క్రొత్త బిగువు
లెచట దెచ్చెనొ యని కనులింతలు గను
విచ్చి చూచుచు మునికుఱ్ఱ బిగువు చెడియె. (ఇష్టి-175)

ముక్కూ ముఖంలేని నిర్గుణమైన భావానికి రమణీయ రూపకల్పన చేయడమే కళాసృష్టి. కవిసమ్రాట్ విశ్వనాథ సాహిత్య సృష్టి అంతా ఒక విచిత్ర శిల్పమణి సౌధం. శిల్ప సరస్వతి వేయిపడగలు ధరించి మాటాడితే ఎలా ఉంటుందో కల్పవృక్ష కర్త శబ్దం అలా ఉంటుంది. ఒక పాత్రకు పేరు పెట్టినా, ఒక కథ కనుగుణమైన వాతావరణ కల్పన చేసినా పౌరాణిక చారిత్రక సాంఘికాది భేదాలతో కన్పించే వస్తు సన్నివేశ శిల్ప మహత్తరమైన సృష్టికి విశ్వనాథ నిర్మించిన సాహిత్య వైభవమంతా ఉదాహరణప్రాయం.

మొదటి రెండు పద్యాలూ కవిలోని విమర్శకుని మాటలు. విమర్శ అంటే రూప రహితమైన భావస్పందనకు వ్యాఖ్యానాకృతి కల్పన చేయటం. కవిత్వంలో లాగానే ఇందులో కూడా విశ్లేషణ కంటె అనుభవమే అంతస్తత్త్వంగా గ్రహించాలి. మొదటి పద్యంలో ఆధ్యాత్మిక ప్రస్థానంతో అలంకార ప్రస్థానం ఎక్కడ విడివడి పోతుందో పరమ సుకుమారంగా వర్ణించబడింది. మతదృష్ట్యా కామాది భావాలు త్యాజ్యములు కాగా కవితామత దృష్ట్యా భోగ్యాలు. వాటిని త్యజించట మన్నది అసాధ్యమన్న విషయం ఫ్రాయిడ్ తరువాత వచ్చిన మనకు బాగా తెలిసిన విషయం. త్యజించటమంటే బాహ్యవస్తు సంపర్కాన్ని త్యజించటం కాదు, భావ స్పందనను త్యజించటం. అది కుదిరేది కాదు. కనుకనే కోర్కెలన్నిటినీ మనసులో దాచుకుని మానవజాతి మసలుకుంటున్నది. మేనకా విశ్వామిత్ర ఘట్టంలో మేనకాగమనం తర్వాత కథాంతంలో ఇలా చెప్పబడింది :

"అసలు కోకిల యేమొ నాకర్థమయ్యె
నీ కృపాలేశమున జేసి నీరజాక్షి"

కోరి ప్రత్యక్ష మన్మథ గురువవైతి
కోరక పరోక్ష వైరాగ్య గురువవైతి
లంజియా, ఎంత కిందికి గుంజినావో
యంతపైకిని జనుమార్గ మరసినావు.

ఈ కథలో విశ్వనాథ శృంగార రస చిత్రణం చేసిన సంగతి అలా వుంచి, సుప్త చైతన్యంలో ఎక్కడో మిణుకు మిణుకు మంటున్న కామ భావం మేనకగా వసంత ఋతువు నాశ్రయించుకుని బహిర్గతమైనది. ఇందుకే కథాంతంలో అసలు కోకిల అంటే ఏమిటో తెలిసిందన్నాడు. ఆ 'అసలు కోకిల' సుప్త చైతన్యంలోని రమణీయ కామ స్పందన. అది అనుభూతమైతే తప్ప, భోగ్యమైతే తప్ప శాశితం కాదు. అలాగే క్రోధాలూ. నేనన్న భావన సంపూర్ణంగా కామాదుల్లో లీనమై అనుభవిస్తే తప్ప సుప్త చైతన్యంలోని భావాలు శాశితాలు కావు. కనుక కవితాప్రస్థానంలో ఆ లోలోతుల్లోని భావాలను పైకితెచ్చి ఉదాత్తీకరించి అనుభవించటం. దీనివల్ల మనిషి విశ్వామిత్రుని కథలోలాగా అథమస్థాయినుండి ఊర్ధ్వ దిశకు ఎదిగిపోతున్నాడు. ఆ కథ అంతా జీవితాన్ని యోగంగా మలుచుకున్న వ్యక్తికి ఉదాహరణ. కథ నింత మనోవిశ్లేషణాత్మకంగా మలచటం ఆంధ్ర సాహిత్యంలోనే ఒక అపూర్వ సృష్టి.

రెండో పద్యం రసానుభవానికి ఒక అందమైన వ్యాఖ్యానం. కావ్యానందాన్ని పొందడమంటే ఏమిటో అంత అందంగా వ్యాఖ్యానించిన సందర్భం మనకు ఇతరత్రా మరోచోట కనిపించదు. ఈ రసానందమంతా మనలో ఉన్నదే. దానికి కళ ఒక సందర్భాన్ని కల్పిస్తుంది. ఆ సందర్భమన్నది ఒక కాలువ. దానిగుండా మనలోని రసానందం ప్రవహిస్తున్నది. ఈ రస సిద్ధాంతానికి విశ్వనాథ సాహిత్యం నిండా వ్యాఖ్యానాలు కనిపిస్తాయి. తెలచిరాజు, వేయిపడగలు మొదలైనవి.

సహస్రవృత్తాలుగా వున్న శిల్పసృష్టి విశ్వనాథసాహిత్యం. కాగా, దాన్ని వ్యాఖ్యానించటం విమర్శకుడు కవిస్థాయికి చేరుకోవటం. ఈ ప్రస్తుత గ్రంథం కల్పవృక్ష బాలకాండలోని ఛందోవస్తుశిల్పాన్ని బహు సుకుమారంగా వ్యాఖ్యానిస్తున్నది. వస్తువంటే కథకాదు, కథను సన్నివేశ సందర్భమయంగా మలుచుకోవటం.

ఆ గుహుడైననున్ భరతుడైనను నీవయినన్ సమర్థ్రి చే
తో గురుమూర్తు లూర్జితపథుల్ ప్రభురామకథావతార ధా
రాగురుఘట్టభూతులు దురాక్రుధ పొందిన నేనుగాని నీ
చేగ యెఱుంగ కాడినది చిత్తమునన్ క్షమియింపవే సఖా!

రామకథాస్రవంతిలో దిగడానికి వీలైన రేవులు కొన్ని వున్నాయి. గుహుడు, భరతుడు, సుగ్రీవుడు అని లక్ష్మణుడు సుగ్రీవునితో కిష్కింధకాండ నియమపాలన ఖండంలో చిట్టచివర అన్నమాట. ఇందులో గుహ, సుగ్రీవ కథలు ప్రాసంగికేతివృత్తాలు. భరతకథ ప్రధానేతివృత్తం. ఈ మాటలు నాటకీయ పరిభాషకు సంబంధించినవి. అంటే కథను వస్తువుగా మలుచుకోవటం నాటకీయ శిల్పం ద్వారా కవి సాధిస్తున్నాడు. కనుక వస్తువు కథలోని సూక్ష్మాంశం. అది రసానికి శరీరం. ఈ వస్తువు ఛందస్సన్న శరీరం ద్వారా అభివ్యక్తమవుతుంది. కాబట్టి కావ్యంలో ఛందస్సు బహిరావరణ. వస్తువు లోపలి ఆవరణ. ఈ ఆవరణద్వయం నుంచి సహృదయుడు కావ్య అంతస్సౌందర్యమైన రసదర్శనం చేస్తున్నాడు. ఇది కేంద్ర బిందువు. కనుక ఛందోవస్తు శిల్పములన్న వివేచన రసవ్యాఖ్యానానికి మెట్లు. కావ్యంలో వస్తుదర్శనం ఛందస్సు ద్వారానే జరుగు

తుందన్నమాట. ఈ దృష్టితో ప్రస్తుత విమర్శ గ్రంథంలో మూడింట రెండు వంతులు ఛందశ్శిల్పానికే వెచ్చింపబడినది. ఒక వస్తువును ఛందస్సు ఎలా పరిష్కరిస్తుంది? దీనికి సమాధానం ఇందులోని ఛందశ్శిల్ప వివేచన. ఉదాహరణకు, 99వ పుటలో వేగవతి వృత్తాన్ని గూర్చిన విమర్శ చూడవచ్చు. ఏదైనా ఉదాహరణమే. ఛందశ్శిల్పంలో చూడదగ్గ అంశాలు రెండున్నాయి. ఒకటి, ఛందోగమనం. రెండు, ఆ వృత్తం వాడిన సందర్భం - వీటి సమన్వయం. కనుక 'వేగవతి' వివరణలో మొదటి పేరా ఛందోగమనాన్ని చాలా అందంగా వ్యాఖ్యానించింది. తరువాత విశ్వనాథ వ్రాసిన పద్యం ఉదహరించబడింది. తరువాత ఇచ్చిన వివరణలో సందర్భానుకూల్యం వ్యాఖ్యానించబడింది. ప్రతి వృత్తాన్ని ఈ మూడు అంతరువులుగా గ్రంథకర్త వ్యాఖ్యానించాడు. మొదటి వివరణ ఛందశ్శాస్త్ర పరిశీలన సంబంధమైనది. పద్యమిచ్చి సందర్భ వివరణతో పాటుగా ఔచిత్యాన్ని వ్యాఖ్యానించటం సర్వేసర్వత్రా కనిపిస్తుంది.

ఈ యుగంలో ఛందస్సక్కర లేదన్నవారు కూడా ఛందస్సులోనే రాశారు. పైగా విశ్వవిద్యాలయాల్లో ఛందశ్శిల్పం మీద విశేష పరిశోధన జరుగుతోంది. దీనికి మూలం విశ్వనాథవారి విమర్శ సూత్రమే. వారు ప్రాచీన కవులలో ఈ విశేష వృత్త వ్యాఖ్యానం ఛందశ్శిల్పంగా చెబుతూ వచ్చారు. ఆ ప్రేరణను గ్రహించి, డా॥ పాటిబండ మాధవశర్మగారు 'మహాభారతంలో ఛందశ్శిల్పం' అన్న అద్భుత గ్రంథాన్ని రాశారు. అది ఒజ్జబంతిగా తర్వాత చాలా పరిశోధన సాగింది. ప్రస్తుత వివేచన కూడా అలాంటిదే. మారుమూల ఎక్కడో శాస్త్రంలో చెప్పబడ్డ వృత్తాలకు ప్రయోగ గతి కల్పించింది కల్పవృక్షం ఒకటే. తర్వాత కీ॥ శే॥ మోటూరి వెంకటరావుగారు రాసిన 'పద్మినీ భాస్కర' మన్న మహాద్భుత కావ్యం. ఈ యుగంలో విశేషచ్ఛంద ప్రయోగం ఎంత జరిగిందో అంతగా దాని ఔచిత్యాన్ని చర్చించిన విమర్శ వచ్చింది. కనుక ఈ గ్రంథంలో ఈ దృష్టి విమర్శ చాలా సుకుమార రమణీయంగా చేయబడింది. గ్రంథంలో మొదటి 70 పుటలు వస్తుశిల్ప సమీక్షాత్మకాలు. జీవుని వేదన అన్న రెండధ్యాయాలూ ఒక మహాకావ్య సృష్టి వెనుక వున్న కవి యొక్క మనోవిశ్లేషణ, ఏ మనస్సు కావ్యసృష్టికి బీజమో ఆ మనోవిశ్లేషణ. విశ్వనాథ వారే అవతారికలో కల్పవృక్ష రచనకు హేతువులు అనేక దృక్కోణాల్లో చెప్పారు. వాటి వివరణమే ఈ రెండధ్యాయాలూ.

మూడో అధ్యాయం ఖండ విభజన, కావ్యశరీర సౌందర్యాన్ని విశ్లేషి స్తున్నది. కల్పవృక్ష కావ్యశరీరం ఐదు ఖండాలుగా కల్పించబడ్డ సుందరాకృతి తప్ప అసుందర కబంధం కాదు. ఆ పంచఖండాల విభజనలోని సూత్రాన్ని వ్యాఖ్యానించటమే ఆ అధ్యాయ తాత్పర్యం. తర్వాతి అధ్యాయాలు ఒక్కొక్క కథా సౌందర్యాన్ని గురించి చేసిన విహంగ వీక్షణం. ఆయా అధ్యాయాలకు చేసిన నామకరణం కూడా విమర్శలో భాగంగానే పాఠకుడు చూచుకోవాలి- విమర్శకుని యొక్క మానసిక భావనా సౌకుమార్యాన్ని ఆ నామకరణాలు ధ్వనిస్తాయి కనుక. ఉదాహరణగా 'ఆషాఢమేఘమువోనివాడు' అన్న అధ్యాయం ఋష్యశృంగుని కథా వివేచన. ఇక్కడితో ప్రారంభమైన వస్తుశిల్ప వివేచన 'సకలోహ వైభవసనాథం'తో అంతమయింది. 'సీత పూజడ వెన్నుగా శిరసు వంచె' అన్న అధ్యాయం వరకు వస్తు విశ్లేషణ సాగింది. ఈ నామకరణములు కథా తాత్పర్యాన్ని వ్యంజించేవి. కనుక పాఠకుడు అవి సూచనలుగా గ్రహించి విమర్శలోకి ప్రవేశించాలి. గ్రంథానికి ముగింపు 'వాల్మీకి - విశ్వనాథ' అన్న అధ్యాయం. ఇది చాలా సూక్ష్మంగా పరిష్కరింపబడ్డ అంశం. ఎందుకంటే, వాల్మీకి చెప్పిన ఏ అంశాన్నీ కవి ఉల్లంఘించినట్టు కనిపించదు. మూల భారతాన్ని తెలుగులోకి తెచ్చుకోవటం వేరు, మూల రామాయణాన్ని తెచ్చు కోవటం వేరు. భారతంలో రసేతర శాస్త్ర భాగాలనేకం వున్నందున వాటిని కాదని తెలుగు భారతం వచ్చింది. మూల రామాయణమే మహా కావ్యమైనపుడు దాన్ని తెలుగులోకి తెచ్చుకోవట మెలాగ అన్నది చాలా క్లిష్టమైన ప్రశ్న. ఈ ప్రశ్నకు జవాబుగా ఈ చివరి అధ్యాయం రాయబడింది. ఇందులో పూర్వ గ్రంథంలో ప్రస్తావింపబడ్డ కథాంశాలు మూలంలో వున్నాయా లేవా అన్నది మాత్రమే చెప్పబడినది. ఆ పోలికలను దృష్టిలో పెట్టుకుని పూర్వ గ్రంథ విమర్శ అంతా వచ్చిందన్నమాట. కనుక, ప్రస్తుత విమర్శ గ్రంథంలో ఒక చక్కని పరిశోధన ప్రణాళికతోపాటు ఒక కత్తివాదర వంటి సునిశిత విమర్శ వున్నట్టు గ్రంథమే సాక్ష్యం చెబుతున్నది.

చాలావరకు పరిశోధనలో విషయ బాహుళ్యాన్ని ఇవ్వటమే జరుగుతుంది. కానీ, పరిశోధన విమర్శ స్థాయికి పెరగడమనేది ఇటీవల విశ్వవిద్యాలయ పరి శోధనలో వచ్చిన మార్పుగా గుర్తించవచ్చు. పరిశోధన అంటే కావ్యంలో ఈ

వృత్తాలు ఇన్నిన్ని వున్నాయని ఒక చార్టు వేసి చూపించటం కాదు. అది చాలా అవిమర్శక సంప్రదాయం, దాన్ని చెప్పినా చెప్పకపోయినా వృత్త ప్రయోగం లోని ఔచిత్యాన్ని విశ్లేషించటం విమర్శ సంప్రదాయం. కనుక, పరిశోధన విమర్శ స్థాయికి పెరగకపోతే ఆ జాతిలో మేధా నైశిత్యం లేదని అర్థం. లాంజినస్ అన్నాడు - విమర్శ ఒక ఉత్కృష్ట సంస్కృతికి పతాకవంటిది-అని. ఆ పతాకాంచల చలన ధాళధళ్యాలను ఈ విమర్శ ప్రతిబింబించుకోవటం చాలా ఆనందించదగ్గ విషయం. ఈ విమర్శక కిశోరం భవిష్యత్తులో ఆ పతాకను ఆంధ్ర విమర్శరంగం మీద ఆవిష్కరించాలని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

ఆనంతపురం

6-5-91

**ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు**

# అవతారిక

కావ్యావతరణకు ఒక హేతువు అవసరం. ప్రాచీన కావ్యాల్లో రాజాజ్ఞగానీ, దైవప్రేరణ కానీ హేతువులుగా కనిపిస్తాయి. పాత కథలనే మరీ క్రొత్తగా రచించేటపుడు కర్త ఎదుర్కొనే ప్రశ్న ఒకటుంది- 'మళ్ళీ ఎందుకు ఆ రచన?' అని. శ్రీమద్రామాయణ కల్పవృక్ష రచనపై ఇదే ప్రశ్నకు విశ్వనాథ సత్యనారాయణ 'నా భక్తి రచనలు నావిగాన' అని సమాధానమిచ్చాడు. అది స్థూలమైన జవాబు మాత్రమే తనకోసం మాత్రమే కళాసృష్టి చేసుకునే స్థితి కళాప్రపంచంలో సామాన్యంగా ఉండదు. కనీసం మరొక్కరి కోసమైనా ఆ సృష్టి నిర్దేశించబడుతుంది. అందుచేత కళాసృష్టికి పది కారణాలున్నా యనుకుంటే ఇది అందులో ఒక కారణం మాత్రమే. సంపూర్ణంగా అదే కారణం కాదు. ఈ దృష్ట్యా కల్పవృక్ష రచనకు హేతువులు ఏమిటన్నది ఒక ప్రశ్న.

విశ్వనాథకు తెలుగు రామాయణానువాదాల పట్ల తీవ్ర అసంతృప్తి ఉంది. మొల్ల, భాస్కర, రంగనాథ రామాయణాలలో ఆత్మను తాకే లక్షణం లేదని కవి తలచాడు. భారత భాగవతాలను అనువదించకుండా రామాయణమే ఎందుకు అని అంటే ఆ గ్రంథాల అనువాద స్థాయి మరొకరు తాకలేనంత ఉన్నతమయిందనీ, దానిని అందటం అసాధ్యమని విశ్వనాథ అన్నాడు.[1] ఈ మాటలను బట్టి కవి ఉద్దేశ్యం ఒకటి ఊహించవచ్చు. తాను కూడా రామాయణానువాదాన్ని అంత స్థాయిలో నిలపాలి అని ఆశించాడు.

రామాయణాన్నే రచనకు ఎంచుకోవడం వెనుక మరో కారణం వుంది. తన 'ఆత్మకథ'లో విశ్వనాథ చెప్పాడు. చిన్నప్పుడు విశ్వనాథ కవిత్వం వ్రాస్తుండగా వాళ్ళనాన్న కొట్టినంత పనిచేసి అన్నాడు: 'ఏదో ఇంగ్లీషు చదువు చదివి పెద్ద ఉద్యోగి వవుతావని నేను ఆశపడుతూంటే, ఈ పిచ్చికవిత్వం దేనికిరా నీకు?' చివరకు విశ్వనాథకు వాళ్ళ నాన్నకు రాజీ కుదిరింది. అయన విశ్వ

---

1. చూ. What is Ramayana to me. 1 వ వ్యాసం.

నాథతో అన్నాడు: 'నీవు ఏ క్లాసు తప్పితే ఆ క్లాసుతో నీ చదువు పూర్తి. రెండవది, నీవు వ్రాస్తే రామాయణమే రాయి, ఈ పిచ్చికవిత్వం వద్దు.' ఈ కథనంతా 'వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితి నంచనిపించుకో' అనే పద్యంలో సూచించాడు. ఇది తండ్రి ఆజ్ఞ. దీనికి జీవుని వేదన తోడయింది. అది అంతర్జ్వాల.

ఈ రెంటికీ తోడుగా కవి పేర్కొన్న మరొక అంశం ముని ఋణం. దేవ, పితృ, ముని ఋణాలనే ఋణత్రయంలో మొదటి రెంటి గురించి చెప్పాక చివరిదైన ఋషిఋణం చెబుతూ వాల్మీకిని ప్రశంసించాడు. అతని భాషాసామగ్రి, సత్కావ్య నిర్మాణ రేఖా సామగ్రి ఋణం తీర్చటం జన్మజన్మలకూ అసాధ్యం అని, వెంటనే 'ముని ఋణముదీర్ప నీ కావ్యమును రచింతు' అన్నాడు. అంటే, ఆ కావ్య నిర్మాణ రేఖా సామగ్రినంతా కల్పవృక్షంలో నిక్షేపిస్తున్నానని సూచించాడు.

ఋణత్రయం ఈ రచనకు హేతువు. ఇక తనకున్న రచనార్హతను నిరూపించుకుంటూ, కవి తన జీవిత విశేషాల్ని చెప్పాడు. పరమ భక్తాగ్రగణ్యుడికి తాను పుత్రుడు. తన తమ్ముడు 'పండిత కీర్తనీయు డిరుబాసల దిట్ట రసజ్ఞమౌళి' 'కవిత్వ కళోగ్ర కార్తికేయుండు.' అలాంటి తమ్ముడు పరీక్షించిన కవిత్వం తనది. దేశాన్ని తమ కవితా దిగ్విజయ యాత్రలతో సంపన్నం చేసిన సాహితీ మూర్తులు తిరుపతి వేంకట కవులలో ఒకరైన చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రికి తాను శిష్యుడు. ఆంధ్ర కవిలోకమూర్ధమణులైన మహాకవుల కావ్యాలకు, సంస్కృత నాటకాలకు తాను నిత్య పాఠకుడు. అవిరామ పరిశోధకుడు. ఇదంతా కల్పవృక్ష రచనకు తాను ఎలా అధికారి కాగలడో చెప్పటమే.

తన కవిత్వ లక్షణం చెపుతూ, 'నిత్యవేగి' అన్నాడు. ఈ వేగంలో వ్యవహార పదాలు ఎక్కువ వచ్చిపడతాయి. 'అలాగటోయి ఏలాగూః', 'ఈ రాజేమి రాజౌనా'-ఇలాటి మాటల్లో ఆ వ్యవహారభాష కనిపిస్తుంది.

అవతారికలో పూర్వప్రచురణతో ప్రస్తుత ప్రచురణ (1976) భేదిస్తూంది. పూర్వగ్రంథ అవతారికలో 160 పద్యాలు ఉండగా ప్రస్తుతం 75 పద్యాలు మాత్రం వున్నాయి. వీటిలో కొత్తగా చేరినవి 16 పద్యాలున్నాయి. అంటే

దాదాపు నూరు పద్యాలకు పైగా వదిలివేయబడ్డాయి. ఆ విషయాలు ముక్త్యాల రాజవంశచరిత్రకు సంబంధించినవి.

పూర్వావతారికలో కనిపించే 'నన్నయ్యయు తిక్కన్నయు' అన్న పద్యం క్రొత్తప్రతిలో లేదు. క్రొత్తప్రతిలో 51వ పద్యం 'యువరాజు వచ్చి రాజ్యో దంతములు చెప్ప...' తర్వాత 'వారి వంశంబున రామలింగయ్య యను దొర' అని వుంది. ఈ రెంటికీ మధ్య 'వారి వంశంబు వక్కాణించెద' అని ఒక దీర్ఘవచనం పాతప్రతిలో వుంది. 'అట్లు వేదాద్రియు...' (53ప.) తర్వాత రాజ వంశక్రమం ఇరవై ఏడు పద్యాల్లో సాగింది. ఇది కొత్తప్రతిలో లేదు. ఇక కొత్తగా చేరిన పద్యాలు కొన్ని వున్నాయి. క్రొత్తప్రతిలో 36వ పద్యం నుండి 39వ పద్యందాకా, 62వ పద్యం నుండి 73వ పద్యందాకా క్రొత్తగా చేర్చ బడ్డవే. వీటిలో 'ఎదకు పురాంధ్ర...', 'నాది వ్యవహారభాష...' ఇత్యాది పద్యా లున్నాయి. తొలగించినవీ చేర్చినవీ కాక సంక్షిప్తీకరించిన వచనం ఒకటి వుంది. ప్రస్తుత ప్రతిలో 56వ వచనం 'అస్మత్కావ్య శ్రోతలైన కనకవల్లీ...' ఇత్యాదిగా వుంది. పాతప్రతిలో ఇక్కడ ఒక దీర్ఘవచనం వుంది. దానికి ముగింపుగా 'ఈ కనకవల్లి...' అని తర్వాతి పద్యానికి సమన్వయింపబడింది. ఇదంతా సంక్షిప్తంగా ఒకే వాక్యంలో క్రొత్త ప్రతిలో చెప్పబడింది.

అవతారికా పద్యాల్లోనేకాక ఖండాంత పద్యాల్లోకూడా ఈ ప్రతుల మధ్య భేదముంది. పాతప్రతిలో వరుసగా ఖండాంత పద్యాలివి:-

శివభవత్తనుపూజయై తవులు గాక
బాలకాండేష్టి యిది చంద్రమౌళి నృపతి
వినియెనెది సత్యకవి వల్ల విశ్వనాథ
పార్వతీ శోభనాద్రి గర్భంబు వలన. (ఇష్టి)

శివ భవన్మూర్తి పుల్కలై చెలగు గాత
మిద్ది యవతార ఖండంబు నెద్ది వినను
మనసు పడియెను దా జంద్రమౌళి నృపతి
నా వలన సత్యకవి విశ్వనాథు వలన (అవతార)

ఓయి నా ప్రాణనాథ శివా ఋషియు న
హల్య ఖండంబు నీ కృపకగును గాక!
పార్వతీ శోభనాద్రి గర్భంబు రచన
యల్ల ముత్యాల పతి వినన్నైన రచన. (అహల్య)

క్రొత్త ప్రతిలో ఈ పద్యాల స్థానంలో వచ్చిన పద్యాలివి :

'ఈ కావ్య శ్రోతృతకును...' (ఇష్టి)

'ఈ కావ్య శ్రోతృవితతి...' (అవతార.)

'అఱుగురు శ్రోతలైన మహాకృతి ఇది...' (అహల్య)

ధనుస్సు, కళ్యాణ ఖండాంత పద్యాల్లో రెండు ప్రతులకూ భేదం లేదు.

# జీవుని వేదన

కల్పవృక్ష రచనకున్న ప్రధాన ప్రేరణలలో తండ్రి ఆజ్ఞ బాహ్య విషయం కాగా, జీవుని వేదన అంతర విషయం. సర్వ జీవరాసుల స్పందనను తనలో పొందే ఆర్తి పేరు జీవుని వేదన. లోకంలోని వేదన జీవుని వేదన ఒకటి కాదు. మానవ ప్రయత్న వైఫల్యాలో, శారీరక రుగ్మతలో తదితర లౌకిక కారణాల మూలంగా కలిగే వేదన సకారణం. దానికి ఓదార్పు వుంది. ఒక ప్రయోజనంకోసం పడ్డ ఆరాటమే తప్ప అది వేదన కాదు. జీవుని వేదనకు కారణం దొరకదు.

"ఈ యనిలాధ్వమెల్ల నినదించెడి మువ్వల మ్రోత దూరమై
పోయెడి గోతతిన్ పిలుచువోలిక యేదొ వినిస్వనించెడున్
రాయిడి పొందుచున్ దెలియరాక వగర్చి—" (శృంగార వీథి)

ఇది దాని స్వరూపం. లోలోపల రగిలే అసంతృప్త జ్వాల అది. ఇద మిత్థంగా కారణం తెలియని కలత అది. ఆ వేదన కవిత్వ హేతువు తప్ప లోకంలోని ఏడుపుకాదు. జీవుడు అనే మాట ఆత్మను సూచించే వేదాంతపరిభాష. మనిషి లోపలి మనిషిని జీవుడంటారు. అతడు పొందే వేదన జీవుని వేదన. ఇదంతా కవి మనస్సుపొందిన తాత్త్విక చింతన.

'దేహమ్ము మన్నంతన జీవి పొందనగు బాధా సహ్యతల్ చెప్పగా శక్యమ్మా!' అని రాముడనటంలో ఈ వేదన వుంది. 'గౌతమ ఋషీంద్రుని భార్య యహల్య యెంత పడ్డది!' అనటంలోనూ అదే వేదన వుంది.

జీవుని వేదన అనేమాటకు నేపథ్యంగా క్రైస్తవ, బౌద్ధమత భావాలు కనిపిస్తున్నాయి. ముఖ్యంగా అహల్యగురించి రాము డనుభవించిన దుఃఖానికి ఈ భావనేపథ్యముంది. వ్యభిచారంలో పట్టుబడిన స్త్రీని రాళ్ళతో కొట్టి చంపాలని ధర్మశాస్త్రం చెప్పిందని క్రీస్తుతో శాస్త్రులన్నపుడు అతడన్నాడు: "మీలో పాపం లేనివాడు మొట్టమొదట ఆమెపై రాయి వేయవచ్చు." ఈ మాటల్లో మానవ

బలహీనతలపట్ల కారుణ్యం వుంది. ఇంచుమించు ఇదే భావంతో వున్న ఉపగుప్త వాసవదత్త కథలోకూడా ఆ కరుణే వుంది. ఈ బౌద్ధగాథలో వ్యాధిపీడితురాలైన వేశ్య నగరం వెలుపల పడివుండగా ఉపగుప్తుడనే సన్యాసి ఆమెను కాపాడ్డానికి వెళతాడు. పాపిని పరమ క్రూరంగా శిక్షించటం వేరు. ప్రేమతో చేరదీసి పరిణమింపచేయటం వేరు. ప్రతి యోగికీ ఒక గతమూ, ప్రతి పాపికీ ఒక భవిష్యత్తూ వుంటుందని ప్రసిద్ధోక్తి. ఆ దృష్టితో నేరాన్ని శిక్షించాలి. శిక్షకు మూలం ప్రేమ తప్ప ద్వేషం కాదు. 'అహల్య ఎంత పడ్డది' అన్నపుడు 'పాపం' అని జాలిపడటం కనిపిస్తుంది.

సర్వ జీవరాసులపట్ల సానుభూతిగానూ, తన ఆంతర జగత్కల్లోలాల గురించి కవి పూరించిన మౌనరోదనాశంఖంగానూ జీవుని వేదన కనిపిస్తుంది. ఇది సుఖదుఃఖాదిక ద్వంద్వాతీతం. తీగలు బిగించబడ్డ విపంచిలాంటి కవి హృదయాన్ని 'ఝు'మ్మని మ్రోగించే వాతాహత మిది. కావ్యహేతువిది.

# ఖండ విభజన

కల్పవృక్షంలో ప్రతికాండను అయిదు ఖండాలుగా విభజించటం జరిగింది. ఇది రచనా ప్రణాళిక. తత్పూర్వ కవులు బాల, ఆయోధ్య ఇత్యాది కాండ విభజన చేశారే గానీ ఖండ విభజన చేసిన వారు మృగ్యం. ఇది కొంత వరకు ఆశ్వాస విభజన లాంటిది. ఆశ్వాస విభజనకు సంఖ్యలుంటాయి. కానీ ఖండ విభజనకు పేర్లుంచబడ్డాయి. ప్రతి కాండలోనూ ఖండ సంఖ్య అయిదే. ఇదొక పథకం.

బాలకాండలో వరుసగా ఇష్టి, అవతార, అహల్య, ధనుః, కళ్యాణ ఖండాలున్నాయి. ఈ నామకరణ విధానం సంస్కృత నాటక కర్తలైన శూద్రకుడు, విశాఖదత్తుడు తదితరుల్లో కనిపిస్తుంది. ఈ ఖండ విభజన వెనుక మరొక అర్థం కనిపిస్తూంది. కావ్యనామంలో వృక్షశబ్దముంది- కల్పవృక్షం అని.

> 'పంచ భూతములను పంచ శాఖలు సాగి
> యైదు గుణంబుల నవఘశించి...'

'చెట్టుగాని చెట్టు తనమ్మ్రన'కు అంజలిస్తున్నానని అహల్య రాముని స్తుతించింది. ఈ వృక్షానికి కొమ్మలైదు. ఇవే పంచభూతాలు, పంచేంద్రియాలు. ఈ విధంగానే కాండకు ఐదు ఖండాలున్నాయి. ఇది అధ్యాత్మ దృష్టితో పంచ భూత, పంచేంద్రియాల సూచన.

ఈ కాండలోని ఖండ విభజనకు సంఘటనలు ఆధారం, పుత్ర కామేష్టి ప్రధానాంశంగా కలది ఇష్టిఖండం. ఈ ఖండం ముగింపులో యజ్ఞ పురుషుడు పాయస పాత్రను ఇచ్చిన వర్ణన వుంది. ఈ పద్యానంతరం 'అవతార ఖండం' ఆరంభమవుతుంది. 'ఇష్టి'కి ఫలంగా భగవదవతరణ జరిగింది. ఆ సూచన ఖండ నామకరణంలో వుంది. శ్రీరాముడు ధనుర్విద్యా ప్రవీణుడై, ఆ విద్యా సాఫల్యం కోసం ఎదురు చూస్తున్నాడని ఈ ఖండం ముగిసింది. సరిగ్గా ఆ

సాఫల్య మార్గమితడే అన్నట్లు కౌశికుని ప్రవేశంతో తర్వాతి ఖండం ఆరంభ మవుతుంది. ఇక్కడ అహల్యకు అగ్రపీఠం వేయబడింది. లోకదృష్టిలోని జారిణి కాదు. ఇక్కడ ఆమె యోగిని. అందుకని ఈ ఖండానికి 'అహల్యా ఖండ'మని పేరు. తర్వాత ధనుష్ఖండం ఈ ఖండారంభ పద్యమే అహల్యా ఆశీర్వచనం- 'వింటి కోసలయందు విజయమగుత' అని. ఇది రాబోయే శివధనుర్భంగ విషయం. ఈ ఖండంలోనే శివధనువు భంగించబడింది. ఇక్కడే భార్గవరాముడు క్రోధఘూర్ణితుడై వచ్చి, శ్రీరాముని విష్ణు ధనుర్ధారిగా చేశాడు. శ్రీరాముని ధనూ రావం దైతేయలోకాల్లో మ్రోగిందన్న వర్ణనతో ఈ ఖండం ముగిసింది. ధనుస్సు ప్రాధాన్యమైన ఖండం ధనుష్ఖండం. ధనుర్ధ్వని దైతేయలోకాల్లో వినిపించిందని వర్ణించటంతో శ్రీరాముడు ఆ లోకాల్ని జయించేంతటి శక్తిమంతుడైనాడని స్ఫురిస్తూంది. ఆ తర్వాత గానీ అతడు కల్యాణ రాముడు కాలేదు. ఈ వర్ణన తర్వాత వెంటనే కల్యాణఖండం ఆరంభమవుతూంది. ఈ ఖండంలోనే శ్రీరాముడి వైరాగ్య శృంగార భావాలు వశిష్ఠ గీతోపదేశం చేత 'సమప్రసారరమ్యము' లైనాయి. ఈ విధంగా ప్రతి ఖండమూ తర్వాతి ఖండంలోకి చొచ్చుకుని పోవటం కల్పవృక్షమంతటా కనిపిస్తుంది.

బాలకాండ చిట్టచివర సమచిత్తవృత్తి సంతరించుకున్న శ్రీరాముని గురించి వుంది. ఈ కాండ అనంతరం 'అయోధ్య కాండ' రానున్నది. అందులో ప్రథమంగా 'అభిషేక ఖండం' వుంది. కాండ వివక్ష లేకుండా చూస్తే, కల్యాణ ఖండం తరువాత అభిషేక ఖండం వస్తుంది. సమచిత్తవృత్తి కలిగిన రాజు పట్టా భిషేకానికి యోగ్యుడని సూచిస్తూ అభిషేక ఖండంతో ఈ ఖండం అనుసంధించ బడతూంది.

# సంబోధనా శిల్పం

ప్రబంధకవులు అధికభాగము సంబోధనల విషయంలో శాబ్దిక ప్రాధాన్యత తోనే రచించారు. 'నీరజాక్షి' 'పద్మనేత్రి' వంటి సంబోధనలు కావ్య ప్రపంచం లోకి అడుగుపెట్టేనాటికి వాటి ప్రయోజనం నెరవేర్చినా రాను రానూ అవి అరిగి పోయాయి. ఒక పడికట్టు మాటలై గణాలు నింపటానికి పనికివచ్చేవిగా తయా రయ్యాయి. తరాల తరబడి ఒకే రకం సంబోధనలు విని విని పాఠకునికి విసుగెత్తింది. ఆయా సన్నివేశాల్లోకి రసముగ్ధ్నుడయ్యే అవకాశం సన్నగిల్లింది. శిథిలమైపోతున్న అర్థ శిల్ప భవంతికి నగిషీలు పట్టి జిగేలుమని మెరిపించే శిల్పి రంగప్రవేశం చేయాల్సిన అవసరం హెచ్చింది.

ఏ సంబోధన అర్థవంతమో, కావ్య సందర్భానికి అన్వయం పొందుతుందో అది సప్రయోజకం. అనేకమంది కవులు కేవలం శబ్దానికి ప్రథమ స్థానమిచ్చి అర్థానికి రెండోస్థాన మివ్వటంచేత కూర్పులో సొగసు వున్నా సందర్భానికి అన్వయించని సంబోధనలు వచ్చాయి. సంబోధనల్లో అర్థసంపద అవసరమైంది.

విశ్వనాథ సంబోధనలు చాలాచోట్ల అతిదీర్ఘంగా సాగివుంటాయి. 'వాని మీసాలు విశ్వనాథ సమాసాలు'1 అని ఉపమింపబడ్డాయి అయితే ఈ దీర్ఘ సమాసాలకు మూలం ఆంధ్రమహాభారతంలో వుంది 'ఘోరారి మదకుంభికుంభ విదారణ దారుణ కృపాణ దక్షిణహస్తా'2, నిఖిల మహీ వలయోద్వహ బాహు విష్ణు వర్ధనమూర్తీ3 'శ్రీమత్తులసీ పల్లవ దామచ్ఛవి లబ్ధ మరకత ప్రతిమత్వోద్దామ ప్రభాస్థిమాలా శ్యామాయిత విపులవక్ష'4 అని కవిత్రయం చేసిన సంబోధనలు, అటు తర్వాత కాలంతో ఆశ్వాసాంత పద్యాల్లోని దీర్ఘ సమాసాలకు ప్రేరణ నిచ్చాయి. ప్రబంధాల్లో ఈ సంబోధనలు కథా సందర్భంలోకి ప్రవేశించాయి. 'ఓ మణిగణ ప్రోతాసి వాతాశన ప్రారజ్యత్కటి చక్ర'5 అని పెద్దన 'ఓ వల మాన మీన మిధునోపమలోల విలోచనాంత కాంతా'6 అని భట్టుమూర్తి తదితర కవులు ప్రయోగించటంలో ఈ ప్రయత్నమే కనిపిస్తుంది. అయితే ఇలాటి

సంబోధనలు ఆయా కావ్యాల్లో క్వాచిత్కంగా కనిపించాయి. విశ్వనాథ వీరితో ప్రేరితుడయ్యాడు. విస్తారంగా దీర్ఘ సంబోధనలు ప్రయోగించాడు. వీటిలోని అర్థసౌందర్యం పాఠకుని గాఢ భావనాశీలతను కోరింది. అందుచేతనే 'సంబుద్ధి శిల్పం'7 చర్చనీయాంశమైంది. బాలకాండలోని సంబోధనలను ఈ దృష్టితో విశ్లేషించటం జరుగుతుంది.

ధనుర్వినిర్గత పృషత్కదారిత శత్రూ (ఇష్టి. 390)

అశ్వమేధం నిర్వర్తించిన దశరథుడు క్రతుధర్మానుసారం తన రాజ్యాన్ని బ్రాహ్మణులకు ధారపోస్తే వారిలా పిలిచి తిరిగి ఇచ్చేశారు. బ్రాహ్మణులకు రాజ్యమిచ్చి 'తెలపి సంప్రాప్తించె నీనాటికిన్' అని రాజ్యం వీడి వెళ్ళబోగా, వారు 'ధనుస్సుతో శత్రువును జయించగలిగిన వాడా, నీ రాజ్యం మాకెందుకు' అని తిరస్కరించారు. క్షాత్ర శక్తి గలిగిన నీవే రక్షించాలి తప్ప మేము వేదాధ్యయనంలో నిమగ్నులం అన్న అర్థం ఈ సంబోధనలో వుంది.

సాగర కన్యకా కరతల స్పర్శాత్త రోమాంచ
సుశ్లీమచ్చిక్కణ మూర్తి (అవతార. 63)

విష్ణువును ఇంద్రుడు పిల్చిన పిలుపిది - 'లక్ష్మీదేవి హస్తస్పర్శతో రోమాంచం పొందేవాడా' అని. రాక్షస సంహారార్థం భూలోకావతరణ చేయుమని విష్ణువును ఇంద్రుడు కోరుతూ ఈ మాటన్నాడు. నీవు సుకుమారుడివి - అని చెబుతూనే యుద్ధంచేసి దానవుల్ని సంహరించు అనటం లౌక్యంగా వుంది. ఈ శృంగార సంబోధన ఇంద్రుడికీ విష్ణువుకీ మధ్యనున్న చనువును సూచిస్తూంది.

ఉదిత మహాకార్ముక సోగ్రదోః ప్రతాప నవ వహ్నికా
(అహల్య. 213)

యజ్ఞరక్షణానంతరం కౌశికుడు రాముని మెచ్చుకుంటూ ఇలా పిలిచాడు. ప్రతాపవహ్ని అనేది కవి సమయం యజ్ఞరక్షవేళలో సుబాహుని దహించటంచేత అది నిజంగానే వహ్ని. విశ్వామిత్రుడిచ్చిన అస్త్ర శక్తిని సక్రమంగా ప్రయోగించి రక్షగా నిలిచాడు రాముడు. కౌశికునికి ఇది ఆనంద హేతువు. ఆ శక్తి సార్థకమైందన్న సంతోషమే ఇక్కడ 'నవ' శబ్ద ప్రయోగంలో వుంది. 'నవ శక్తి' కనుక.

దుష్టధీ నివిష్టా ఘోహా (అహల్య 528)

ఇవి గౌతముడి క్రోధపూరిత వాగ్ధార. అహల్యను అపవిత్రగా చేసిన ఇంద్రునికిది సంబోధన. ఇంద్రుడు మాయ వేషంతో కోడిగా కూసి గౌతముని బయలుదేరదీసి అతడి ధర్మపత్నిని అధర్మమార్గాల నడిపించాడు. కనుక అతని 'ధీ' శక్తి 'దుష్ట' మైన 'ఊహతో' 'నివిష్ట'మైంది. గౌతముడి మాటల్లో ఆ విమర్శవుంది. సురేశ్వరునితో చులకనగా మాట్లాడరాదనే గౌరవమూ, దుష్టబుద్ధి గల వాడెవడైనా నింద్యుడే అన్న తెగువా సంబోధనలో ఎగుడు దిగుళ్ళను సృష్టించాయి. సంబోధనలోని ద్విరుక్త 'ష్ట'కారం, మహా ప్రాణాక్షరాలు వక్త చిత్తవృత్తిని వ్యంజించేవి.

సర్వకార్ముక విద్యా ప్రశస్త హస్త (ధను: 102)

శ్రీరాముడితో కౌశికుని వీర శృంగార విజయాల గురించి చెబుతూ శతానందుడు ఈ సంబోధన చేశాడు. అతడి కథనంలో బ్రహ్మర్షి వశిష్ఠుడి పైకి కౌశికుడు ధర్మచక్ర, వాయవ్య శరాది అస్త్ర విద్యనంతా ప్రయోగించాడు. అయితే ఈ శక్తినంతా వశిష్ఠుడి బ్రహ్మదండం మ్రింగేసింది. ఈ సన్నివేశం దగ్గర కథ నాపి శతానందుడు రాముడిని ఈ పిలుపుతో పిలిచాడు. 'ధనుస్సంపద గురించి సామాన్యుడికి చెప్పాలి గానీ సర్వకార్ముక విద్యనూ తెలిసిన నీకేం చెప్పేది' అనే అర్థమూ, కౌశికుడు ఇచ్చిన అస్త్ర విద్యలన్నీ నీ వద్ద వున్నాయి. అతడి అస్త్రశక్తి ఎంతటిదో, దాన్ని మ్రింగిన బ్రహ్మదండం ఎంతటిదో వేరే చెప్పాలా అనే అర్థమూ దీనిలో వున్నాయి.

మధుమూర్తీ! (ధను: 206)

దశాబ్దిపాటు వశం చేసుకున్న మేనకతో కౌశికుడన్న మాట ఇది. పదేళ్ళ తర్వాత గానీ కౌశికుడికి తన తపస్సు దారి తప్పిందని తెలిసిరాలేదు. ఆ జ్ఞానం వెలిగే కళ్ళను చూసి శపిస్తాడేమో అని మేనక వణుకుతూ నిలబడింది. అపుడన్నాడు - పని దేవతలదే అయినా నీ ప్రేమ మరుస్తానా అని. తన తపో ధర్మాల్ని విస్మరించటానికి హేతువు మోహమనే మధువు. దాన్ని మూర్తిగా దాల్చింది మేనక. అందుకు ఈ మాట.

నెట్టికసీల (ధను. 418)

'నైష్ఠికశీల' అనే మాటకు ఇది వికృతి. బ్రహ్మచారి అని నిఘంటు అర్థం. పరశురాముడు శ్రీరాముడితో అన్న మాటలివి. ఇది తత్కాలంలో రాముడి వేష ధారణను సూచిస్తుంది. అహల్యాఖండ ప్రారంభంలో రామలక్ష్మణులు 'కావిరంగుల గూడకట్టులవారలు మొగము కుంకుమబొట్లు నిలుపువారు అని వర్ణించబడ్డారు. ఇదే రూపంతో వారు యజ్ఞవాటినుండి మిథిలకు వచ్చారు. అక్కడ ధనుర్భంగమయ్యాక పరశురాముడు ప్రవేశించి ఇలా పిలిచాడు. ఈ సంబోధన పాత్ర ఆహార్య విశేషాల్ని సూచిస్తుంది.

ఇటువంటి సంబోధనలు బాలకాండలో అర్ధ శతకం కంటె అధికంగా వున్నాయి. వాటి వివరమిది : వీటిలో 'పూత చరిత', 'ముద్దుబిడ్డ', 'కుమారి' 'ప్రభూ' ఇత్యాది సంబోధనలను చేర్చలేదు. విశ్వనాథ ముద్ర కల్గిన మాటలు మాత్రం చేర్చబడ్డాయి. పడికట్టుగా వున్న సంబోధనలను చేర్చలేదు. ఖండాద్యంత పద్యాలను గ్రహించలేదు. కథాసందర్భముతో ముడివున్న వాటిని మాత్రం స్వీకరించటం జరిగింది.

## ఇష్టిఖండం :

వృథాశోకి (43), పృథ్వీరాజ్య ప్రియకేకి (43), ధరణీ వరాహ (68), ధూతాఘమతీ (80), అమృతాంశు ముఖమండలా (87), మత్స్య పుచ్ఛాభిరామ విలోచనాంచల (87), సాద్భుతమంత్ర వినిర్ణయాకృతీ (146), త్రయీ శిఖా బుద్ధిధునీ (202), క్ష్మాయోషాహృదయనాథ (421)

## అవతారఖండం :

జగచ్ఛ్రేణీభూత నవాంకురాది నవతా శ్రీమంజు బీజాకృతీ (96), శ్రీ జేతృ దిలీపాన్వయ భూజాని లతాగ్ర భాసిపూవా (296), అయోధ్యామహా పత్తనీ ప్రజ కంటిపాపవెలుగ (329)

## అహల్యాఖండం :

రఘుప్రవృద్ధ నయనోజ్జ్వల శీతమయూఖ (25), చాపముఖ సంధిగ్ధాసురాసు వ్రజా (304), తాటకా ప్రాణహరణ పుణ్యవాహినీ భగీరథ (487), సుబాహు ప్రాణజలధి మందర (487)

## ధనుష్ఖండం :

మిథిలా వృద్ధ శ్రవా (18), శోభాంగ పల్యంకికా (225), స్వప్రశస్త కథా పరిష్కాశితాఘ (267), శ్రీ నిభృత మనోజ్ఞహాస చిత్రితవదనా (445), శివధనుర్ద్రోహీ (472), కల్యాణరామ (497).

## కల్యాణ ఖండం :

దయాగుణ పయోనిధి (18), మనీషి శిరఃప్రచలన్మహామణీ (204), పసి సామీ (242).

శిల్పదృష్ట్యా ప్రత్యేకత కలిగిన సంబోధనల వివరమిది. ఇవి అభినయ సూచకంగానూ, ఆహార్య సూచకంగానూ, వక్త చిత్తవృత్తిని తెలిపేవిగానూ వున్నాయి. కొన్నిచోట్ల ప్రసిద్ధ విషయాల్ని అప్రసిద్ధ సమాసాలతో చెప్పటం వుంది. ఉదాహరణకు 'మిథిలేంద్ర' అనే మాట మిథిలా నగరానికి రాజా అనే అర్థాన్నిస్తూంది. దీనిని మిథిలా వృద్ధశ్రవా అంటాడు విశ్వనాథ. ఇంద్రునికున్న వృద్ధశ్రవసుడనే నామాన్ని మిథిల + ఇంద్రలోని ఇంద్ర శబ్దానికి పర్యాయంగా ప్రయోగిస్తాడు. ఖగశతారి, మునిశతారి వంటి మాటలీ కోవలోవే. ఇవేకాక పద్యం మొత్తం సంబోధనలతో వుండేవి దాదాపు పదిదాకా వున్నాయి. సంబోధన కూడా ప్రయోజన సహితం కావడంతో అది శిల్పమవుతూంది.

## సూచికలు :

1. హరికథ చెప్తూ దీక్షితదాసుగారు ఎవరినో వర్ణిస్తూ ఈ మాటన్నారట. చూ. విశ్వనాథ కథ. పు. 3.
2. నన్నయ ఆంధ్ర మహాభారతం, అరణ్యపర్వం. 2 ఆ. 1 ప.
3. పైదే. అరణ్యపర్వం. 2-357 ప.
4. తిక్కన. ఆంధ్ర మహాభారతం. ఉద్యోగపర్వం. 4-1 ప.
5. మనుచరిత్ర 4-71 ప.
6. వసుచరిత్ర.
7. చూ. డా॥ టి. కోటేశ్వరరావు, ఆంధ్ర మహాభారతం - అనుశాసనపర్వ పీఠిక.

# ఆషాఢ మేఘము వోనివాడు

తన గొంతులోన నూగు నినాదము లపూర్వ
నినదితంబులు పైకి నిట్ట వొడిచి
తన గుండెలోన డాఁగిన మెత్తనగు చోట్లు
భావ రూపములంది పైకివచ్చి
తన సృష్టిలోన నుండిన క్రొత్త మాధుర్య
సీమలు క్రేళ్ళుగా జెంగలించి
తన యాత్మఁ దా నెఱుంగని యొక్క యానంద
పరిధి రేఖా స్వయం వ్యక్తి కలిగి

కనుఁ గొలఁకులందుఁ గన్నీళ్ళు గార్చి మెగ
గుర్వొడువఁ దనదేహ మా క్రొత్త బిగువు
లెచట దెచ్చెనా యని కనులింతలుగను
విచ్చి చూచుచు మునికుఱ్ఱ బిగువు చెడియె. (ఇష్టి-175)

ఋష్యశృంగ కథలో కీలకమైన పద్యమిది.

విభాండకుని కన్నులకు వెన్నెలవత్తి ఈ ఋశ్యశృంగుడు. ఇతడు ఆషాఢ మేఘ సదృశుడు. ఈ పోలికలో అతని తత్త్వ రహస్యం అంతర్భూతమై వుంది. అతడు ఎక్కడ వుంటే అక్కడ వర్షం కురుస్తుంది. అతనికీ వర్షానికీ ఏమిటి సంబంధం? ఈ కథలో ఆ రహస్యం వుంది. దీన్ని మనస్తత్త్వ శాస్త్ర దృష్ట్యా విచారించాలి.

మనోవిశ్లేషణా మార్గదాయకులైన ఫ్రాయిడ్, యూంగ్‌లాంటి వారి రాకతో సాహిత్యరంగంలో నూత్నదృక్కోణాలు ఏర్పడ్డాయి. మనిషి అంతర్గత శక్తులు సందర్భాన్ననుసరించి బయట పడతాయని వారు గుర్తించారు. ఉత్తేజితుడైన వ్యక్తిలో బీజ ప్రాయంగా వున్న వాసనల (ఫాజిల్స్) సన్నికర్షచేత ఆనందమో ఆవేదనో కలుగుతుంది. ఒక రమణీయ దృశ్యాన్ని కన్నప్పుడో, ఒక రసపూర్ణ

గీతాన్ని విన్నప్పుడో అతనిలో కలిగే ఆవేశమంతా ఈ వాసనం ప్రభావమే. ఏది వర్తమానంలో అనుభవించబడుతుందో అది తత్పూర్వమే వాసనా రూపంలో వుందన్న మాట. ఋష్య శృంగుడిలో జరిగింది కూడా అదే. అతడి'లోని' రహస్యాలన్నీ అనుభవాలుగా బహిర్గతమయ్యాయి. అగ్ని, తండ్రితప్ప మరొకటి తెలియని ఋష్యశృంగుడిలో కామ ప్రచోదన కలిగించాలని వేశ్యలు సంగీతాలా పన చేశారు. ఆ సంగీతమే అతడిలో కొత్తలోకాల వాకిళ్ళు తెరిచింది. ఈ లోకాలతనిలో వున్నవే. అంతదాకా తానెరుగని ఆనందం ఏదో అతనికి తోచింది. అవన్నీ అతనిలోనివే. అందుకే కవి మాటిమాటికీ 'తనగొంతులోని' 'తన గుండెలోని' ఇలా 'తన' అనేమాటను పదేపదే అని దీన్ని సూచిస్తాడు. ఆ రసానుభవం అతడిలో కలిగిన తొలి పరిణామం. ఆ తర్వాత అతనిలోనికి అసమశరుడు తొంగిచూశాడు. ఇంతటి తీవ్ర ప్రచోదనకు హేతువు అతడిలో స్త్రీ జీవ ప్రవృత్తి స్పందించటం.

ప్రాచీన భారతీయ సంస్కృతి, సాహిత్యం, కళలు అన్నింటికీ ప్రాతిపదికగా కామస్పృహ వుంటుంది. ఈ కథలోకూడా అదే స్పృహతో కూడిన అర్థముంది. ఇందులో సాంఖ్య రహస్యముంది. పురుషుడు మేఘమనీ, స్త్రీ క్షేత్రమనీ, రెంటి కలయికవల్ల సృష్టి సాగుతూందని సాంఖ్యం చెబుతుంది. ఋష్యశృంగుడు పుంశక్తి. సృష్టి సాగటానికి కామేచ్ఛ ముఖ్యం. 'ప్రజాయై గృహమేధినాం' అన్న వాక్యం సృష్టికార్యాన్ని సమర్థిస్తూంది. ఈ ధర్మ కామాన్ని నిగ్రహిస్తే సృష్టి సాగదు. బ్రహ్మచర్యం అనావృష్టికి దారితీయటంలోని రహస్యమిదే. మేఘం కురిస్తే వాన- వానతో సృష్టి - ఇది చక్రనేమి క్రమం. కానీ మేఘం కురవటం లేదు. ఈ దృష్టితోనే ఋశ్యశృంగుడు 'అషాఢమేఘ' సదృశుడయ్యాడు. ఈ మేఘం కురవాలంటే అతడు బ్రహ్మచర్యంనుంచి విరమించాలి.[1] ఋష్యశృంగుడి రథం నగరానికి వెళుతూంటే దారిపొడుగునా వాన పడింది. ఇది బ్రహ్మచర్యంనుండి గార్హస్థ్య దశకు పరిణమించిన ఋషికి సూచకం.

---

1. It is his fall from Chastity rather than his unbroken Chastity that brings the rain.
—Ascetism and Erotism in the mythology of siva P. 45.

ఇది 58 గద్య పద్యాల్లో నడిచిన కథ దీనిని చెప్పింది సుమంతుడు. విన్నవాడు దశరథుడు. ఇదొక చిత్రం. దశరథుడికి ఋశ్యశృంగుడి కథ తెలియక పోవట మేమిటి? శాంత తన కూతురు. అంతటి దగ్గరిబంధం వున్న దశరథుడికి సుమంత్రుడీ కథ చెప్పాల్సిన ఔచిత్య మేమిటి?

దీనికి సమాధానం కథలోనే దాగివుంది. సుమంత్రుడి ప్రధానోద్దేశ్యం ఋశ్యశృంగ మాహాత్మ్యం చెప్పటమే. దశరథునితో అతడన్న మాటలివి:

...రాజగోపాలక; నా
వినినది చదినది యొకటియ
చనినది నీ వెఱుగుదువును చారుల వలనన్. (ఇష్టి. 147)

ఇక్కడ ప్రసక్తమైన మాటలు రెండు. ఒకటి మంత్రి వినినది, రెండు చారులవలన రాజు వినినది. చారుల నివేదనలో క్లుప్తత వుంటుంది. అక్కడ సన్నిహిత సంభాషణ వుండదు. రాజు, రాజభక్తుడు-వీరిద్దరి స్థాయిల్లో మాటలుంటాయి. కానీ, మంత్రి వినటం వేరు. మంత్రాంగవేత్త కనుక తానే విచారణచేసి సమాచారం సాధించగలడు. ఇందుచేత రాజు విన్నదానికంటె మంత్రి విన్న విషయమే సూక్ష్మమైనది.

మరో అర్థంలో, 'చనినది నీవెరుగుదువును' అంటే 'నా వినినది ఎరుగవు' అని సూచ్యార్థం. అతడు విన్నది ఏమిటంటే-ఋశ్యశృంగర్షి వల్ల యజ్ఞం చేయిస్తే సంతానం కలుగుతుందని. ఈ విషయం ఒక్కసారిగా చెపితే రాజు భరించలేక పోవచ్చు. అందుచేత నెమ్మదిగా చెప్పాలి. కనుక మంత్రి తాను విన్న విషయాన్ని రాజుకు మెల్ల మెల్లగా చెప్పాడు.

# గాధిసూతి కథానకములు

బాలకాండ విశ్వామిత్ర కథాగుచ్ఛం. యజ్ఞరక్షణకు బయలుదేరిన రామ లక్ష్మణులకు దారివెంబడి ఆయా స్థల పురాణాల్ని వినిపిస్తూ నడిచాడు, విశ్వామిత్రుడు. ఇక్కడి కథలు కొన్ని విపులంగానూ, కొన్ని సంక్షిప్తంగానూ ఉన్నాయి.

తాటక వధఘట్టం శ్రీరాముని కోదండ పాండిత్యానికి ప్రదర్శన. లోక కళ్యాణార్థం ఆమెను వధించినా అది అతడి ధనుర్విద్యకు పరీక్ష అయింది. దీనికి నేపథ్యంలో వున్నశక్తి విశ్వామిత్రుడు అతడు బలాతిబల విద్యలను ఉపదేశించి, రాముడి సామర్థ్యాన్ని పరీక్ష చేశాడు. తాటకా సంహారం రాముడే చేయాలని కౌశికుడి ఆశ, అందుకే పదేపదే ఆతణ్ణి ఉత్సాహ పరుస్తాడు. 'ధనుర్బాహో మహోగ్రాకృతీ' అంటాడు. ఇది 'చదియగ వలెనన్నన్ చదియంగా వలయు నీదు చాపాగ్రమునన్' అంటాడు. 'స్త్రీవధ నా చేతకాదు' అని రాముడంటే, 'అధర్మ సహితలైన స్త్రీలు తొల్లి మహా పురుషులచే వధింపబడిరి; ధర్మంబు మాకు వదలుము. నీ ప్రథమ మార్గణ దర్శనోత్సాహులము మాకు కనువిందు సేయుము' అని తన ఆంతర్యం బయట పెట్టాడు. అమూలకమైన ఈ కల్పవృక్ష కల్పన తాటక వధ రహస్యాన్ని వ్యాఖ్యానిస్తూంది. ఇదంతా రాముడికి కౌశికుడు ఇస్తున్న శిక్షణ. 'సంధ్య సమీపిస్తూంది. రాక్షసులు నిశలో అధికబల వంతులవుతారు. వధించు' అని రాక్షసయుద్ధ మర్మం చెప్పాడు ఇది ప్రధానంగా రామ ధనుర్విద్యకు మెరుగు పెట్టే అంశమైనా దీనితో మరొక ప్రయోజనం ఏమంటే- తాటకాసంహారం వల్ల మారీచసుబాహులు బలహీనులవుతారు. వారి సంహారం సులభమవుతుంది. కౌశికుడికి రాముడంటే విష్ణువని చూచాయగా తెలుసు. అందుకే పదేపదే దివ్యానుభవం పొందుతాడు. దశరథునితో కౌశికుడు,

ఈ జులపాల జుత్తుగల యీ పసిబాలుని నేనెఱుంగుదున్
రాజ! యొసంగగావలయు రాముని నాకయి దైత్యలోక ప్రా
ణాజిర బద్ధ పీఠుడగు నట్టి యముండిత దాదితిప్రసూ
తాజినమంత తానొలుచు నద్భుత శౌర్యనిధాన మీతడున్. (అహల్య-41)

అనటంతో ఆ విషయం స్పష్టమైంది. పైగా జరుగబోయే కథనంతా అతడు ముందే దర్శించాడు. అందుకే 'నా విద్య నేర్పి పువ్వుల్లో పెట్టి నీ కప్ప గిస్తాను- ఆ తర్వాత నీవు అతణ్ణి వదులుకోవాల్సిందే తప్ప మాకెందుకు?' (అహల్య-38) అన్నాడు. ఇదొక సరదా మాటగా వున్నా రాబోయే అరణ్యవాస వృత్తాంతాన్ని సూచిస్తుంది. అతడికి రామావతార రహస్యం తెలుసు. ఆ అవతార ప్రయోజనం నెరవేరటానికి ఎంత దగ్గర మార్గముందా అని కౌశికుడు వెతుకు తాడు. రామునిలోని విష్ణ్వంశను మేల్కొల్పుతూ తానే తగిన మార్గాల్లో నడిపాడతణ్ణి.

కౌశికుడికి రామరహస్యం తెలుసనటానకి మరొక ఆధారం వుంది. దారిలో అలసి రామలక్ష్మణులు నిద్రిస్తూండగా కౌశికునితో దేవతలన్నారు: 'భృశాశ్వ మహాస్త్రముల్ రమాకాంతున కీయవే' (అహల్య. 153) అని. రమాకాంతుడే రాముడని కౌశికుడికి తెలియనిదే ఈ మాటను దేవతలెలా అనగలరు? రాముడిలో విష్ణ్వంశను స్ఫురింపచేయడానికి వామనుని కథ చెప్పాడు విశ్వామిత్రుడు.

అదితి గర్భంలో జనించి, వామనుడు యజ్ఞదీక్షలోవున్న బలిచక్రవర్తిని వరం కోరాలని వెళ్లాడు. అపుడు ఆ వామనుడు కోకిల నవ్వులతో, ఒంటిపోగు జందెంతో, గొడుగు, పావుకోళ్ళతో అందంగా వున్నాడట. కౌశికుడు ఈ మాట చెప్పి మళ్ళీ అన్నాడు: 'వటువెంత అందంగా వున్నాడనుకున్నావు?' అంటే లక్ష్మణుడు 'ఔను. ఎంతైనా అందంగా వుంటాడు' అన్నాడు. విని రాముడు నవ్వి పైకథ చెప్పండి అన్నాడు. రాముడికి ఒక గిలిగింత తోచి లీలా మాత్రంగా తానే వామనుడన్న స్ఫురణ కలిగిందేమో అని ఈ వర్ణనవల్ల అనిపిస్తుంది. పైగా సిద్ధాశ్రమం గురించి చెబుతూ కౌశికుడు 'ఇది విష్ణువు తపస్సు చేసిన చోటు' అన్నాడు. అక్కడితో ఆగక 'నీవే నారాయణుడివి' అన్నాడు. ఇవన్నీ రామునిపై ప్రభావం చూపాయి. ఆ రాత్రి తానే వామనుడయినట్లు కలగన్నాడు

(అహల్య. 196) రాముడు. తెల్లారగానే ఈ కలగాపులగపు తలపులతో కౌశికుని వద్దకు సందేహ నివృత్తికై వెళ్ళాడు. కౌశికుడు మౌనవ్రతంలో ఉన్నాడనీ మాటాడరాదనీ ఋషులన్నారు. కౌశికుడు రాముడిలో ఆ విష్ణ్వంశ గురించి తలపులు రావటం ఆశించాడు. అదే జరిగింది. ఇది రెండవ మెట్టు. తాను నారాయణుడన్న భావన రామునిలో జాగృతం కావడానికి అహల్య కథ మరింత తోడ్పడింది.

అహల్యా కథకు ముందుగా ధర్మకామంలో వుండాల్సిన దీక్ష, క్షమ ఎంత టివో, అవి ఇచ్చే సత్ఫలిత మెంతటిదో చెబుతూ కౌశికుడు కుశనాభతనయల వృత్తాంతం చెప్పాడు.

కుశుడనే ఋషికి కుశాంబుడు, కుశనాభుడు, అధూర్త రజసుడు, వసువు అని నలుగురు పుత్రులు. ఈ నలుగురూ నాలుగు రాజ్యాలు నిర్మించుకున్నారు. ఇంతదాకా చెప్పి కౌశికుడు తన బాల్యస్మృతి నెమరేసుకున్నాడు. 'నా చిన్ననాడు ఈ కొండలూ కోనలూ తిరిగాను. ఇక్కడి గాలులన్నీ నాలో గిలిగింతలు రేపేవి' అని గాలుల ప్రసక్తి తెచ్చాడు. ఈ కథలో వాయుదేవుడిది ప్రాధాన్యం. ప్రారంభంలో గాలుల ప్రసక్తి తెచ్చి, కథలోకి శ్రోతను తీసుకెళుతున్నాడు. ఇది కథన నైపుణ్యం. కుశనాభ తనయలపై మోహపడిన వాయుదేవుడు వారు నిరాకరించారనే కోపంతో వారి తనూ సౌందర్యాన్ని విశ్లథం చేశాడు. 'ప్రభంజన' శబ్దంతో ఈ దౌష్ట్యాన్ని చెపుతాడు కవి. విరుగగొట్టువాడు ప్రభంజనుడు అని వ్యుత్పత్తి. ఇది తెలిసిన కుశనాభుడు 'క్షమ' చూపాడు. తన తనయలకు 'సంబంధం' వెతుకుమని తన మంత్రులతో అన్నాడు. 'సంబంధం' అన్నాడే కానీ సంబంధాలు అనలేదు. మంత్రులిది గ్రహించి అప్సర తనయలకు అప్సర తనయుడే సరైన సంబంధం అని, బ్రహ్మదత్తుడిని ఈ శతకన్యలకూ జతగాడుగా ఎంచారు. చూళి అనే ఋషికీ సోమద అనే అప్సరకూ జనించిన బ్రహ్మదత్తుడు ఆ కన్యలను స్పృశించగానే వారి పూర్వ సౌందర్యం తిరిగి వచ్చింది. పితృవాక్యపాలన చేత వారికి వాయుశాపం లభించినా అది తాత్కాలికమే. ధార్మికుడైన ఋషి స్పర్శతో వారి సౌందర్యం వారికి వచ్చింది. ఇది ధర్మకామ వలం.

కౌశికుడు ఈ కథ చెపుతూ తన అక్కగారి ప్రేమ గురించి హృదయదఘ్నంగా తలపోశాడు. ఆమె పేరు సత్యవతి. ఆమెను ఋచీకుడనే ఋషికిచ్చి వివాహం చేశారు. అతడితో పాటు ఆమె స్వర్గానికి వెళ్ళింది. అక్కడి నుంచి నదిగా ప్రవహించింద. ఆమెకు కౌశికుడంటే అమిత ప్రేమ.

చలి కాలమున హిమాచల గంధకావర్త
ముల నీళ్ళులను వెచ్చగిలగ దెచ్చి
వేసంగి మంచు పూస కట్టుల నీళ్ళు
లొడ్డు ముత్తెపు బిందులొత్తిగించి

అతని జీవితాంతం తాను ప్రేమ మూర్తిగా నిలిచిపోయింది. ఇంతటి వాత్సల్య మూర్తిని విడిచి నేనే ఒక పనిపై సిద్ధాశ్రమం వెళ్ళవలసి వచ్చింది. నీ కృప చేత సిద్ధి కూడా పొందాను కనుక నీవే నారాయణుడివి అని రామునితో అన్నాడు కౌశికుడు. కథ కుశనాభ తనయల వత్తాంతంతో ఆరంభమై మళ్ళీ సిద్ధాశ్రమంతో ముడిపడుతూంది. అక్కడ కౌశికుడు వామనావతారం స్ఫురించేలాగ 'నీవే నారాయణుడివి' అన్నాడు. మాటి మాటికీ రాముని అవతార ప్రయోజనాన్ని గుర్తు చేస్తాడు కౌశికుడు. కౌశికుడు చెప్పే కథలు రాముడిలో బలమైన ముద్రలు వేశాయి. రావణ వధానంతరం సీతతో విమానంలో తిరిగివస్తూ రాముడన్నాడు - 'ఇంత ఎత్తునుంచి చూస్తే చిన్నవిగా కనిపించే ఆ పొలాలు, పురాలు నా చిన్నతనంలో కౌశికుడు చెప్పిన కథలోని కురచలైన కుశనాభ తనయల్లాగ వున్నాయి'[1] అని.

తర్వాత కౌశికుడు గంగావతరణ గాథ చెప్పాడు. గంగానదిని దాటాక విశాలపురి గురించి రాముడు కథ చెప్పమని అడిగాడు. 'నీ నోట నుండి వచ్చు [illegible]పలుకు క్షీరవారాశి తరగ చిలుకు' అన్నాడు. కౌశికుడు గడుసుగా 'క్షీరవారాశిని చిలుకు' కథ ఆరంభించాడు. సముద్ర మథన కథనంలో ఒక నాటకీయ ధోరణి వుంది. మందర పర్వతాన్ని కవ్వంగా చేసుకుని పాల సముద్రం చిలకటం ఆరంభమయింది.

---

1. యుద్ధకాండ; ఉపసంహారణ 296 ప.




'చిలుకుచు నుండగా నుదధి క్షీరము చిందిన బిందులద్భుతం
బులును విచిత్ర రూపములు పొందెడు—'

ఈ పద్య గమనంలోని ద్రుతగతి కథనంలో నాటకీయతను సృష్టిస్తుంది. మొదట చిలికినపుడు తరగల మీద దండ కమండలాలు, శంఖ చక్రాలు కనిపించాయట. ఇలాగే రెండవసారి 'చిలుకుచు నుండగా' అప్సరలు, మళ్ళీ 'చిలుకుచు నుండగా' వారుణి లభించాయి. చివరగా దక్కిన అమృతం విష్ణుమాయా విలాసం చేత సురలకు మాత్రమే దక్కింది. వారమరు లైనారు. అసురలను సంహరించారు. దితి గర్భశోకంతో కశ్యపుడిని చేరి ఇంద్రహంతను పుత్రుడిగా ప్రసాదించమంది. అతడు ఒక నియమం విధించి వరమిచ్చాడు. 'ఇంతయు శుచిత్వము పాయక' వేయేళ్ళు తపస్సు చేస్తే ఆమె గర్భంలో ఇంద్రహంత జన్మిస్తాడన్నాడు. ఇంద్రుడిది తెలిసి గర్భఛేదన కోసం ఆమెకు పరిచర్యలు చేయడమారంభించాడు. తొమ్మిది వందల తొంభై ఏళ్ళ తర్వాత ఆమె ఇంద్రుని సేవలకు సంతోషించి 'నా గర్భంలో ఇంద్రహంత జన్మింపరాదనీ, నీకు సోదరుడు జన్మించాలనీ ప్రార్థిస్తున్నాను' అంది. ఒక రోజు అశుచిగా వున్న అదితిని చూసి అవకాశానికై వేచివున్న ఇంద్రుడు గర్భప్రవేశం చేసి పిండాన్ని ఏడు ఖండాలుగా నరికాడు. అవే సప్తమరుత్తులయ్యాయి. దితి ఇంద్రునేమీ అనలేదు. 'తప్పు నాదే' అనుకుంది. అమె క్షమాగుణం విశ్వామిత్రునీ, రామునీ కూడా విస్మయపరచింది.

ఈ కథలను ముగిస్తూ విశ్వామిత్రుడు రాముడిని 'తాటకా ప్రాణహరణ పుణ్యవాహినీ భగీరథ' ఇత్యాది పిలుపులతో పిలిచాడు. ఈ సంబోధనతో గంగావతరణ గాథను తలపింప చేస్తున్నాడు. ఇలాగే సుబాహు ప్రాణజలధి మందర అనే మాటతో క్షీరసాగర మథన వృత్తాంతం, 'మారీచ ప్రాణ రక్షణ' అనే మాటతో ఇంద్రుడికి ప్రాణరక్ష కల్పించిన దితి కథ, 'క్షమాగుణ నిధి' అనే మాట ద్వారా దితి క్షమాగుణం తలపుకు వస్తున్నాయి. రాముడికి ఈ కథలు చెప్పటం గొప్పనో, భృశాశ్వ విద్యలివ్వటం గొప్పనో తెలియలేదు. ఈ కథల్లో రాముడిలోని విష్ణ్వంశను జాగృతం చేసే యత్నం సమృద్ధిగా వుంది.

# ఏమి సాగరుల్ వారలదేమి ప్రభులు

"......ఈ

శశ్వద్వారి త్రిమార్గగా ప్రథకు నే చందంబునన్ వచ్చె నీ
యాశ్వీనాక్రమణంబులో యను కథాత్తానంత విజ్ఞానమే
విశ్వంబుల్ వెలిగించు నా యెడద నే విందున్ వచింపంగదే (ధను. 275)

ఇది కౌశికుడు రాముడి నడిగిన ప్రశ్న. ఇందులో కౌశికుని కథా లక్షణాలు రెండు ప్రసక్తమయ్యాయి. ఒకటి, అది అశ్వగతిలాగా దూకుతూ పోతుంది. రెండు అవి విజ్ఞానదాయకాలు. కౌశికుడికి రాముడి శ్రోతృత కృప. 'నీ వినుటే బ్రహ్మరథంబు నాకు' అంటాడతడు.

గంగావతరణ కథను ప్రారంభించి గంగ స్వర్లోకపథ ఎలా అయిందో చెప్పి 'అది కథ' అని ముగించాడు విశ్వామిత్రుడు. శ్రోత మనఃస్థితిని కనుక్కోటానికి కథకుడు వేసే ఎత్తుగడ ఇది. శ్రోతకు ప్రధాన విషయం వినాలని ఆశ. వక్త చెప్పక ఊరిస్తున్నాడు. కథకుడు మార్గం తప్పేసరికి శ్రోతలో ఉత్సాహం నీరుగారిపోతుంది. అపుడు కథకుణ్ణి సున్నితంగా హెచ్చరిస్తాడు. రాముడదే చేశాడు 'మీకు శ్రమగా వున్నట్టుంది. వినటం మాకు కష్టంకాదు. రాత్రింబగళ్ళూ కథ చెప్పటం శ్రమ కదా' అని కౌశికుడితో అన్నాడు. ఇది వక్తకు హెచ్చరిక. 'నీవు వినటమే నాకు చాలు' అని కౌశికుడు రాముడిలో ఉత్సాహం రేపాడు. రాముడు మళ్ళీ గంగ త్రిపథగామిని ఎలా అయిందని అడిగాడు. కౌశికుడు సమాధానంగా కుమారస్వామి జనన వృత్తాంతం చెప్పాడు. చెప్పాక తన చాతుర్యాన్ని తానే వ్యాఖ్యానించాడు—

'అడిగినదేమొ చెప్పకువె యా యితరమ్మఖిలంబు చెప్పమా
యుడుగక యట్లె వించుబడియుందురు శ్రోతలు నిద్దియే సుమీ
గడుసరియౌ కథా కథన కౌశల' - (ధను. 306)

మన్నాడు. వారడిగింది తాను చెప్పలేదని కౌశికుడికీ తెలుసు. శ్రోతలో ఏది ఉత్కంఠతను కలిగిస్తుందో దాన్ని చివర చెప్పాలి. అపుడు దానికోసం తక్కినదంతా వింటారు. ఇదే గడుసరి కథనమట. గంగ కథను ఆరంభిస్తూ 'అసలు కథ జెప్పెదను విను'దని అనటం అందుకే.

'అనగననగ సగరుడన్నట్టి రాజు'. ఇది కౌశికుడి కథారంభం-ఈ పద్ధతి పసివారికి చెప్పేది. ప్రక్కన ఋషి సంఘమున్నా సరే, రాముడే ప్రధాన శ్రోత, అతడు 'పసిసామి'. కనుక ఈ శిశుధోరణి. కౌశికుడు గంగ కథ చెబుతూ అసమంజసుడి గురించి చెప్పాడు. అతడు 'పసిబాలుర గొనిపోయి సరయువు నడిపాయలోనికి ద్రోసి యొడ్డున రొండిన చేతులిడుకొని పకపక నవ్వుచుండును' అని చెప్పి ఒక దృశ్యాన్ని ఆవిష్కరించాడు కౌశికుడు. ఈ వర్ణన లేకుంటే కథకు కలిగే అర్థభేదం ఏమీలేదు. అయితే ఇలాంటి సూక్ష్మవర్ణనలే శ్రోతను తన్మయుణ్ణి చేస్తాయి. అందుకే రాముడికి ఋషులు చెప్పే కథలిష్టం. 'వీరంతర్ద్రష్టలు' అంటాడు లక్ష్మణునితో

ఈ వర్ణనలు విన్న శ్రోతలో కథా ప్రభావం సవ్యంగా వుండాలని వెంటనే అన్నాడు.

> ఈతియై పౌరులకు ధూమకేతువైన
> పుత్రకుని రాజు వెడలించె బురమునుండి
> అతని కొడుకు ప్రజాహితుం డంశుమంతు
> డరి ప్రియంవదు డతి సాధువైన బిడ్డ (ధను. 316)

అలాంటి అసమంజసుడు రాజ్యానికి ఈతిహేతువు. ప్రజాహితమే రాజు ఆకాంక్షించాలని సూక్తి చెప్పబడుతూంది. కథ శ్రోత మనోంతరాళంలోకి చొచ్చుకుపోతూంది. అందుకే కౌశికుని కథ 'విజ్ఞానహేతువు'.

ఈ కథలో ప్రాధాన్యం కథనానిదే. సాగరులు తామెలాగైనా యజ్ఞాశ్వాన్ని సంపాదించాలని భూమిని పెళ్ళగించట మారంభించారు. వారి మనసులో వున్న తొందర, వారి చేష్టలు, కలిగించిన వైఫల్యం కధకుడు చెప్పాలి. అలాంటి సన్ని

వేళాల్లో ఉచ్చారణా విధానమే ప్రయోజనకారి, అందుకే ఇక్కడ మేదినీ వృత్తాల్లో సాగరుల ప్రయత్నాన్ని వర్ణించాడు. ఈ వృత్తగతి వైఫల్య సూచకంగా వుంది. ఇది ఛందశ్శిల్పమని రచనా పరంగా చెప్పుకున్నా, కథకుడి గొంతులో తొణికే రసరహస్యంగా కూడా భావించాలి.

కపిలుని క్రోధాగ్నికి సాగరులు బూది కుప్పలైనారు. ఆ తర్వాత అంశుమంతుడు సాగరుల జాడకై వెదికి బూదిరాశుల్ని చూసి నిశ్చేష్టుడయ్యాడు. అతడు గంగకై తపస్సు చేశాడు. (ఆ తర్వాత దిలీపుడు) తర్వాత భగీరథుడు తపస్సు చేశాడు. కథలో భగీరథుని ప్రవేశం ఇలా వుంది.

'—భగీరథుం డంత రాజ్య
మునకు వచ్చెఁ దపోనిధి పుణ్యమూర్తి
పరమ ధార్మికు డఖిల దిగ్భరిత కీర్తి'

ఈ మాటలు వినటంతోనే శ్రోతలో సాధించే వ్యక్తి 'ఇతనేనేమో' అనిపించేంత దర్జాగా సాగింది ఈ రచన. ఇది నాటకాదుల్లో మహారాజపాత్ర ప్రవేశాన్ని సూచించటం లాంటిది. 'రాజాధిరాజ, రాజప్రతాప-' ఇత్యాది వాక్యాలతో పాత్రను ప్రవేశపెడితే ప్రేక్షకునికి ఎలా గగుర్పాటును కలిగిస్తాయో, ఇక్కడ ఈ మాటలూ ఆదే ఫలితాన్నిస్తున్నాయి. ఇది కథన నైపుణి.

తన తపోబలంతో దేవతలను మెప్పించి భగీరథుడు గంగను సాధించాడు. శివుని జటనుంచి దూకిన గంగ ఏడు పాయలై ఒకటి భగీరథు ననుసరించింది. అతడు సిద్ధంగా వున్న మార్గంలో వెళ్ళాడు. 'ఒకవేళ తమ కులోద్భవుడెవడైనా గంగ నావిర్భవింపజేసిన నామె తేవలసిన తోవగా' అతని పూర్వీకు లేర్పాటు చేసిన గుర్తులవి. మూలకథలోని గంగ నడకకు కల్పవృక్షంలో మార్గం కల్పించాడు. మధ్యమార్గంలో జహ్నుముని గంగను మ్రింగాడు. భగీరథుడు-

'ఇంకొక వేయియేండ్లు ప్రభు'యే నిను గూర్చి తపింతుగాని నీవింకకు సౌరవారి, విడువే-'

అన్నాడు. తన శక్తి అంతా తపమే. ఒకదైన్యం ఇక్కడ కనిపిస్తుంది. ఆ తర్వాత బూదిరాశుల్ని తాకిన గంగ వారికి ఉత్తమ లోకాలు కల్పించగా భగీరథుని బ్రహ్మ మెచ్చాడు. భగీరథుడు వినయంగా 'నా పూర్వుల తపస్సుఫలం నాకు చెందింది. అంతతప్ప నా గొప్పేముంది?' అన్నాడు.

కథ విన్న ఋషులు 'ఏమి కథ ఏమి చెప్పుట ఏమి సొగసు' అని ప్రశంసించారు. ఈ అనుభవం శ్రోతలది. అతిసూక్ష్మ విషయాలు కూడా కథలో చెప్పబడ్డాయి. మానవ మనస్తత్వంలోని బేలతనమూ, దాన్ని జయించే పట్టుదల రెండూ వున్నాయి.

కథారంభంలో కౌశికుని కథ 'విజ్ఞానబోధక'మన్నాడు రాముడు. ఇందులో వున్న విజ్ఞానం గంగావతరణకు సంబంధించినది. 'పదార్థం భస్మమయ్యాక చైతన్య ప్రవేశంతో గానీ ప్రాణవంతమూ, మనోవంతమూ కాదని సృష్టి రహస్యాన్ని[1] వ్యాఖ్యానించే కథ ఇది.

'నాకు సంతతిలేక యిక్ష్వాకు కులము
నంబులుపలంబు కడ నాగినట్టులాఁగెఁ
నేచి యీ రెండునుం బ్రవహింపవలయు.'

అని భగీరథుడు బ్రహ్మను కోరిన కోరికలో ఈ సృష్టిరహస్యం వుంది. బూది రాసుల్ని సురగంగ కడగాలి. తర్వాత తనకు సంతానం కలగాలి. గంగా స్రవంతినీ, సంతానాన్నీ ప్రవహించాలి అన్నాడతడు. సృష్టి చైతన్య శక్తిగా గంగను గుర్తించాడు భగీరథుడు.

ఈ కథలో భగీరథుడి వినయాన్ని రాముడు ప్రశంస చేశాడు. వనవాసం వెళ్లేవేళ తన ప్రయత్నాన్ని విరమింపజేయ చూచిన కౌసల్యతో రాముడంటాడు :

"మన పూర్వులు అంత కష్టపడి భూమిని పెళ్ళగించి నానా అవస్థలూపడి యజ్ఞాశ్వానికై వెదికారు. అది పితృవాక్యపాలన కాదా?"

(అయోధ్య. అభిషేక. 387)

---

1. చూ. గంగకథ. డా॥ టి. కోటేశ్వరరావు. పుట. 16.

ఇదీ కథాప్రభావం.

గంగావతరణ సమయంలో భూమి పొందిన అనుభవ మాధుర్యాన్ని కవి వర్ణించాడు. భూమి కొత్త పరిమళాలతో వుంది. నెరెల్రుపడ్డ నేల నీళ్లు పీల్చుకుంటుంది. నీళ్ళువస్తూంటే ముందున్న నేల నీరు తాకకనే చెమ్మగిలుతోంది. ఈ వర్ణన అంతా కవి స్వానుభవం ఆధారంగా చేసిందే. కవి వెలినూతలలో వున్నపుడు త్రాగునీరుకు ఇబ్బందిగా వుండేవి. దాపుల్లో వున్న కాలువకు ఏడాదికోసారి నీరు వచ్చేది. ఆ నీరు రావటం గొప్ప పండుగ. ఇన్నాళ్ళకు మంచినీళ్ళు వచ్చాయని ఆనందం. ఇదే కొద్దిగా మార్చి గంగ గురించి వర్ణించానని కవి తెల్పాడు.[1] కవి అనుభవం కథన నైపుణ్యం కలిసి కథావస్తువును రక్తి కట్టించాయి.

1. చూ. ఆత్మకథ. మేఖల-2. పు. 29.

# ఉపల హృదయవీథి ఉపనిషద్వితానం

విశ్వామిత్రుడు రాముడికి చెప్పిన కథల్లో ఇది చివరిది. అహల్య శప్తురాలు కావటం వరకు కౌశికుడు చెప్పాడు. తర్వాత కథ సమక్షంలోనే జరిగింది.

కల్పవృక్ష అహల్య మూలంలోని అహల్యకంటె భిన్నమైనది. కల్ప వృక్షంలో ఇంద్ర సంగమం చేయలేదు. అతని 'కనుల విలాసమున్ కన్నది' అంతే. ఇంద్రుడామెపట్ల మోహాగ్రస్తుడైనాడు. మునిచూస్తే ప్రాణాంతకమని ఆమె చెప్పినా వినలేదు. 'ఇది నీకైయది యెన్నియేండ్లు దిగులయ్యేన్ నా కహల్యా' అని దీనంగా వేడుకున్నాడు. వేయేళ్ళుగా బిగ్గబట్టిన అహల్య నిగ్రహం చలించింది. కోరివచ్చినవాడు దేవేంద్రుడని తెలిసి 'ఋతుకాలం కాదు పో' అంది. 'కోడి కూసెనె' అని తప్పుకోచూసింది. దానిలో రహస్యార్థాలు వెతికి తానే కోడిగా కూశాడు ఇంద్రుడు. శప్తుడైనాడు.

ఇంద్రుడికి ఇవ్వబడే శాపం గురించి కథలో ముందుగానే సూచించ బడింది. అహల్య 'అదనా యియ్యది కోడి కూసెనె' అన్న మాటతో అతడు రాత్రంతా ఆమె గురించి మనోహరంగా ఊహించుకున్నాడు. 'మనో ఒనుగా విశదతనూసమార్ద్రవినివేశనదర్శనధీరుఃరీసహస్ర శకలితాక్షి గోళు' డైనాడు. అతనిలోని కాముకత అతనికి సహస్ర దృశ్యాల నావిష్కరించింది. అతడికి దక్కిన శాపం కూడా చివరకు సహస్ర నేత్రాలే. గౌతముడు అహల్యను రాతివి కమ్మని శపించాడు. ఈ రాతి కావటం మూలభిన్నం. దీని ద్వారా నైశ్చల్యం ప్రాప్తిస్తుందని కవిమాట.

ఇక్కడ అహల్య జారిణి కాదు. యోగిని. 'ఎప్పుడు నీ మోహం విచ్చిపోతే అప్పుడు రాముడై స్వామివస్తాడు' అని గౌతముడన్నాడు. రాముడు రావాలంటే ఆమె పవిత్ర కావాలి ఇక్కడ ప్రయత్నా తీవ్రత సాధన వున్నాయి. మూలంలో

ఇలా లేదు. రాముడి రాకతో నీవు పవిత్రవౌతావు[1] అన్నాడు వాల్మీకి. మూలంలో లేని తీవ్రదీక్ష కల్పవృక్షంలో కనిపిస్తుంది. అందుకే రాముడి గాలిసోకి ఆమె శాపవిముక్త కాగా అంజలించి అతడిలోని అసలు మూర్తిని స్తోత్రం చేసింది.

సచ్చిదానందముల్ స్కంధత్రయము గుర్తు
గానున్న యొక చెట్టుగాని చెట్టు

అని రాముడిని గుర్తించింది.

'ఊర్ధ్వమూల మధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయమ్
ఛన్దాంసి యస్యపర్ణాని యస్తం వేద స వేదవిత్' (గీత. 15-1 శ్లో)

అని సృష్టిరహస్యం చెప్పబడింది. రాముడిలో ఆ సృష్టి ప్రతీకను చూసింది అహల్య. 'వృక్షమా మున్నె యున్నది బీజ నిర్గతంబయి' అనటంలో ఆ మాటను వ్యాఖ్యానించటమే వుంది. రాముడి మేనిగాలి సోకి అహల్య త్వగింద్రియం మేల్కొనింది. అతడి కాలి సవ్వడి విని ఆమె శ్రవణేంద్రియం, నెత్తావి పరిమళంతో ఆమె ఘ్రాణేంద్రియం, అతడి సామీప్యంతో ఆమె దర్శనశక్తి మేల్కొన్నాయి. శ్రీరాము డాతిథ్యం స్వీకరించటంతో ఆమె రసనేంద్రియం మేల్కొంది. పంచేంద్రియాల ఉనికికి పరమ ప్రయోజనంగా వాటిని పరమేశ్వర బద్ధం చేయటం ఇక్కడ కనిపిస్తుంది. ఆమె మోహం విచ్చిపోయింది కనుక రాముడు వచ్చాడు. కనుకనే ఆమె యోగిని అయింది. 'జానకి రామ' అని భవిష్యద్దర్శనం చేయటంతో ఇది మరింత స్పష్టమవుతుంది. అహల్యా శాప విముక్తి సమయానికి రాముడు వివాహితుడు కాడు. జానకి ఎవరో తెలియదు అయినా అహల్య జానకిరామ అంది.

మిథిలానగర సభలో అహల్య వృత్తాంతం తెలిసి శతానందుడు ఆనంద పడ్డాడు. మా తల్లి నీకు అర్ఘ్య మిచ్చిందా అని రాముని పదేపదే అడిగాడు. ఇది వస్తుదృష్ట్యా అవిభాజ్యతకు దోహదం చేస్తుంది. ప్రధాన కథకు అవాంతర కథల్ని ముడివేయటమిది.

---

1. యదా చైతద్వనం ఘోరం రామో దశరథాత్మజః
ఆగమిష్యతి దుర్ధర్షస్తదా పూతా భవిష్యసి (బాలకాం. 48 స. 31 శ్లో.)

వివాహితులైన సీతారాములు అయోధ్యకు వెళుతూ అహల్యాశ్రమం సందర్శించారు. అపుడు ఆమె వారికి నారచీరలు కట్టి మురిసిపోయింది. బాల ఋషి దంపతులని సరసమాడారు. భావి అరణ్యవాస వృత్తాంతం ఇక్కడ సూచింపబడింది. పాతబట్టల్లో జాతిరత్నాలు దాగినట్టు పరిహాస వచనాల వెనుక పరమ సూక్ష్మాంశాలు దాగివున్నాయి. అహల్యాశ్రమం వీడి వస్తూంటే జనం అనుకొన్నారట-

'ధృతి నహల్య పడిన తిట్టు తీర్చిన రాము డాత్మరక్ష' అని అహల్య పడ్డది 'తిట్టు' అంతే. ఈ ఆశ్రమ సందర్శనలో ఆమె అంది: 'పితృవాక్య పాలన చేసి పాలించు' అని. పట్టాభిషేక సమయంలో రాముడు వనవాస బాధ్యత స్వీకరించాడు. పితృవాక్య పాలన చేయుమని చెప్పిన కైకతో అతడు 'అహల్యకు నీకు ఆత్మ ఒక్కటేనా?' అన్నాడు. అహల్యకూడా పితృవాక్య పాలన చేయమంది, నీకు గుర్తుందా అన్నాడు. ఈ సంఘటనలన్నీ కథలో ఒక అఖండ రమణీయతను ఆవిష్కరిస్తున్నాయి.

పూర్వ రామాయణ కర్తలు అహల్యా పాత్రను అధిక్షేపించారు. నిజానికి ఆమె పంచకన్యలలో ఒక కన్యగా వుందని ఐతిహ్యం. అయితే ఆమెపట్ల సానుభూతి చూపిన కవులు మృగ్యం. పతిత పాత్రపట్ల విశ్వనాథకు అపారమైన సానుభూతి వుంది. 'వేయి పడగలు'లో మంగమ్మ, ఇత్యాది పాత్రల తీర్పులో ఆ సానుభూతి కనిపిస్తుంది. అటువంటిదే అహల్య పాత్ర. ఒక్క క్షణం చలించిన మనస్సు చేత ఆమె దూషిత అయింది. కానీ ఆమెలో పవిత్రాంశ కూడా వుంది. ఆ దృష్టితోనే అహల్య తీర్చబడింది. పూర్వ రామాయణ కర్తలు రామ పాత్రను ఉజ్జ్వలింపజేశారు. అహల్యను నింద్యగా నిలిపారు. పరమేశ్వరుడే క్షమించకపోతే పతిత ప్రాణికి క్షమాదాత ఎవరుంటారు? ఆ దృష్టితోనే అహల్యా పాత్రను పశ్చాత్తప్త హృదయగా చిత్రించి పరమేశ్వరునికి ఆతిథ్య మిచ్చి ఆశీర్వదించిన మాతృమూర్తిగా నిలిపాడు కవి.

ఈ కథలో విశ్వామిత్రుడు చెప్పిన పోలికలలో వైదిక నేపథ్యం వుంది. గౌతమ వేషం దాల్చిన ఇంద్రునితో 'సురాపానార్థం వెళుతూ పీతాంబరం కట్టినట్టు ఈ వేషమేమిటి?' అని గౌతముడనటంలో అది స్పష్టంగా కనిపిస్తూంది. అలాగే జాతరా, మిథ్యామతీ అనటంలో వైదిక ముద్ర వుంది. ఈ శాప విముక్తి కథను కౌశికుడు శతానందునికి చెపుతూ అన్నాడు :- విముక్తి పొందిన అహల్య 'బలిధ్వంసక' 'విష్ణుప్రభు' అనిందని అని. నిజానికి ఇవి కౌశిక కల్పనలు. దీని ఉద్దేశ్యం రాముడిలో విష్ణ్వంశాన్ని స్ఫురింపజేయటం. ఆ రహస్య స్ఫురణ కలిగించేందుకే ఈ కథలూ, నడిపిన పథాలూ.

# ఏమీ మహోరాశి యేను బ్రహ్మర్షినా ?

ఇది యేనాటికి నేమగున్ దెలియదోయీ రామ! యెన్నేండ్లుగా
బ్రదుకో యన్ని సమల్ నెలల్ దినము లిట్లన్ లిట్లరక్షింపగాఁ
దుది నీ జీవితమెల్ల శ్రేష్ఠమగు; లేదో యొక్క విఘ్నంబుచే
నిది పాపంబున నంటి యట్లె యగు స్వామీ! యెల్ల కాలానకున్.

(ధను. 37)

ఇది శతానంద వాక్కు. జనక సభలో అహల్యా శాప విముక్తి వార్తవిని ఈ మాట అన్నాడతడు. ఇది గడచిన అహల్యా కథపై వ్యాఖ్య అయినా అదే సభలో అతడు చెప్పబోయే విశ్వామిత్ర కథకు ఉపోద్ఘాతం.

విశ్వామిత్రుని కథ అంతా విఘ్నాల కథ. ఒక్కొక్క దిశలో ఒక్కొక్క విఘ్నం ఎదురయిందతనికి. వాటిని జయించటమే అతని కథ. మానవ జీవితాధ్వగమనానికి ఈ కథ ఒక ప్రతీక. విశ్వామిత్రుని కథ స్థూలంగా ఇది: తాను రాజుగా వెలిగిన కాలంలో వశిష్ఠుని ఆతిథ్యం పొందాడొకసారి. శబళా మహిమతో రాజ సైన్యానికి ఆతిథ్యం ఇచ్చిన వశిష్ఠునితో ఆ ధేనువు తనకు కావాలని అడిగాడు కౌశికుడు. దాన్ని పొందడానికి దౌర్జన్యానికి పోయి వశిష్ఠ బ్రహ్మదండం ముందు ఓడిపోయాడు. తానూ బ్రహ్మర్షి అవుతానని పట్టుదలతో తపస్సు చేశాడు. అనేక ఆటంకాల నెదుర్కొని చివరకు బ్రహ్మర్షి అయ్యాడు. ఇది అతని కథ.

వశిష్ఠాశ్రమంలో ఆతిథ్యం పొందటానికి కౌశికుడు ముందు అంగీకరించలేదు. 'మీ ఆదరణ చాలు - ఆతిథ్యం దేని? అన్నాడు. వశిష్ఠుడు ఆతిథ్యం పొందాలన్నాడు. అపుడు కౌశికుడు 'ఇంత మందికి ఎలా ఆతిథ్య మిస్తారు? అచ్చంగా భోజనమే పెడితే పచ్చని ఆకు కూడా మిగలదు' అన్నాడు. ఇది పరాచికమే అయినా కథాసూచన వుంది. వశిష్ఠుడు అచ్చమైన భోజనమే పెట్టాడు. ఆ తర్వాత పచ్చని ఆకుకూడా మిగలనంత యుద్ధం జరిగింది.

విశ్వామిత్రుడి పట్టుదలకు, భీషణమైన తపస్సుకూ స్ఫూర్తి కలిగించిన సంఘటన ఇది. విశ్వామిత్రుడిది తీవ్రప్రకృతి. కారుణ్యం పొంగినా, క్రోధం రేగినా భరించటం కష్టం. కరుణిస్తే సురలోకాన్ని సృష్టించి త్రిశంకుడికిస్తాడు. వికటిస్తే రంభనైనా రాయిగా మారుస్తాడు. అతని ఆవేశ మంతటిది. శబళను చూసి తాను రాజుకనుక 'సద్రత్నమైన శబళ' తనవద్దే వుండాలన్నాడు. కాదన్న వశిష్ఠుడిపై కయ్యానికి కాలు దువ్వాడు. బ్రహ్మదండం ముందు తానోడిపోయాడు. 'బలమన్న బ్రహ్మబలమె బలము. దాన్ని సాధిస్తాను' అని ఘోర తపస్సు చేశాడు. దక్షిణ దిక్కులో తపస్సులో వుండగా త్రిశంకుడు శరణుకోరి వచ్చాడు. అప్పటికి 'రాజర్షి' అయ్యాడు కౌశికుడు. త్రిశంకుడిని బొందితో స్వర్గానికి పంపే ఏర్పాటుచేసి ఫలించక మరో స్వర్గం సృష్టిచేసి ఇచ్చాడు. ఇక్కడ తపోభంగమయింది. తపస్సు చేసేకొద్దీ వశిష్ఠునిపట్ల కౌశికుడికి గౌరవం పెరిగింది.

ఆ దిశ విడిచి పశ్చిమంలో ఘోర తపస్సు చేస్తూండగా శునశ్శేపుడు శరణుకోరాడు. 'నేను వేఱయొక త్రిశంకుడను' అని తెలివిగా చెప్పాడు. శునశ్శేపుని బదులు బలి నిమిత్తం మరొకరిని పోవలసిందిగా కౌశికుడు తన పుత్రుల్ని కోరాడు. వారు తిరస్కరించారు. 'శ్వమాంస భోక్తలై' పొమ్మని శాపమిచ్చాడు. ఇక్కడతడన్న మాట విశేషమయినది. 'ముల్లోకాలను బ్రహ్మదండంలో నిల్పిన స్వామి వశిష్ఠుని పుత్రుల పట్లే ప్రేమ లేదు. మీపైన వుంటుందా?' అన్నాడు. ఇక్కడి మాట మునుపు తాను వాశిష్ఠులను శపించిన సన్నివేశాన్ని గుర్తు చేస్తూంది. త్రిశంకుని స్వర్గానికి పంపే క్రతువు జరుపుతూ ఋషి సంఘాన్ని ఆహ్వానించాడు కౌశికుడు. వశిష్ఠ పుత్రులు తిరస్కరించారు. తీండ్రించిన కోపంతో వారు దగ్ధం కావాలి అని శపించాడు. దాన్ని గుర్తు చేస్తూ ఈ మాట అన్నాడు. ఇక్కడ వశిష్ఠుని పట్ల గౌరవం పెరగటంతో పాటుగా, ఆ పుత్రులను శపించినందుకు పశ్చాత్తాప పడటం కనిపిస్తుంది.

ఆ తర్వాత కలిగిన విఘ్నాల్లో మేనక విశిష్టమైనది. తక్కిన అన్ని దిశలలోనూ పురుష కారణంగా విఘ్నమేర్పడగా ఈ దిశలో స్త్రీ మూలంగా కలిగింది. ఆమె సామాన్య స్త్రీ కాదు. సురలోక సుందరి. ఒక దశాబ్దం పాటు అతడ్ని వివశుణ్ణి చేసి, దివ్య శృంగారంలో ముంచి తేల్చింది. ఈ వచ్చిన అచ్చర విశ్వామిత్రుడిలోని కాముకుణ్ణి గెల్చుకుంది. మేనక అవతరణ ఒక అద్భుత

చిత్రణ. ఆమె వ్యక్తిగా కాకుండా సౌందర్య శక్తిగా రంగప్రవేశం చేసింది. మాకంద తరుశాఖల్లోని కోకిలాలాపంతో మదిలో రేగే కుతూహలంలో దాగి వచ్చింది. ప్రకృతిలోని సౌందర్యానికి ఆమె స్వరూపం ఉపమాన సదృశ మయింది. అందుకే 'వసంత నవ శోభ వచ్చె నప్సరసవోలె' అన్నాడు కవి.

ఈ కథను నైరూప్యోపమానాలతో నడిపాడు కవి. మేనక అంటే మనోగత కామభావన అని అర్థం లిబిడో. మేనక మానవ లాలసతకు ప్రతీక. మానవ యత్నాలనుంచి దారి మళ్ళించి విఘ్నం కలిగించే ప్రతి కామభావనా ఒక అప్సర. విశ్వామిత్రుడిలో పడగలు విప్పిన కామభావన అతనికి ప్రతిచోటా మేనకను దర్శింపజేసింది. ఏకాంతంలో మనిషి అంతర్గత చైతన్యం బహిర్గత మవటమన్నది శాస్త్ర నిరూపితాంశమే. ఏకాంత తపస్వి అయిన కౌశికుడిలో ఈ కామభావన మేల్కొంది. ప్రకృతి సర్వం అతనికి స్త్రీ సౌందర్యమయంగా తోచింది. నదీ వేణి జారిపోయే దుకూలస్ఫురణ కలిగించింది. నిజంగా అలా వుందా? ఉంటే అన్నేళ్ళలో ఏ రోజూ అలా కన్పించక ఆ రోజే ఆ స్ఫురణ ఎందుకు? అది మనసు పొందిన విభ్రమం. పైగా పూర్వం తానొకరాజు. భోగి. ఆ పూర్వ వాసనలతనిలోని కామాన్ని జాగృతం చేశాయి దానికి హేతువైన భావం పేరు మేనక. కనుక మేనక అంటే కామభావ ప్రతీక. ఈ మోహంలో పదేళ్ళు గడిచాయి. ఈ పదేళ్ళూ మౌని భయంతో ఆశ్రమంలో వసంత ఋతువునే అభినయించాయి, అన్ని ఋతువులూ. పదేళ్ళ తర్వాత ఒకరోజు అతనికి జ్ఞానరేఖ వెలిగింది.

'పదేళ్ళా? మేనక దాల్చిన గర్భాన్నేం చేస్తుంది
ఆడపక్షిలాగా నన్ను పొదగిపుంటుందా?
నేను మూర్ఖుణ్ణి. ఇంతైనా ఎదలో కామ
క్రోధాలు వదలవే? నే నా వశిష్ఠుని సాధించేదే?!' (ధను. 201)

అనుకున్నాడు. మౌనికి నిజం తెలిసిందని గజగజ వణకిన మేనకను 'శపించె దనె బేలా నాదు దోసానకున్?' అని అనునయించాడు. ఆమెను 'మధుమూర్తి' అన్నాడు. పైగా ఆమె తనకు గురువన్నాడు.

'కోరి ప్రత్యక్ష మన్మథగురువవైతి
కోరక పరోక్ష వైరాగ్య గురువవైతి
లంజియా! యెంత కిందికి గుంజినావొ
యంతపైకిని జనుమార్గ మరసినావు' (ధను. 209)

అన్నాడు. ఆమె పైకేమో మన్మథగురువు అతని కామాన్ని సంతృప్తపరచింది కనుక వైరాగ్యభావహేతువై వైరాగ్యగురువు కూడా అయింది. మేనకావ్యామోహమే దారి మళ్ళించివుండకపోతే అతడు కామం కోసివేసేవాడో లేదోగానీ 'అసలు కోకిల' ఏమిటో మాత్రం అర్థమై వుండేదికాదు. 'నీ కృపాలేశమున చేసి నీరజాక్షి' అని ప్రత్యేకించి పేర్కొనడమే దీనికి సాక్ష్యం.

'అసలు కోకిం' అంటే అంతర్గత కామభావన అనీ, అంతరంగ ప్రణవనాదమనీ రెండర్థాలు. "కోకిల చెట్టుపై లేదు. నాలోపల కూస్తూ నిరంతరం కలవరపెడుతూంది. ఇన్నాళ్ళూ గుర్తించలేదు. ఇపుడే తెలిసింది" - ఇదొక అర్థం. మరో అర్థంలో "ఈ వసంత కోకిలలన్నీ మాయ. వీటికి అతీతంగా ఒక కోయిల నిరంతరం కూస్తూ వుంది ఇన్నాళ్ళూ గుర్తించలేదు. అసలు కోకిల స్వరమైన ప్రణవనాదాన్ని గుర్తించాను. ఇక తపోముద్ర దాలుస్తాను" అని. ఇంద్రుడు నిన్ను నా గురించి అడిగితే 'కామం కోసివేశానని చెప్పు' అని మేనకతో అన్నాడు. కామాన్ని గుర్తించాడు కనుక జ్ఞానాన్నీ గుర్తించాడు. ఈ మలుపుకు హేతువైన మేనకకు అపూర్వ గౌరవమిచ్చి, 'నీవు అనుమతిస్తే తపస్సుకు వెళ్తాను' అన్నాడు. బహుశా ఏ ఋషీ కూడా తన తపోవిఘ్నకారి అయిన అప్సరను ఇంతగా ప్రేమించి వుండడు; గౌరవించీ వుండడు. ఈ సంఘటన మానవ జీవితాల్లోని మార్మిక ప్రేరణలను వ్యాఖ్యానిస్తూంది.

ఆమెను విడిచి అతడు తపస్సుకు వెళ్ళినపుడు కూడా మరో విఘ్నమెదురైంది. ఋతువులతణ్ణి బాధించాయి 'చలిగాలులు పదునుకోసం అతని వొంటిపై సానపెట్టుకున్నాయి' (ధ. 221) ఇలా వేయేళ్లు గడిచాక ఇంద్రుడు రంభను పంపాడు. 'మహాకోపి ఆయన వద్దకు నే పోసందామె. వెంట మన్మథ పరివారాన్ని పంపుతూ భయం లేదన్నాడు. అపుడు ఆమె అంది:

'ఇది మేనకకు నీర్ష్యా
పదమగునో-' (228)

అని. ఈ ఒక్క మాటతో మేనక ప్రేమ ఎంతటిదో తెలుస్తూంది. వేయేళ్ళు గడచినా సాటి సురవధూటి మరచిపోలేనంతటి గాఢమైన ప్రేమ మేనకది. 'సవతి మత్సరం కలుగదు గదా?' అన్న ఆ సందేహం మానవలోకజన్యం. ఇంద్రుడు దీనిని గుర్తించి 'త్రిదశసతి' అని పిలిచాడు. 'నీవు దేవకాంతవు, మానవకాంతవు కావు' అని గుర్తుచేశాడు. మారుమాటకు అవకాశమివ్వక 'పద పద' అని తొందర చేశాడు. విశ్వామిత్రుడు అప్పుడే కౌశికీ నదిలో స్నానంచేసి వెచ్చని ఎండలో నిలబడ్డాడు. అపుడు-

'చుఱ చుఱ నెఱ్ఱనై చూచెడు చివురాకు
చివురాకు వెనుకఁ బొంచిన లతాంత
బాణుండు విసరగా పట్టిన పిడిబాకు-'

ఇత్యాది కామోద్దీపక సామగ్రితో రంభ అతణ్ణి వివశుణ్ణి చేయాలని వచ్చింది. అతడు 'అప్సరస్తను సుఖప్రాచీను'డని ఇంద్రు డూహించి మరోమారు కౌశికుడు ఓడిపోతాడని ఆశించాడు. అయితే ఆ తనుసుఖ ప్రాచీనత్వమే వైరాగ్యహేతువై, రంభను జయించేలాగ చేసింది. రంభ రాక గమనించి కత్తిదెబ్బతిన్న తాచులాగా లేచాడు కౌశికుడు. కన్నుల్లో నిప్పులు వర్షిస్తూ అడుగడుగునా విఘ్నమేనా అనుకున్నాడు. రంభను 'పదివేల యేండ్లు పాషాణమై పడు' అని శపించాడు. ఆమె విముక్తి మార్గానికై ప్రాధేయపడగా వశిష్ఠుని ద్వారా నీకు విముక్తి లభిస్తుందన్నాడు. ఇక్కడ క్రమేపీ వశిష్ఠుని పట్ల కౌశికుని గౌరవం పెరగటం కనిపిస్తుంది. పైగా ఆయనను ఇక్కడ 'విశ్వంభరమూర్తి' (285) ఇత్యాది మాటలతో సంభావించాడు. రంభ విషయంతో క్రోధాన్ని జయించని కౌశికుడు బయటపడ్డాడు. 'ఇక కోపగించను' అని తూర్పుదిశ చేరి నిరాహారుడై అనుచ్ఛ్వసితుడై తపస్సారంభించాడు. ప్రాశనవేళ 'అన్నము గూరిచి యారగింపబోవు' నంతలో ఇంద్రుడు మాయావిప్రుడై వచ్చి ఆ అన్నాన్ని పొందాడు. కౌశికుడు మౌనవ్రతం వీడక తిరిగి తపించాడు. ఈ భీకర తపోమూర్తిని చూసి బ్రహ్మ ప్రత్యక్షమై, 'నీవు బ్రహ్మర్షివయ్యా' వన్నాడు. అతడికి తృప్తి కుదర

లేదు. 'వశిష్ఠుని నోట పలికించండా మాట' అని కోరాడు. అపుడు వశిష్ఠుడు ప్రాగ్దిశ నావిర్భవించాడట. ప్రాగ్దిశ, ఆవిర్భావం ఈ రెండూ దైవలక్షణాలు. ప్రాక్ అన్నది జ్ఞాన సంకేతం. సూర్యోదయం ప్రాగ్దిశలో జరగటం ప్రసిద్ధమే. వశిష్ఠుడు జ్ఞాని. అతడు స్వయం ప్రత్యక్ష శక్తిగల బ్రహ్మర్షి అని ఇక్కడ నిరూపణ అలాటి జ్ఞాన సంకేత సదృశుడైన వశిష్ఠుడు 'నీవు బ్రహ్మర్షివయ్యావు' అని అంటే పదేపదే చెప్పించుకుని పరవశించాడు.

ఇన్ని పరాజయాల పరంపరల నధిగమించాక కాని విశ్వామిత్రుణ్ణి విజయం వరించలేదు. ఈ పరమానందకరమైన వేళ నృత్యాభిరామమూర్తియై-

అప్సరసయైన మేనక
లిప్సామధుమూర్తి కాకలీకలకేకా
వీప్సా కీర్తన బాడెక
నుప్సమ్మార్జనము భావకూలంకషమున్ (260)

మేనకతో కౌశికుడన్నమాట 'నాకును నీవొసర్చినటువంటి ఘనంబగు మేలెటువంటిదింక' అని. ఈ ప్రశంస ఆమె మదిలో వేయేళ్లైనా పోలేదు. ఆమె ఎడదలోతులిచ్చిన మధుమూర్తి. కనుక, ఈ ఆనందం.

ఈ కథ జనకసభలో శతానందుడు రాముడికి చెప్పాడు. రాముడితోపాటు జనకాదులున్నారు. ప్రధానశ్రోత మాత్రం రాముడే. అతడితోపాటూ వీరూ విన్నారు జనకుడికి నచ్చిన విషయం విశ్వామిత్రుని పట్టుదల. తపస్త్సీవ్రత. పరాజయాలకు వెన్నిచ్చిపారిపోని శూరత్వం. ధీరత్వం. ఇవన్నీ తలచి 'నీ కథ దివ్యబోధ' (264) అన్నాడు.

శ్రీరాముడిని బాగా ఆకర్షించిన విషయం మేనక కథ. ఏకాంతంలో లక్ష్మణునితో రాముడంటాడు 'మేనక కథను చెప్పినతీరు వేరుగాదె' (274) అని. అతడి నాకథ అంతగా ఆకర్షించటానికి ప్రధాన కారణం శతానందుడి కథనమే. మేనకా విశ్వామిత్రుల గురించి చెబుతూ,

చెలి నా ప్రాణము నీవునేననగ; నా సీమంతినీరత్నమున్
జెలి నా ప్రాణము నీవనంగ; నదిరా సింగారి వౌదంచు జె

కిన్నెలిపై నొక్కచిటుక్కనం జిటికయై క్రిందౌచు మీదౌచు వా
రల కేళీ విభవంబు పట్టదుగదా! రామా! జగన్మోహనా! (189)

అని రాముని ప్రధాన శ్రోతగా చేశాడు. ఇది శృంగార విషయం. కథకుడు పదేపదే శ్రోతను కథావలగ్నమానసుడిగా చెసే ప్రయత్నం చేస్తూ అతడి పేరు ఉచ్చరించి మరీ చెబుతున్నాడు. ఆయా పట్టుల్లో ప్రత్యేక దృష్టి ఏర్పడి శ్రోత రమిస్తున్నాడు. 'శ్రీసతి పుల్లగల్ల పరిచిహ్నిత కుంకుమ పత్ర భంగ విన్యాసిత రమ్యవక్ష!' ఇలాటి పిలుపులతో శ్రీరాముడిలో శృంగారభావ జాగృతికి హేతుభూతుడయ్యాడు, శతానందుడు. ఈ కథ విన్నాక మదిలో ఉదయించిన మన్మథ భావాలచే రాముడు చిరునవ్వు నవ్వాడు. శతానందుడిది గమనించి, వూరుకో లేదు. 'మందస్మితాస్య' అన్నాడు. 'నీ నవ్వు నేను గుర్తించాను, నాకు తెలుసులే' అన్న కవ్వింపు ధోరణి ఈ సంబోధనలో వుంది. తత్పూర్వం చెప్పిన త్రిశంక, శునశ్శేఫ కథల్లోని శూరత్వం, పరహితార్థబుద్ధి— వీటికంటె మేనక కథ అమితంగా ఆకర్షించటానికి పై విషయాలే హేతువులు.

విశ్వామిత్రుడి కథవిన్నాక, అందరూ విడిదికి తిరిగి వచ్చారు. అక్కడ రామలక్ష్మణులు నిద్రించారు. ఆ రాత్రి తెల్లవారింది.

'అల్లయామిని యామినియెల్ల నొక్క
మహాపురుష జీవితమువోలె నవఘళించె' (278)

అని వర్ణన వుంది. గడచిన రోజు సభలో విశ్వామిత్రుడి కథ చెప్పబడింది అతడే ఈ పోలికలోని 'మహాపురుషుడు'. ఒక ఉపాఖ్యానాన్ని ప్రధాన కథకు అతుకువేసే ధోరణి ఇది. ఇక్కడి విశ్వామిత్రుని శృంగారలీలలను శ్రీరాముడు వివాహానంతర మనుసరిస్తాడు.

'కోకిల కొమ్మలో కూసిన నీవటే
నన్ను పిల్చితివంచు నవ్వుమౌని' (ధను. 198)

ఇది కౌశికుని లీల. దీనినే అనుసరిస్తాడు రాముడు.

'కోకిల దూరాన కూసిన నీవటే
నన్ను పిల్చితి వంచు నవ్వసాహి' (కళ్యాణ. 286)

సీత ఆసందంతో, 'ఎక్కడ నేర్చారీ విద్యలంటే' 'నేను నేర్చిన దేమున్నదే నీకాలగి, కౌశికుడుపదేష్టయియె కానిటు' - అంటాడు. ఇక్కడి ఉపాఖ్యానం ప్రధాన కథా విషయంలోకి చొచ్చుకునిపోయివుండటం కథనశిల్పం.

# శ్రీయుతుఁడా మౌని యేమి చేతముఁ గలఁడో

నే నచ్చముగాఁ బాఱుఁడ
గాను సుమీ క్షత్త్రరక్త కాండమ్ములు నా
మై నరములఁ బ్రవహించున్
శ్రీనిభృత మనోజ్ఞహాస చిత్రిత వదనా!

(ధను-445)

శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో పరశురాముఁడన్న మాటలివి. పరశురాముఁ డవతారమూర్తి. ఆయనలో పరమ సౌమ్యుడైన విప్రుడూ వున్నాడు, చండ ప్రచండుడైన క్షత్రియుడూ వున్నాడు.[1] ఒకసారి భీకర ప్రళయ కెరటంలా లేస్తాడు. ఇంకోసారి శీతల చంద్రకిరణంలా చూస్తాడు. ఈ ద్వైవిధ్య పోషణ చేయటంలో విశ్వనాథ అపూర్వ విజయం చేగొన్నాడు. మూలంలో ఈ ఘట్టం సీతారామ కళ్యాణానంతరం వుంది. ఇక్కడ వివాహాత్పూర్వమే వుండటం విశేషం.

పరశురామ పాత్ర ఇంత ఔద్ధత్యంతో వెలిగిపోవటమన్నది 'అనర్ఘరాఘవ' నాటక విషయం. కల్పవృక్షకారుడు పూర్వకవి స్తుతిచేస్తూ అన్నాడు.

భాస కాళిదాస భవభూతి దిఙ్నాగు
లకుఁ బ్రశస్త వాగ్విలక్షణుఁడు ము
రారి భట్టునకును రామకథా భాష్య
కారులకును మోడ్పు కై ఘటించి -

(అవతారిక. 31.)

ఈ పద్యంలో మురారిభట్టును విశేషించి సమాసంతోనూ, దాదాపు ఒకటిన్నర పాదంతోనూ ప్రస్తావించడం జరిగింది. రామాయణంలో రాజనీతిని వ్యాఖ్యానం చేసినవాడు మురారిభట్టు అని విశ్వనాథ అభిప్రాయం.

'అనర్ఘరాఘవం'లో రావణవధ అన్నది రాచకార్యం. నాయకుడు రాముడు. మంత్రి విశ్వామిత్రుడు. జరుగబోయే రావణవధకు శివధనుర్భంగ ఘట్టమే బీజం. దీనిమూలంగా సీతాకరగ్రహణమూ, ఆమె మూలంగా భవిష్యత్తులో రావణవధ - ఇదంతా ఒక పథకం. దీన్ని నడుపిస్తున్నవాడు విశ్వామిత్రుడు.[2] ఇక్కడ పరశురామ ప్రవేశం వెనుకవున్న పరమార్థం కూడా రాజనీతిపరంగా చూడదగ్గది. సీత హేతువుగా రావణవధ జరగటమన్నమాట పూర్వోక్తమే. అందుచేత, సీతను వివాహమాడేవాడు రావణుని చంపేటంతటి శక్తిపరుడై వుండాలి. ఆమె కరగ్రహణానికి పూర్వమే అతడు సంపూర్ణ ఆయుధ సామగ్రి కలవాడు (Fully equipped warrior)గా నిరూపించబడాలి. వైష్ణవ ధనుస్స్వీకారమే దీనికి నిరూపణ. ఆ ధనుస్సు ఇతణ్ణి చేరితే అపుడు సర్వాయుధాలూ ఇతని స్వాధీనంలో వున్నాయని చెప్పవచ్చు. దీన్ని రాముడికి చేర్చడానికి భార్గవరాముడు వచ్చాడు.

వైష్ణవతేజం శ్రీరామునిలో ప్రవేశించటమన్నది వైదిక వివరణ అయితే, సర్వాయుధ సంపన్నుడిగా నిరూపించడమన్నది లౌకిక వివరణ. పైగా పరశురాముడి అవతార పరిసమాప్తికూడా ఈ ధనుస్సు నివ్వడానికికొక కారణం. ఇది అవతార రహస్యం.[3]

శ్రీరాముడు విష్ణుస్వరూపుడని రామాయణం చెపుతూంది. అంటే స్థితి రక్షకుడు. కనుక, విష్ణుధనువన్నది స్థితికి ప్రతీక. శివధనువన్నది లయప్రతీక. శ్రీరాముడి చేతిలో శివధనువు భంగింపబడిందే కానీ, సాధించబడలేదు. ప్రతీకార్థంలో రాముడంటే లయను భంగించి, స్థితిని నిలిపేవాడు అని. పరశురాముడీ విషయాన్ని గుర్తించాడు. అయినా, 'ఇతడు స్థితిరక్షకుడైన విష్ణువో కాదో' అన్న అనుమానం కొంత వుంది. 'ఇది వంచినగాని నిన్ను నెఱుగను పత్సా' అనటంలో అది స్పష్టపడింది.

ఈ ధనుర్ధారణ వల్ల వైష్ణవతేజం ప్రవేశించిందన్న వైదికదృష్టీ, అది రావణవధ నిమిత్తం జరిగిన రాజనీతి అన్న లౌకిక దృష్టీ రెండూ ఇక్కడ వున్నాయి. విశ్వనాథ ఈ రెంటినీ అనుసంధించాడు. అతనిలోకి వైష్ణవ తేజం ప్రవేశించిందని వాచ్యంగా చెప్పి, 'శ్రీయుతుడా మౌని యేమి చేతము కలడో' అన్న రాముని మాటల్లో, రాజనీతి రహస్యమున్నట్లు సూచించాడు.

ఈ పాత్ర ప్రవేశంలో కనిపించిన తీవ్రావేశం నిష్క్రమణ చేసే సమయానికి భక్తిగా పరిణమించింది. ఈ పరిణామక్రమాన్ని, పాత్ర మనసులో కలిగిన ఆత్మోన్మీలనాన్ని చిత్రించటంలో కవి నేర్పు చూపాడు. అదే పాత్ర చిత్రణా శిల్పం.

పరశురాముడు తీవ్రమూర్తి. ఆయన జనక సభలోకి ప్రవేశించగానే మొదట అన్నమాట ఇది: "ఎవడురా వాడు- శివధనువును విరిచానని విర్రవీగుతున్నవా డెవడు". ఇంతటి క్రోధోద్రిక్తత శ్రీరాముని చూడగానే కరిగిపోయింది. అవ్యక్తంగా అతడి మనస్సు రామునిపట్ల భక్తిని ప్రకటించింది. ప్రళయభీకరంగా ప్రవేశించిన పరశురామమూర్తి ముందు రాముడు నిర్భయంగా నిలిచాడు. పరశురాముడికి అంతకోపం రావటానికి హేతువు శివధనుర్భంగ మొక్కటేకాదు. ఆ మహాధ్వనివల్ల హేరంబుడు, షణ్ముఖుడు విస్మయపడ్డారు. ప్రమథులు ఆశ్చర్యచకితులైనారు. పార్వతీదేవి ఫాలభాగంపై కోపలత విరిసింది. తాను అమితంగా ఆరాధించే దేవదేవుడికింత అపచారం జరిగిందన్న భావన భార్గవ రాముని మనస్సును ప్రజ్వలింపజేసింది. ఇంతటి అంతర్జ్వలన మతని మాటల్లో బయల్పడింది. 'లోకేశ్వరు కైలాసపతి పరంజ్యోతి కపర్ది ధనువు విరిచిన వాడెవ'డన్నాడు, ఇక్కడి నాలుగు మాటలూ శివునికి పర్యాయపదాలే. అతడి భక్తి అది. ఒకచిన్నమాటలో శివధనువనవచ్చు. అలా అంటే దాని గురించి గొప్పగా చెప్పానన్న తృప్తి ఆ పాత్రకుండదు. ఒక పది మాటల్లో చెప్పాలి. అపుడు మనసుకొక సంతృప్తి. ఇవన్నీ మనోంతరాళంలోని సూక్ష్మ విషయాలు. పరశురాము డవతారపురుషుడైనా అతడు ధరించింది మానవ శరీరాన్నే కనుక మానవ స్పందన లతనికి తప్పవు. ఆ స్పందనాస్వరూపమే ఈ ఉద్రేక లక్షణం.

ఇంతటి ప్రచండ కోపి శ్రీరాముని సమాధానం విని మెత్తబడిపోయాడు. శ్రీరామ దర్శనమతని నేత్రాలకు కౌముదీస్పర్శలాగా చల్లగా వుంది. అపుడు నవ్వుతూ అన్నాడు "నీవేనా శైవధనుసు విరిచింది? ఎలా విరిచావో చెప్పు. వినాలని వుంది." మెల్లగా ఔద్ధత్యం విరిసిపోయింది. రాముడు అందమైన పసి బాలుడిగా తోచాడు పరశురాముడికి. 'బాల కాకుత్స్థ' లాంటి సంబోధనల్లో ఆ వాత్సల్యం ప్రకటితమయింది. 'ఈ విష్ణుధను వెక్కుపెట్టు చూద్దాం అది జరిగితే ఆ తర్వాత నాతో ద్వంద్వ యుద్ధం చేసే అవకాశం ఇస్తాను' అని దర్పంగా

చెప్పాడు. 'ఏదో వరమిస్తానులే' అన్న తీవి కనిపిస్తుందిక్కడ. పరశురాముడి మనస్సులో ఒక అనుమానం తొలుస్తూనే వుంది. 'రాముడే విష్ణువేమో' అని. ఆ విషయం నిర్ధారణ అయ్యేదాకా అతనికి సంపూర్ణ విశ్వాసం కుదరలేదు. 'నీవు ఫలానా వాడివేమోనన్న అనుమానం నాకొకటి వుంది. దీన్ని వంచితే గానీ చెప్ప లేను' అన్న ఆంతర్యంతో, 'ఇది వంచినగాని నిన్ను నెఱుగను వత్సా' అన్నాడు. సగం తెలుసు. సగం తెలియవలసివుంది. ఆ రెంటికీ మధ్య ఒకస్థితి వుంది. అక్కడ నిలబడి మాట్లాడుతున్నాడు పరశురాముడు. అందుకే, 'శిశువ' అని ఒకసారి అంటాడు. 'కాదు కాదు ఓయి దుర్ధర్షుడా' అని సవరించుకుంటాడు. 'శివధనుర్ద్రోహీ' అని విరుచుకపడతాడు. మళ్ళీ మెత్తబడిపోతాడు. 'నా రక్త గుణమే అంత ఒకసారి సౌమ్యంగా వుంటాను. మరోసారి ఆవేశపడు తుంటాను' అని సంజాయిషీ చెప్పుకుంటాడు. ఇలాగ అటు కొంతసేపు, ఇటు కొంతసేపు ఒరిగిపోవటం కనిపిస్తుంది. ధనువు చూపిస్తూ రామునితో, 'ఈ వింటి కొప్పుతుదల కార్తవీర్యుని సైన్య సంహారం చేశాను-' అని 'ఆ కథను చెప్పు మంటే చెబుతా'నన్నాడు. రాముని అనుమతికోరితే అతడు మందహాసంతో అంగీ కరించాడు. అపుడు కొంత కథ చెప్పి, మధ్యలో ఆపి అన్నాడు.

'అపుడు మా అమ్మ ఏడ్చింది. నా కెంత
కోపం రావచ్చో నీవే చెప్పు. నన్నూరికే
కోపిష్టి అంటారే తప్ప, అలా ద్రోహం
చేయటం బాగుందా, చెప్పు.'

ఇది ఒక సన్నిహితునితో బాధలు చెప్పుకొనే తీరు. రామునిపట్ల పసి వాడనే భావనపోయి, తన బాధలు వినదగ్గవాడన్న గౌరవమూ, దగ్గరితనమూ కలిగాయి. ఇలాంటిచోట్ల అతి ప్రాచీనమైన ఈ పురాణ పాత్రలు మనకత్యంత సమీపంగా వస్తాయి. పరశురాముడంటే మన ప్రక్కింటివాడే నన్నంత సాన్ని హిత్యం కలుగుతుంది. లేనిపోని గాంభీర్యాన్ని చూపకుండా నిర్మలమైన మన స్సుతో ఒక జానపదుడిలాగా స్పందించటంచేత పురాణపాత్ర నిత్య నవీన పాత్రగా శోభిస్తుంది.

ఇంతదాకా వున్న కథ వాల్మీకం లోనిదే. ఇక్కడ విశ్వనాథ ఒక్క అడుగు ముందుకు వేశాడు. దూరదృష్టి కు సగిషీ పట్టాడు. పరశురాముడు నిష్క్రా

మించిన తర్వాత అంతదాకా స్తబ్ధుడిపోయిన సభ ఊపిరి పీల్చుకుంది. ఆ సభలో వున్న రాజలోకం 'మా పరువు నిలిపా'వని రాముని ప్రశంసించింది. అపుడు రాముడు నవ్వి అన్నాడు

> 'ఆయన చెప్పినట్లుగానే ద్వంద్వయుద్ధం
> చేసి వుండింటే నేను గెలవగలనా? ఎందుకో
> ఆ బాణానికి లొంగినట్లు నటించాడు. సర్వాస్త్రవి
> విదుడు. మనసులో ఏముందో ఆయనకు'.

అని, పరశురాముడు వెళ్ళినదిక్కు తిరిగి నమస్కరించాడు. ఈ వినయం రామునిలో సర్వత్రా కనిపిస్తుంది.

ఈ కథనంలో పరశురాముడి ఆత్మోన్మీలనక్రమం చాలా నిపుణంగా చెప్పబడ్డది. మొదట ప్రవేశించినపుడు మహాక్రోధి. రాముని చూడగానే వాత్సల్య మూర్తి. శివధనుర్భంగ కారకుడు 'పి'డని ఒక కోపం. ఇతడు నారాయణుడేమో నన్న అనుమానంలో దాచుకోలేని భక్తి. ఆ సందిగ్ధంలో అటూ ఇటూ చెదరిన ఆవేశం. చివరకు నారాయణుడే రాముడని గుర్తించటం. ఇది పరశురామునిలో కలిగిన పరిణామక్రమం. చండతీవ్రంగా ప్రవేశించిన మూర్తి సౌమ్యుడై తిరిగి వెళ్ళే పర్యంతం పరశురాముడు మానవస్పందనల కనుగుణంగా ప్రవర్తించటం చేత, ఆ పాత్రచుట్టూ ఒక సహజ వాతావరణ మేర్పడింది.

ఈ కథలో గోచరించే మరో మార్పేమిటంటే, శివధనుర్భంగ మొకటే కాక, పరశురామ గర్వభంగాన్ని కూడా విశ్వామిత్రుడు చూడటం. ఇది విశ్వనాథ సృష్టించిన విశ్వామిత్రుడికి దక్కిన అదృష్టం.

యజ్ఞరక్షకు రాముని వెంటతీసుకువచ్చినప్పటినుంచీ కౌశికుడు చేస్తూన్న ప్రయత్న మొకటి వుంది. రామునిలోని విష్ణ్వంశను జాగృతం చేస్తూ వచ్చాడు. అతడి అవతార ప్రయోజనం నెరవేరటానికి బాటలు తీర్చాడు. తాటకావధ ఘట్టంతో అతనిలోని ధనుర్విద్యకు సాన తీర్చాడు. వామన కథ చెపుతూ పరిహాస వచనాలలోనే పరమ రహస్యాన్ని దాచి 'నీవే వామనుడివి' అన్నట్లుగా మాటాడాడు. అహల్య కథను శతానందుడికి చెప్పి 'జలిధ్వంసక' అని ఆమె

రాముని స్తుతించిందని చెప్పాడు. ఇక రాముడు విష్ణుధనుర్ధారణ చేయటంతో అతని శక్తులతనిని ఆవహిస్తాయి ఆ స్థితికి గడచినవన్నీ పథాలు. కౌశికుడిని ఈ దృశ్యానికి ప్రేక్షకుడిగా నిలపటంలో కవి ఉద్దేశించిన విషయమది.

## పాదసూచికలు :

1. పరశురామునిలోని ఈ విప్ర-క్షత్రియ గుణాలకు నేపథ్యంలో ఒక గాథ వుంది.

గాధి కూతురు సత్యవతి ఆమెను ఋచీకుడు పెళ్ళాడాడు. పుత్ర సంతానేచ్ఛతో అతడొక హవ్యం తయారుచేశాడు. దానిని పాలు, వెన్నలతో కలిపి వుంచాడు. దీని నారగించిన వారికి బ్రహ్మ తేజస్సుగల పుత్రుడు జన్మిస్తాడు. ఋచీకుడు సత్యవతికోసం తయారు చేశాడది. ఆమె తన తల్లికి కూడా అలాంటి పదార్థం కావాలని అడిగింది. అతడు చేసిచ్చాడు. దీని నారగించిన వారికి క్షత్ర బల సంపన్నుడు జన్మిస్తాడు. ఈ రెండూ సత్యవతి చేతికిచ్చి, ఆమె తినవలసిన దేదో చెప్పి, ఆయన అడవికి వెళ్ళాడు. ఆ సమయంలో సత్యవతి ఆ పదార్థాన్ని తినబోతూండగా, ఆమె తల్లి అంది. "బిడ్డా, ఎవరైనా గొప్పగుణాలు గలవాణ్ణి పుత్రునిగా కోరుకుంటారు. నీవు ఆ పదార్థం తిని బ్రాహ్మడికి జన్మనిస్తావు. ఈ సంపద, బలము, అధికారము బ్రాహ్మడేం చేసుకుంటాడు? అంచేత ఆ పదార్థం తినకు. నాకిచ్చిన పదార్థం తిను. ఒక జగద్విజేత జన్మిస్తాడు." సత్యవతి ఈ మాటలు విని, ఋషి తనకిచ్చిన హవ్యాన్ని తన తల్లికి ఇచ్చి, ఆమెది తాను స్వీకరించి, ఆరగించింది. అడవినుంచి తిరిగివచ్చిన భృగువు సత్యవతిని చూసి, "ఏం పనిచేశావు కళంకినీ, నీ శరీరం నాకు భయం గొల్పుతూంది. మీ అమ్మ తినాల్సిన పదార్థం నీవే తిన్నట్టుగా వుంది. ఆమెకు తయారు చేసిన పదార్థంలో అధికారం, బలం, శౌర్యం అనే గుణాల్ని రంగరించాను. నీకు సౌమ్యత, జ్ఞానం, త్యాగం అనే గుణాల్ని కలిపిన అన్నమిచ్చాను. మీరు పరస్పరం మార్చుకున్నారు. కాబట్టి నీకు జన్మించేవాడు వీరుడు, మనుషుల్ని మారణాయుధాలతో మట్టుపెట్టేవాడు అవుతాడు. మీ అమ్మకు జన్మించబోయేవాడు బ్రాహ్మణ లక్షణాలతో వుండి, శాంతికి, సౌమ్యతకు నిధానమవుతాడు..." ఇలా అనేసరికి ఆమె అతని పాదాలపై పడి, "ఇదంతా నా

అజ్ఞానం వల్ల జరిగింది. నా పట్ల దయ చూపండి. నాకలాంటి పుత్రుడు వద్దు. ఒకవేళ ఈ శాపం అనివార్యమయితే, నా మనుమడు అలాంటివాడుగా జన్మించనీ, నా కుమారుడు మాత్రం అలాంటివాడు కాకూడదు" అంది. "తథాస్తు" అన్నాడు ఋషి. ఆ తర్వాత సత్యవతి జమదగ్నికి జన్మనిచ్చింది. ఆమెతల్లి విశ్వామిత్రుడికి జన్మనిచ్చింది. జమదగ్ని ద్వారా రేణుక గర్భంలో పరశురాము డుదయించాడు. (విష్ణుపురాణం)

ఆ పదార్థ ఫలితమే అతనిలో క్షత్రతేజంగా జ్వలించింది. విప్రుడి సంతానమవటంచేత విప్రసౌకుమార్యం పల్లవించింది. 'నేసచ్ఛముగా పాఱుడగాను' అనటం వెనుకల వున్న రహస్యమిది.

2. శివధనుర్భంగం జరుగుతుందనీ, దాని మూలంగా జరగాల్సిన తతంగమంతా జరుగుతుందనీ విశ్వామిత్రుడికి తెలుసు. అందుకే శివధనుర్భంగ ఘట్టంలో అందరూ ఉద్రిక్తపడినా, విశ్వామిత్రుడు మాత్రం చాలా నెమ్మదిగా అన్నాడు. 'తాకవే యింతయే చాలు ధనువునకును' (ధను. 297) అంటే తచ్చాపభంగం చేయగల శక్తి రామునిలో వుందని ముందే గుర్తించాడు.

3. పరశురామావతారమన్నది క్షత్రియ సంహారార్థ మవతరించిన మూర్తి. దుష్టప్రభువులను మట్టుపెట్టడానికి వచ్చిన విష్ణువుగా కనిపిస్తాడతను. తమకుతామే గొప్పగా భావించి, దురహంకారంతో చరించే రాజులను పరశువుకు బలిచేశాడు. వారు ఆదర్శ ప్రభువులు కారు. Unideal Kings. ఒక యుగం ముగిసింది. శ్రీరాముడు జన్మించాడు అతడాదర్శరాజలక్షణాలను పుణికి పుచ్చుకున్నవాడు. Ideal King రామరాజ్యమనే పేరుగల ఆదర్శ సామ్రాజ్య స్థాపన చేయగలవాడు. ఇలాగ ఆదర్శరాజు రాగానే పరశురామావతారం యొక్క అవసరం ముగిసింది. దుష్టపాలకులు అంతరించారు. సచ్ఛీలుడైన రాజు వచ్చాడు. పరశురామావతారం ముగించవలసిన సమయమిది. అందుకని అతడు తనవద్ద వున్న విష్ణుధనువును రామునకిచ్చాడు.

# సీత పూజడ వెన్నెగా శిరసువంచె

శ్రీరామలక్ష్మణులు కౌశికునితో కలసి మిథిలా నగర ప్రవేశం చేయటాని కున్న కారణం శివధనుర్దర్శనం. దీనికి అంతర్విషయంగా రాముడిలో ఆ నగర దర్శనాభిలాష చిన్నతనంనుంచే వుంది.

రయధీశాలి రఘూద్వహుండు మతిధారావేగ సంసారి శు
క్లయజుస్సుల్ పఠియించుచుండు జనకక్ష్మానాథు నాస్థానముం
దయి సౌర్యుండగు యాజ్ఞవల్క్యకృత వాదాశ్చర్యముల్ భావనా
మయతం జూచుచు——

మనసై రాముడు మైథిలేయ పరిషన్మధ్యంబునన్ యాజ్ఞవ
ల్క్యుని వాదాద్భుతమట్టి యద్భుతము నాలోచించు జేయంగ, జే
సినచో నట్టిది మైథిలేయ సభలో జేయన్ వలెన్ వేదముల్
వినుతించున్ మిథిలాసభాగత మహా వృత్తాంత మంచెంచుచున్.

(అవతార. 409, 10)

ఈ ఉద్విగ్నతతోనే అతడు అహల్యాశ్రమం వద్ద 'ఎప్పుడు చూతునో మిథిల? యెప్పుడు వాజసనేయ సత్కథల్ తప్పక పోల్చుకొందునాకొ' అంటూ కన్నీళ్ళు పెట్టుకున్నాడు. అతడికి మిథిలానగరం పట్ల వున్న గాఢానురక్తి అంతటిది. మూలంతో కల్పవృక్షం భేదించే చోటులలో ఇదొకటి. అతడికి శివధనుర్దర్శనాభి లాషకంటె మిథిలేశుని దర్శించటమే ఎక్కువ ఉత్కంఠావహమైన విషయం. అతని దర్శించాక సెలవు తీసుకుని విడిదికి చేరారు మరుసటిరోజు ధనుర్దర్శనం. అక్కడ వరుసగా అయిదు సీసపద్యాలలో కాల వర్ణన చేయబడింది. మొదటి వర్ణనలో 'జరఠఖరదాతపమ్ముల' గురించి చెప్పబడింది. ఇది గ్రీష్మ వర్ణన. తరువాత సంధ్యాకాల వర్ణన. ఆ పైన శుక్లపక్షవిదియ వెన్నెల వర్ణన వుంది. ఆ వర్ణన తరువాత 'అల్లయామిని యామిని యెల్ల నొక మహా పురుషు జీవితము

వోలె నవఘళించె' నన్న నిశావర్ణన వుంది. తరువాత వున్న వర్ణనలో రామకథ లోని ఉత్తరభాగం సూచితమయింది.

> ఛిన్న చాపస్వన స్థితి మూడు విరుపులై
> కుటిల భుగ్న క్రీడ కోడి కూసె
> వెలుగు నాగేళ్ళఁ ద్రవ్విన తూర్పు పొలములై
> సాధుసస్యశ్రీ యుషస్సు పండె
> ఒక మహాకృతి దిశాళికి పూత యిడినట్లు
> దిక్కోణ వలభులు తెల్లవడియె
> సాధు సాధు ప్రశంసారావములు వోలెఁ
> గల నిస్వని శకుంతకులము కూసె
> తాండవోగ్ర రుద్ర తరుణీ నవారుణ
> చరణకాంతిఁ బ్రథమ సంధ్య పొలిచె
> బారసాగి పద్మబంధువు మందేహ
> రక్తభార్గవీ భరంబు చెలిపె (ధను. 279)

శివధనుర్భంగం, నాగేటి చాలులో దొరికిన నాతి సీతతో వివాహం, సర్వత్రా దక్కిన ప్రశంస, భార్గవరామ ప్రవేశం ఈ వర్ణనలో సూచితమవుతున్నాయి. కాలవర్ణన చేసినట్లు చేసి కథాసూచనే చేయటం కవి ప్రతిభ. వర్ణన అంటే కథతో భేదించేదిగా వుండదు. అది కథలో ఒక భాగం. "ఉచితముగా దేనిని గురించి వర్ణించినను కవిత్వమే. వర్ణనయనగా ప్రకృతి వర్ణనయే వర్ణన యను కొందురు. కథను చెప్పుటకూడ వర్ణనయే"[1] అని విశ్వనాథ అభిప్రాయం.

ధనువును 'దీర్ఘకాయులు బలాధికులు అయిన అయిదువేలమంది జనం చక్రాలబండిపైన లాగుతూ తెచ్చారు.' 'గాధేయుడు రామునిగాంచె విధేయుడు రాముండు నేత్రదీధితులేచెన్' (294). అతడు ధనువు చేరబోయి, మంజూష తెరచి కౌశికుని వంక చూశాడట. 'ముదల' కోరాడు. కౌశికుడికి జరుగబోయే కథాసర్వం తెలుసు. 'తాకవే యింతయే చాలు ధనువునకును' (297) అన్నాడు. అది 'మునికనుసైగ తెలిసి శివధనువును విరిచే సమయము.' అపుడతడు అంతః పుర స్త్రీల వచలిక గుర్తించి తలయెత్తాడు ఇదమిత్థమని నిర్ణయింపగారాని కోరిక ఏదో రూపుగైకొని వచ్చినట్లున్న మూర్తి కనిపించింది. ఆమె సీత.

తన సృష్టిలోని యుత్తమ భావమానంది
ముగఁబొంగి బింబమై పొడిచినట్టు.[2]

అరుంధతి, అహల్య, కౌసల్యల ముఖముల కంటె పవిత్రమయిన 'శృంగారభావ మొడిసి పట్టిన ముఖచంద్రుడొకడు' ఆమెలో రామునికి కనిపించింది. ఈ వర్ణన సీతారాముల పవిత్ర శృంగారానికి నాంది. ఇక్కడ రాముడికి కనిపించినది సీత మాత్రమే కాదు. తాను జన్మనెత్తినది మొదలు, ఎవరికోసమై అంతరాంతరాలతో రహస్యంగా అన్వేషిస్తున్నాడో ఆ మూర్తి కనిపించింది. అది అతని దృగింద్రియత్వానికి పరమత్వం ప్రసాదించిన దర్శనం. అంతటి దివ్యదర్శనం నుంచి చూపు మరల్చుకున్నా చిత్తం అక్కడే చిక్కుపడి పోయింది. 'తాళ ప్రమాణమైన ధనువును నిలువుగా పట్టుకుంటే జానకికి తాను కనిపించనేమో'నని అడ్డంగా పట్టుకున్నాడు (302). ధనుర్భంగమై మహాధ్వని కలిగేదాకా గుణంబు బిగించుట లాగు టింతయున్ నేరడట. అయిదువేలమంది అతి ప్రయత్నం మీద తెచ్చిన ఆ ధనువు చెరుకుగడలాగా చేతిలో ఒదిగి ఛిన్నమై పోయింది. సీత సిగ్గుతో తల వాల్చింది. అతడి దృష్టికి ఆమె ఓపలేకపోయింది. ఈ ధనుర్భంగ రావంతో సర్వ ప్రపంచం నిస్తబ్ధ సలిలాశయంలాగా నిశ్చేష్టయై నిలిచింది.

నిష్ఠావర్షదమోఘ మేఘ పటలీ నిర్గచ్ఛదుద్యోతిత
స్వేష్మేరమ్మద మాలికా యుగపదుజ్జృంభన్మహా ఘోరబం
హిష్ఠ స్ఫూర్జథుషండ మండిత రవాహీన క్రియా ప్రౌఢి ద్రా
ఘిష్ఠంబై యొక రావమంతటఁ జెనసంగెన్ ఛిన్న చాపంబునన్
(ధను. 303)

ఇంతటి శబ్దం గురించి చెప్పడానికి ఈ పద్యాన్నింత ప్రౌఢంగా తీర్చాడు కవి. ఇది చెళ్ళపిళ్ళవారిని విస్మయపరచిన రచన.[3]

ఈ ఘట్టంతో వివాహ సంరంభ మారంభమవుతూంది. ఈ వివాహ విధులన్నీ తెలుగునాట సమకాలిక జీవనంలో కవి చూసినవే.

మూలంలో వివాహ విషయాలను విస్తరించి చెప్పలేదు. కల్పవృక్షకారుడి వద్దకు వచ్చేసరికి తన సమకాలిక జీవితమంతా కవి కావ్యస్థం చేశాడు. దీనికి విశ్వనాథ పొందిన సాంఘికావసరం ఒకటి వుంది. అప్పటికే తెలుగు సంప్ర

దాయాలు, విశ్వాసాలు నెమ్మదిగా జనజీవితం నుంచి నిష్క్రమించటం ఆరంభించాయి. ఆ సంప్రదాయ విశ్వాసిగా విశ్వనాథ 'వేయిపడగలు' రచించి తెలుగు జీవితాన్ని గ్రంథస్థం (Record) చేశాడు. కల్పవృక్షంలో ఇటువంటి చోట్ల విస్తరించి వివరించాడు రానున్న తరాలకు గడచిన సంప్రదాయ వైభవాల్ని గురించి తెలపటం కోసం ఈ రచన అవసరమని కవి భావించినాడు. 'ప్రాత దంతయు పోవుచున్నది. క్రొత్త దంతయు వచ్చుచున్నది... నేనును నీ కాలమునకు దగినవాడను కాను. ఇవి యన్నియుఁ బచ్చిపోవుచున్న యొక జాతి చివరి మెరపులు'4 అనటంలో ఈ వేదన స్పష్టంగా కవిలో కనిపిస్తుంది. కల్పవృక్ష రచన, వేయిపడగలు ఒకే కాలంలో ఆరంభింపబడటం చేత ఈ రెండింటిలోనూ ఆ తపన స్పష్టంగా కనిపిస్తుంది. ఈ వైవాహిక విధాన వర్ణన ఆ అవసరంతో చేయబడ్డది.

మూలంలో ధనుర్భంగ ఘట్టంతోనే విశ్వామిత్ర నిష్క్రమణముంది. అక్కడ అతడు పరశురామ ప్రవేశాన్ని చూడలేదు. ఎందుకంటే, మూలంలో వివాహానంతరం ఆ ఘట్టం వుంది. రామాదుల వివాహం కాగానే ఆ రాత్రి దంపతులు విడిదికి వెళ్ళారు.

> అథ రాత్ర్యాం వ్యతీతాయాం విశ్వామిత్రో మహామునిః
> ఆపృష్ట్వా తౌ చ రాజానౌ జగా మోత్తర పర్వతమ్ (74 స. 1 శ్లో)

అని మూలం. రాత్రి గడవగానే కౌశికుడు సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. ఇక్కడితో అతడి గురించిన ప్రస్తావన ముగిసింది. మూలంలో ఇతడు మళ్ళీ కనిపించడు. కల్పవృక్ష విశ్వామిత్రుడు కూడా వివాహ పర్యంతమే వున్నా, అతడికి దక్కిన దృశ్యం రాముడు విష్ణుధనుర్ధారణ చేయటం. సీతను పరిగ్రహించక పూర్వమే రాముడు సంపూర్ణ మూర్తిగా ఎదగాలి. దానికోసం వివాహాత్పూర్వమే పరశురామ ప్రవేశం జరిగింది. కౌశికుడు రామాదుల వద్దనుండి సెలవు తీసుకుని పోవటం కల్పవృక్షంలో ఒక అపురూప దృశ్యం. రాజబాలకుడై వున్న రాముని యజ్ఞరక్షార్థమనే వ్యాజంతో తీసుకుని వెళ్ళి ధనుర్విద్యా రహస్యాల్ని బోధించి, అతడి అవతార పురుషత్వాన్ని స్ఫురింపజేసి, 'కథాత్మ్సాంత విజ్ఞానాన్ని' ప్రసాదించి, శివధనుర్భంగ కార్యానికి నేపథ్యంగా నిలచి, వివాహా

నికి ముందే విష్ణునను స్వీకారి యోగ్యుడైన రాముని దర్శించి వివాహపర్యంతం వున్న బాంధవుడతడు రాముడే నారాయణుడని అతడే రావణ సంహారకుడని కౌశికుడికి తెలుసు. అతడు ఆ కార్యానికి బాటలు తీర్చిన వ్యక్తి. రావణ సంహారానికి సీతాపహరణం హేతువు ఆమె అపహరణమన్నది విధి పథకం. దానికై రామునికి సీతకూ వివాహం జరగాలి. ఆ పని ఎంత త్వరగా నెరవేరితే లోకానికి అంత త్వరగా శాంతి లభిస్తుంది. అందుకోసం కౌశికుడు చేసిన సఫల ప్రయత్న మిదంతా. సీతారాములు అరుంధతీ నక్షత్ర దర్శనం చేయగానే కౌశికుడు నిష్క్రమించాడు.

> విశ్వామిత్రుడు స్వాశ్రమాధి ముఖుడై వెంచేయుచో దీర్ఘముల్
> నిశ్వాసంబులు పుచ్చుచున్ గనుగొనల్ నిండారగా బాష్పముల్
> ప్రస్వేదాకృతి రామచంద్రుని బరిష్వంగంబునన్ బట్టుచున్
> శీశ్వాశీస్సులు శ్వోవసీయముగ దానృష్టించి వెంచేసినన్.
>
> (కళ్యాణ. 101)

రామునికి ఈ నిష్క్రమణం ఎదలో తెలియరాని భావనలేవో నింపింది. 'చేత మున సౌఖ్యమో! దుఃఖమో! తెలియదు.' ఈ ఋషి కావ్యంలో నిష్క్రమించినా రాముని ఎదలో పదిలంగా దాగి తరచుగా బయల్పడుతూనే వుంటాడు.

కళ్యాణానంతరం సీతారాములు గడిపిన దాంపత్యం ముగ్ధసుందర మయింది. ఇంద్రియాలలో అవాచ్యమధురమైన అనుభూతి ఏదో ప్రాకింప సాగింది. వీరిని చూసిన పట్టమహిషికి, రాణులకు ఒక వినోదం. ఈ వినోదం నెమర పల్లెటూళ్ళలో కనిపించే శోభ వుంది. 'ఇంక కోడలు వచ్చింది మేమెందుకు లేమ్మా' అని హేలగా శాంత కౌసల్యను అనిందట. సీత అంతటి ముగ్ధ. ఆమె అందరినీ ఆకర్షించింది. కైకకు మునుపునుంచి రామునిపట్ల వున్న ప్రేమ సీతఆగమనంతో ద్విగుణితమయింది.

తరువాత సాగిన రాముడి శృంగార లీలలు కౌశికుడి ననుసరించాయి.

> 'కోకిల దూరాన కూసిన నేవచే
> నన్ను బిల్చితి వంచు నవ్వుసామి
>
> (కళ్యాణ.286)

'తన పాద మామె పాదము జతగా బెట్టి
యస్మత్పదంబు మోటని వచించు (కళ్యాణ 287)

మేనకా విశ్వామిత్ర ఘట్టంలో ఇవే శృంగారలీలలు వర్ణితమయ్యాయి.

'కోకిల కొమ్మలోఁ గూసిన సీవచే
నన్ను బిల్చితి వంచు నవ్వుమౌని' (ధను. 193.)

'తన పాదమామె పాదము జతగాఁబెట్టి
యస్మత్పదంబు మోటని వచించు' (ధను. 194)

ఈ లీలా విశేషాల్ని చూసి 'ఓ స్వామీ! ఎక్కడ నేర్చారివన్నీ' అని అడిగితే 'నేను నేర్చినదేమున్నదే? సతాంగి, గౌశికుండుపదేష్టయు గానిది' (కళ్యాణ. 288) అన్నాడట. ఇక్కడ కౌశికుడెంతగా రాముని హృదయస్థమయ్యాడో తెలుస్తూంది. అందుకే అతడు ఆశ్రమాభిముఖుడై వెళ్తూంటే అశ్రునయనుడై చూశాడు రాముడు. ఈ శృంగార భావనా సమాకృష్టుడై, తత్పూర్వ వైరాగ్య భావనలను సమన్వయించుకుని వైరాగ్య సంసార భావనల సంగమం చేత సమప్రసార రమ్యత్వం తన జీవితానికి కలిగించుకున్నాడు.

ఈ సన్నివేశ కల్పనచేత భవిష్యత్కథలో వనవాస క్లేశాన్ని, ప్రతిక్షణ దహ్యమాన సీతావిరహాన్నీ భరించగలిగే శక్తిని రాముడిలో నిరూపిస్తున్నాడు కవి. రాబోయే దయోధ్యకాండ. అందులో రాముడు రాజుగా ఎన్నుకోబడటం వుంది. (వనవాసం కలిగినా మొదట జరిగిన విషయం పట్టాభిషేక సంబరమే) రాజు కాబోయే వ్యక్తిలో సమప్రసార రమ్యమైన స్థితప్రజ్ఞ వుండాలి. అది ఇక్కడ నిరూపించబడుతూంది.

## పాదసూచికలు

1. విశ్వనాథ సత్యనారాయణ; నేనూ-నా సాహిత్య రచనలూ' (వ్యాసం) 'మహతి'.

2. ఋశ్యశృంగ కథలో వేశ్యల గానమాధుర్యం ఋశ్యశృంగునికి కలిగించిన అనుభవ చిత్రణ ఇలాగే వుండటం ఆశ్చర్యం.

'తన సృష్టిలోన నుండిన క్రొత్త మాధుర్య
సీమలు క్రేళ్ళుగాఁ జెంగలించి' (ఇష్టి. 175 ప.)

ఈ రెండింటిలో ఎత్తుగడలో సమత్వం మాత్రమే కాక, Anima-animous theory కి రెండూ ప్రమాణ మవుతున్నాయి.

3. "ష్టా ప్రాసతో యేదో భావాన్ని గూర్చి యేక సమాసంలో సంస్కృత వ్యాకరణదోషరహితంగా రచన సాగించే తెలుగుకవులు వొక్కొక్క శతాబ్దానికి వొక్కరేనా వుంటారా? అనేదే నా ప్రశ్న. ఈ రచన పురాణ పాకం కాదని వ్రాయనే వ్రాశాను. ఇట్టి వాణ్ణి విద్వత్కవి అనడానికి యే విద్వాంసుడు వెను దీస్తాడు?"

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి; కథలు-గాథలు
రామాయణ కల్పవృక్షం; పు. 462.

4. వేయిపడగలు. 7 వ అధ్యాయము. పు. 185.

# సకలోహ వైభవ సనాథము

బాలకాండలో రాముడి గతశైశవ రాగమాలికల ప్రతిధ్వనులు వినిపిస్తాయి. ఇక్కడి రాముడు తెలుగువారి ముద్దుబిడ్డ. అతడివన్నీ పైకిబాలచేష్టలుగా కనిపించినా తెరవెనుకలి తేజస్సులాగా ఆ చేష్టవెనుక అతడు కారణజన్ముడన్న రహస్యం స్ఫురిస్తూనే వుంటుంది. రామపాత్ర భారతీయుని సొత్తు. ఎవరి ఊహా వైశారద్యాన్నిబట్టి వారు దానిని తీర్చారు. ఎవరెవరి ప్రాంతీయాచార వ్యవహారాలకు తగినట్లు వారువారు రాముని చిత్రించుకున్నారు. ఆ పాత్ర ఒక జాతీయ సంపద.

కల్పవృక్ష బాలకాండలోని రాముడు తెలుగు వ్యక్తి. అతడి జననవేళ సాగించిన జాతకర్మాదులన్నీ తెలుగు ఆచారాలే. రామాది సోదర చతుష్టయం జన్మించగానే అంతఃపురస్త్రీలు ప్రతి యింటికీ పసుపు, కుంకుమ, గిన్నెలనిండ నూనె, శీకాయ పంచిపెట్టారు. పురుటింట్లో నారమట్టలు, పాతచెప్పులు కట్టారు. బిడ్డలను ప్రసవించిన రాణులు శాస్త్రార్థం బావిలో చేదవేశారు. ఇవి తెలుగు ఆచారాలు. విశ్వాసాలు. శ్రీరాముడు జన్మించిన రోజు శ్రీరామనవమి. ఆ రోజు వాన కురుస్తుందని ఆంధ్రుల నమ్మకం. దీనిని మనసులో వుంచుకుని కవి, రామజననవేళ వాన కురిసినట్లు వర్ణించాడు.

పురుషులెవరైనా తన నెత్తుకుంటే, రాముడు వారి మూర్ధాలను ఒత్తి చూస్తాడట. లక్ష్మణుడు స్త్రీలెవరైనా తన నెత్తుకుంటే వారి ముక్కు చెవులు తగిమి చూస్తాడట. ఇవి రెండు విషయాలూ, వరుసగా రావణుని దశకంఠ రత్నాన్ని, శూర్పణఖ ముక్కు చెవులను జననవేళనుంచీ వెతుకుతున్నారన్న స్ఫురణ కలిగిస్తున్నాయి. నడిచే వయసు వచ్చినపుడు రాముడిని నడిపిస్తే మూడడుగులు వేసి క్రింపపడ్డాడట. అది త్రిలోకాల్ని గెలుచుకున్నట్లు ఉందట 'ఎన్ని విశ్వంబులో రాఘవేశులిండ్లు మూడడుగులెన్ని వేసినను మొగిడిరావు' అన్న మాటల్లోనూ వామనావతార స్ఫురణతెచ్చి, ఈ త్రివిక్రమతను సూచించాడు.

కవి రాముడు దారువుతో చేసిన చిన్ని కత్తులు నోటికొాసలకు ఉంచుకుని వన వరాహంగా స్త్రీలను బెదిరించే ఆట ఆడటంలో వరాహావతార స్ఫురణ వుంది.

> తానో'లాములు' తండ్రిపేరెవరయా 'దాచాతమాలాలు' 'నౌ
> లే! నాపే'రన 'నమ్మగా'లనగ నోలిందల్లి 'కౌసల్య తం
> డ్రీ' నాగా ననబోయి రాక కనులన్ నీర్వెట్టఁ 'గౌసల్య నౌఁ
> గానే కానులె యమ్మనే'యని ప్రభున్ గౌసల్య ముద్దాడెడిన్.
>
> (అవతార-384)

శిశుచేష్ట వర్ణనలన్నీ ఒక ఎత్తు. ఈ పద్యమొకటీ ఒక ఎత్తు. అతడు జగతికి భగవంతుడైనా తన తల్లికి తనయుడే. కౌసల్య వచ్చి 'నాపేరేమిటి' అంది. 'అమ్మగాలు' అన్నాడు రాముడు. 'కాదు, కౌసల్య నాయనా' అని చెప్పబోయి, 'కాను, అమ్మనే లే' అనటంలో అపురూపమైన ఆర్ద్రతవుంది. 'కౌసల్య' అనగానే కోసలరాజ పుత్రి, దర్పం, రత్నానూన వస్త్రాలు ఇవన్నీ కనిపిస్తాయి. 'అమ్మ' అన్నమాటకు ఇవి అలంకారాలు కావు. ఆ మాట చూపే రూపం ఒక మహారాణి కావచ్చు లేదా ఒక పేదరాలు కావచ్చు. 'అమ్మ' అనే మాట విశ్వజనీనమైన రూపాన్ని కలిగిస్తూంది. తన తనయుని ముందు 'నేను రాణిని నాయనా' అని దిద్దబోయి, అక్కడ ఈ విషయాన్ని గుర్తించి, 'కాను అమ్మనే లే' అంది.

కల్పవృక్షంలోని రాముడికి కైకతోనే సాన్నిహిత్య మెక్కువ. కైకవద్ద వుంటే ఎవరు పిల్చినా పోడు (అవతార-323) కాళ్ళు వచ్చింది మొదలు కైక వద్దకు పరుగుతీస్తే, నిద్రలేచింది మొదలు రాముడికోసం కైకవస్తుందట. ఉప నయనవేళ రాముడు భిక్షాం భవతి దేహి'1 అని భిక్ష నడిగితే, కౌసల్య హేమా భరణాలు, సుమిత్ర ఆశీస్సుల నిచ్చారు. కైక మాత్రం 'పిడిని మరకతమ్ము తొడిగిన చురకత్తి, వజ్రపుంఖితమ్ము వాలుటమ్ము, ఇచ్చింది. దానినందుకుని 'మొగమున నింతయై మురిసిపోయెను రాముడు'. ఇదంతా ఆమెను యోగినిగా నిలబెట్టిన కల్పవృక్షకారుని కల్పన.. ఆమెకు రామావతార రహస్యం తెలుసు. రాముడు తన ధనురస్త్ర విద్యను కైకకు కనిపింప చేసుకుంటే ఆమె మురిసి ఆనందబాష్పాలు రాల్చి, దష్టితీసింది. అతనికి తానూ గురువై 'ఉన్వేత్తుగ' 'కోదండ కళా విచిత్ర గమశ్రీ'ని ప్రసాదించింది. 'రాముడొక యోగి మతిన్

దితిజోగ్రవారి మార్తాండుడు; దానికై తనువుదాల్చె'[2]నన్న 'రహస్యం' ఆమెకు స్పష్టంగా తెలుసు. దీనిచేత వాల్మీకంలోని కైక చేష్ట 'సవతి మత్సరం'గా కాకుండా, 'యోగదృష్టి'గా వ్యాఖ్యానింపబడింది. ఆమెకు రాముడంటే అమిత ప్రేమ. యజ్ఞరక్షార్థం రాముని పంపుమని కౌశికుడు అడిగితే దశరథుడంటాడు: 'ఎవ్వరెటులైనను కైకయు యోర్వ్వజాల'దు (అహల్య. 49). ఈ విశ్వాసం వెనుక కైక రాముని ఎంత వాత్సల్యంతో చూసిందో స్పష్టమవుతూంది. అటు వంటి స్త్రీ మత్సరగ్రస్తురాలు కావటంలో ఔచిత్యం లేదు. ఆ పైకి కనిపించే మాత్సర్యం వెనుక మర్మమేదో వుండాలి. దానిని విశ్వనాథ ఈ విధంగా గుర్తించాడు.

దశరథుడు స్నేహశీలి. అతడిది ఆర్ద్రమైన సత్త్వం. తానురాజైనా పాలన మంత్రులదిగా భావించాడు. సుమంత్రుడు తనను ప్రశంసిస్తే, దశరథుడన్నాడు: 'చాలు చాలునోయి సుమంత్ర! మంత్రులే తమ పాలనంబు తాము పొగడి కొలెత్తు కొందు'రని (ఇష్టి. 46) ప్రాచీన రాజు ప్రజలతో అతిసమీపంగా వర్తించేవాడని విశ్వనాథ వేయిపడగల్లో 'కృష్ణమనాయని పాత్ర ద్వారా గుర్తించాడు. ఇక్కడి దశరథుడిలో ఆ లక్షణాలు బాగా కనిపిస్తాయి. తాను పుత్రసంతాన సహితుడు కాలేదని అతడు పొందిన వ్యథ దీనికి తార్కాణం. అంగళ్ళలో విక్రయార్థ ముంచిన బొమ్మల్ని చూసి దారిలో కనిపించే పసిపిల్లల్ని చూసి, మనస్సంతా సంతానమయమైపోయిన చింతతో గడిపేవాడు. ఎక్కడైనా పసిబిడ్డ ఏడ్పు వినిపిస్తే విని చలించి రాజకార్యాల మధ్యకూడ విస్మృతి పొందేవాడట. అశ్వమేధ యజ్ఞానికి అందరికీ ఆహ్వానాలు పంపుతూ 'ప్రభవము కాని సంస్కృతికి పట్టయిన' గుహుని పిలిపించాల్సిందిగా పేర్కొన్నాడు. 'ఎలాగైనా సరే జటాయువును పిలుచుకుర'మ్మని మనుమల్ని నియోగించాడు. అతడిని 'స్నేహావధి'గా గుర్తించాడు. అతడి చెలిమి ఇంద్రునితో చెలిమి వంటిదని (ఇ. 347) గౌరవించాడు.

బాలకాండలోని మరొక ప్రధానపాత్ర విశ్వామిత్రుడు. ఇతడికి రాముడంటే ఎవరో తెలుసు. తొలిసారిగా దశరథాస్థానంలో రాముడు తన పాదాలు తాకితే కౌశికుడు పులకించిపోయాడు. ఇతడు రాముడికి అస్త్ర విద్యా గురువే కాదు. శృంగార మార్గోప దేశకుడు కూడా. తాటకావధ ఘట్టంనుంచి, రాముడు విష్ణు ధనుస్స్వీకారం చేసి సీతాసమేతుడయ్యే దాకా కౌశికుడు వున్నాడు. రాముడిలోని

సర్వశక్తులనూ అతడు జాగృతం చేస్తూనే వచ్చాడు. సీతావివాహం జరగటంతో తాను నిష్క్రమించాల్సిన అవసరాన్ని విశ్వామిత్రుడు గుర్తించాడు. సీతతో రాముడు కలిశాక, ఇక జగత్కల్యాణకారకమైన రావణవధ జరుగబోతూ వుంది. దానికోసం ముందుగానే రాముని సర్వశస్త్రాస్త్ర విద్యా సంపన్నుని చేశాడు. తన వంతు కర్తవ్యం ముగించుకుని తపోమార్గాల్లోకి వెళ్ళాడు. అత్యంత సాన్నిహిత్యంతో కౌసల్యకంటె మృదువుగా లాలించిన3 కౌశికుడు వెళ్తూంటే, రాముడు కన్నీళ్లతో వీడ్కోలు పలకటం కల్పవృక్షంలోని అందమైన కల్పనల్లో ఒకటి.

కల్పవృక్షపాత్రలు నవ్వటంలో విభిన్న ధోరణులు కనిపిస్తాయి. రామ

లక్ష్మణుల తనతో పంపుమని దశరథుని అడిగిన కౌశికుడిది 'క్రొత్తనవ్వు' (అహ.29) 'రాముని వీడి అఖిలరాజ్యాన్ని గ్రహించు' అని దశరథుడంటే అపుడు కౌశికుడిది 'చిళ్ళచిళ్ళలగు' నవ్వు (అహల్యా. 34) పరమక్రుద్ధుడై ప్రవేశించిన పరశురాముడిది 'దీర్ఘానంత విశ్లథ హాసం' (ధను. 406), వివాహితుడైన రాముడిది 'సన్నని నవ్వు' (కళ్యాణ. 154), సీతతో వినోదించే కైకది 'అడవి కోడి కూసినట్లుగా' వున్న నవ్వు- ఇత్యాది రకరకాలైన నవ్వులు కల్పవృక్షంలో వున్నాయి. తిక్కన తరువాత నవ్వుల గురించి ఇంత పరిశీలనాత్మకంగా చిత్రించిన కవులు దాదాపుగా లేరు.

ప్రధాన కథా విషయాలైన వనవాసాదులను కవి తరచుగా పాత్రల వాక్కులలో ధ్వనింపచేశాడు. పుత్రకామేష్టికి వచ్చిన జటాయువు 'నే నా ముని కూనలన్ గనుదునా' అనటంలో 'ముందుగా పుట్టిన బిడ్డలు' అనే అర్థం వుండగా, 'ముని' శబ్దంచేత భావి అరణ్యవాసంలో మునిరూపులై నార చీరలతో తిరిగే రాముడు సూచించబడుతున్నాడు. అదే విధంగా మరోచోట కౌసల్య మార్గంలోనే సుమిత్ర కూడా నడిచినట్లు చేసిన వర్ణనలో, కౌసల్య పదునాల్గు దినాలు ఒకే చీరకడితే సుమిత్ర తానూ ఆమెననుసరించి పదునాల్గుదినాలు ఒకే చీర కట్టిందని చెప్పబడింది. భవిష్యత్తులో రాముడు పధ్నాలుగేండ్లు వనవాసం చేయటమూ, అతని ననుసరించే సౌమిత్రి వుండటమూ దీనిద్వారా సూచింపబడుతూంది. కౌశికుడు తన యజ్ఞరక్షార్థం రామలక్ష్మణులను పంపుమని కోరుతూ, 'పిమ్మట నీవుగా నతని వీడవలెన్ మరిమాకు నేటికిన్' (అహల్యా. 36) అనటంలో కైకకు వరమిచ్చి దశరథుడు రామలక్ష్మణులను (లక్ష్మణుడు వరంలో ప్రస్తావితుడు

కాకున్నా) అడవికి పంపటం ధ్వనిస్తూంది. రామునికి సీతకు అహల్య నారచీరలు ఇచ్చి 'బాల ఋషు'లనటంలో భావివనవాసమే సూచితమయింది. రాముడు సీతతో 'ఒక్కసమయాన మనకు వియోగమైన ప్రేమ యేమగు' (కళ్యాణ 287) అని చింతించటంలో భావి విరహ సూచన వుంది. ఈ ప్రధాన విషయమైన వనవాసాన్ని కాక శివధనుర్భంగ విషయాన్నికూడా రాముడు ధనుర్విద్య నేర్చుకునేవేళ పీరుల ధనువులు 'ఫెళ్లు'మంచు (అవతార. 351) విరచటం ద్వారా సూచించాడు. ఇది బాలకాండకు పరిమితమైన కథాసూచన.

కథాసూచన చేయటంతోపాటు హేతుకల్పనకూడా ఒకవిశేష విషయమే. దేవతలు విష్ణువు వద్దకువెళ్ళి అతడిని అవతారమెత్తుమని ప్రార్థించినపుడు చేసిన చర్చలో వాలివధ హేతువు వుంది. మహావీరుడు, రావణుని జయించినవాడు అయిన వాలి, రాముడికి తొలుత తోడ్పడుటకు హామీ ఇచ్చి, హఠాత్తుగా తనను రావణుడు క్షమకోరితే ఇవ్వవచ్చునేమో! దానితో అవతార ప్రయోజనమైన రావణవధ జరిగేందుకు అనుకూల పరిస్థితులేర్పడవు. స్వామిని రంగంలోకి దింపి తాను సాయం చేయలేనని వాలి నమస్కరిస్తే ఫలమేమిటి? అందుకోసం సాయ పడగల సుగ్రీవుడు రాజు కావాలి. దానికి వాలి తొలగించబడాలి. ఈ చర్చతో వాలి వధ వెనుక వున్న దేవతల పథకాన్ని వ్యాఖ్యానించాడు విశ్వనాథ. వాలిని రాముడు వధించడానికి గల హేతు కల్పన ఇది.

బాలకాండలోని వర్ణనాశిల్పం భావిత రమణీయాంశం. ప్రయోజనా సహితత్వమే[4] శిల్పమని విశ్వనాథ అనిన మాట ప్రకారం ఇక్కడ వర్ణనకూడా కథావస్తువులతో ముడిపడి వుండి, శిల్పమవుతూంది.

ప్రాచీన కావ్యాల్లో నగరవర్ణన మన్నదొక ప్రత్యేకాంశంగా గుర్తించటం కనిపిస్తుంది. బాలకాండలో ఆ పద్ధతి లేదు. వర్ణన, కథావస్తువు రెండూ పరస్పర సంబంధం కలిగి వున్నాయి. దశరథుడు వ్యాకుల మనస్కుడై 'అసివాళ్లు' వెళ్ళినపుడు నగరమెలా వుందో వర్ణించబడింది. అతడి 'అసివాళ్ళ' పేరిట నగర వర్ణన చేయటమొక చాతుర్యం. ఇది నగర వర్ణనా? అంటే అవును. కథావిషయ మైన దశరథుని వాహ్యాళివర్ణనా? అంటే అదీ అవును. ఈ విధంగా కావ్య వస్తు వుకు వర్ణనకూ మధ్య ఒక బలమైనబంధం వుండటం విశ్వనాథ సాధించిన

విజయం. ఇదే పద్ధతి కావ్యమంతటా కనిపిస్తుంది. 'ఎట్టనౌ నేత్రమ్ము లిష్టి వేళా నల ధూమ సంతానమ్ము దూఱినట్లు' (ఇష్టి. 254) అన్న వర్ణనలో అటు మధు మాసంలోని మత్తకోకిలతో పాటు ఇటు యజ్ఞ సంరంభమూ సూచితమయింది. రామాదులు పెరిగి పెద్దవారు కావటాన్ని 'తిరిగి వసంతకాల మరుదెంచె...' అన్న పద్యాల్లో ప్రకృతి పరిణామాలను వర్ణిస్తూ వాటిచే పాత్రల వయోపరి ణామం సూచించాడు. మహారాణులు గర్భిణులు అయినవేళ వారి దౌహృద వర్ణన వర్ష ఋతువుపై ఆరోపించి చెప్పబడింది. 'వర్షాసమారంభ వైభవం బొలసినంతన పయోధరాగ్రముల్ నల్లబారె' (అవతార-161) ఇత్యాదిగా నడ చిన ఈ పద్యంలో శ్లేషాలంకారం వుండి, అటు ఋతువునూ, ఇటు దౌహృద లక్షణాల్నీ ఒకేసారి వర్ణిస్తుంది.

'శంపాసహస్రాభ చండకాంతి చ్ఛటా
మేయ వారావర్త మెఱసి మెఱసి' (అహల్యా. 378)

అనిన గంగావతరణ వర్ణన,

'మాకంద తరుశాఖికా కోకిలాలాప
కౌతూహలాకార కలన జేసి' (ధను. 181)

అని సాగిన మేనకావతరణ వర్ణన,

'ఇదమిత్థమని నిర్ణయింపగారాని దే
కోర్కియో రూపు గైకొన్నయట్లు'

'పునురుద్భవద్దంత ముగ్ధమోహన రుచి
ప్రకట రేఖాహాస భావపరిధి' (ధను. 299, 300)

అని సాగిన సీతా తొలి దర్శనంలోని రాముని అనుభవ వర్ణనా, అపురూప శబ్ద చిత్రాలు. ఇవికాక, విశ్వామిత్రుడి తపస్సులోనూ, రాముడి వైరాగ్య వేళలోనూ చేయబడ్డ ఋతువర్ణనలున్నాయి.

ఆకులురలిన రెమ్మల యంతములను
జివురు తొలిరూప మెట్టని చీరగట్టె
జాకుమండింపఁ గలుగు నేర్పాటు కొఱకు
మన్మథుడు నిప్పులుంచిన మాద్రి గాఁగ (కళ్యాణ. 274)

ఇలాంటివి, 'గాథా సప్తశతి' స్థాయికి ఎన్నదగిన పద్యాలు ఋతువర్ణనలలో కని పిస్తాయి. విశ్వనాథ కల్పవృక్ష వర్ణనలు ప్రత్యేకాధ్యయనాంశం.

కావ్యావతారికలో 'నాది వ్యవహార భాష' అన్నాడు విశ్వనాథ. దాని స్వరూపం కల్పవృక్షంలో విస్తృతంగా వుంది. ఇది పూర్వ కవుల్లో 'కాకువు' రూపంలో వుంది.[5] విశ్వనాథ దీనిని మరింత విస్తరించి జనం నాల్కలపై ఆడే పలుకుబళ్ళను[6] కావ్యస్థం చేశాడు. దీనికి ప్రేరణ తిరుపతి వేంకట కవుల రచనలు కావచ్చు, 'బావా ఎప్పుడు వచ్చితీవు' 'అయినను పోయి రావలెను హస్తినకు' వంటి పద్యాల్లో ఆ పలుకుబళ్ళను తీర్చటముంది. కల్పవృక్ష బాలకాండలోనూ ఈ విధమైన రూపాలున్నాయి. 'నిద్రాహారములెల్ల మాని ఇదిగో...' (ఇష్టి, 82), 'అదికాదు గాని...' (అవతా 87) 'నీ కొడుకును గైకొని చని మా కాకలి యటంచు దిందుమా పిచ్చినృపా'(అహల్య. 35), 'మీ యారోగ్యము చూచుకోవలె నయా...' (అహల్య. 265), 'ఈ రాజేమి రాజౌనా...' (ధను. 225), 'ఏమో పాడెద వేమొయాడెదవు' (ధను. 233), 'ఇదియునుగాక...' (కళ్యాణ. 122) ఇటువంటి వ్యవహారిక రూపాలు పిడికిళ్ళకొద్దీ ఇతని కావ్యంలో దొరుకుతాయి. ఈ భాషా ప్రయోగం వలన పురాణ పాత్రలు ఎప్పటివో అనిపించక దగ్గరితనాన్ని కలిగిస్తాయి తన్మయ హేతువులవుతాయి.

వ్యవహార విధానంలోనే కాక స్వభావ రీత్యాకూడా పురాణ పాత్రలను మన ప్రక్కింటి మనుషుల్లాగ భావింప చేసి, సమీపత్వాన్ని కలిగించిన సఫల యత్నం విశ్వనాథలో కనిపిస్తుంది. బాలకాండలో, ప్రాజాపత్యపురుషుడు పాయస ప్రదానం చేశాక, రాణులు ఒక్కొక్కరు ఆరగించారు. ప్రాశన చేసే త్వరలో కౌసల్యాధరం నుంచి పాయసం ఇంచుక జారింది. దానిని తుడుచుకోవచ్చో, లేక అదికూడా తినాలో అని అనుమానించిందట. (అవతార. 122). గర్భిణీ స్త్రీలు మట్టి తినడానికి అభిలషిస్తారని ఒక నమ్మకం. మహారాణులు కూడా చెలికత్తెలతో మట్టి బెడ్డలు తెప్పించుక తిన్నారట (అవతార. 154) ఇదొక వర్ణన రాముడు కౌసల్య ఒడిలో పాలుత్రాగే వేళ 'గుటకలుబ్బెడు పసిగళములోని లేత నరముల చిరుకదలికలు చూసి' రాజు, రాణి ఆనందించారట (అవతార. 285) కుశనాభ తనయల కథ చెప్పాక కౌశికుడు రామలక్ష్మణులతో 'మీ ఆరోగ్యము చూచుకోవాలయ్యా! మీ తండ్రి ఎంత కష్టంతో పంపాడు! బాగా పొదు

పోయింది. మీ కనురెప్పల్లో నిద్రమంపు కనిపిస్తూంది. ఇక పడుకోండి' (అహల్య. 265) అన్నాడట. ఇదంతా కావ్యంతో సామీప్యాన్ని కలిగిస్తూంది. కవి రామాయణాన్ని 'సరస ప్రబంధంగా'[7] భావించటం చేత కలిగిన శోభ ఇది. లోక వ్యవహారాల పట్ల సునిశిత పరిశీలనా దృష్టిలేని కవి ఇలాంటి చిత్రణ చేయ లేడు.[8] ఆ యా సన్నివేశాల్లోని సంభాషణకై అతడు రస తపస్సు చేస్తాడు.[9] అప్పుడు రత్నస్థగిత హారంలా కావ్య సందర్భం కళకళ లాడుతుంది.

## పాదసూచికలు

1. క్షత్రియుడికి భిక్షావిధి లేదని ఇక్కడ విశ్వనాథ పొరబాటు చేశాడని కొందరు నాతో అన్నారు. కానీ 'మనుస్మృతి'లో క్షత్రియునికి కూడా ఉపనయన వేళ భిక్ష విధించబడింది. విప్రుడు 'భవతీ భిక్షాం దేహి' అని, క్షత్రియుడు 'భిక్షాం భవతి దేహి' అని, వైశ్యుడు 'భిక్షాం దేహి భవతి' అని అనాలని క్రింది శ్లోకం చెబుతూంది.

భవత్పూర్వం చరేద్భైక్ష ముపనీతో ద్విజోత్తమః
భవన్మధ్యం తు రాజన్యో వైశ్యస్తు భవదుత్తరమ్

మనుస్మృతి. అ2-50వ శ్లో.

2. కైక మంథరతో అన్నమాటల్లో ఇది స్పష్టమయింది. "రాముడొక యోగి మతిన్ దితిజోగ్రవారి మూర్తాండుడు దానికై తనువుదాల్చె రహస్యము సుమ్ము మంథరా!" అయోధ్య. అభిషేక. 124 ప.

3. యజ్ఞరక్షణ నిమిత్తం వెళ్ళిన రామలక్ష్మణులు దారిలో నిద్రిస్తే కౌశికుడు మేల్కొలిపాడు. "లేచి దైవమైన యాహ్నికంబు దీర్పుండనిన దల్లి పిలుపుకన్న ప్రేమార్ద్రమము మృదువునైన ముని మాటకు మేల్కాని..." అటు తర్వాతి వ్యవహారం చూశారు. చూ. బాల. అహల్య. 93. ప.

4. "ఏదియైన ప్రయోజనమున్నచో నది శిల్పము. నిష్ప్రయోజనమైనచో శబ్దాడంబరము." నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి. పు. 21

5. "కాకుధ్వని వాడుక భాషలోనే వున్నది. గ్రాంథిక భాషలో కాకువు సాధించుకోవాలి. ఈ కాకువు గ్రాంథికభాషలో ఇమిడ్చేటందుకు తిక్కనపడ్డ కష్టం భగవంతుడికి తెలుసు" అని విశ్వనాథవారు 'జయంతి' సంచికలో వ్రాశారు.

చూ. 'విశ్వనాథ కవిత-వ్యావహారిక భాష'. పు. 95. సాహిత్యసమితి వ్యాసావళి-1. శ్రీబొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారి వ్యాసం.

6. "వ్యవహారంలోని విశిష్టమైన పలుకుబడులను గ్రహించడం వల్లనే భాష వ్యావహారికం అవుతూంది గానీ కేవలం వ్యాకరణ ప్రత్యయాదుల వ్యావహారిక రూపాలు వాడడం వల్ల కాదు." పైదే. పు. 94.

7. "రాముని చుట్టును కథ శరవేగముగ తిరుగును. తద్వేగాతిశయమున బడి సుడిగాలికి తిరుగు శుష్కపత్రముల వలె మిగిలిన పాత్రలు తేలిపోవును. ఈ లోపము ఆయా కవుల ప్రతిభాలోపము వలన కలిగినది కాదు. వారు రామాయణమును ధర్మ ప్రధాన కావ్యముగా చెప్పిరి. కాని సరసప్రబంధముగా చెప్పలేదు. అట్లు విశ్వనాథ చెప్పెను."

డా॥ నాయని కృష్ణకుమారి. కల్పవృక్షము-కైకేయి. పు.40. 'పరిశీలన' (వ్యాస సంపుటి)

8. "లోకమున వ్యక్తులాయా సన్నివేశములలో మాటాడునపుడు హావభావములు, హేళనలు, దెప్పిపొడుపులు మున్నగు వాని నభివ్యక్తము చేయుటకు వాక్యవిన్యాసముతోపాటు కాక్వాదులు అభినయము మున్నగునవి యెంతో సహకరించును. అట్టి అభినయాదుల నభివ్యక్తము చేయుటకు శ్రవ్యకావ్యకవి యెంతో పాటుపడవలయును. వాక్యమును సాగదీయుట, తుంపులు తుంపులుగా చేయుట, మృదు పరుషాక్షరబంధ విన్యాసము, సమాస ఘటనము - ఇత్యాదికమును ప్రయత్నపూర్వకముగా తత్తత్సన్నివేశోచితముగా కూర్పవలయును. అప్పుడే వర్ణ్యవస్త్వాదికము హృదయగోచరమగును."

డా॥ శలాక రఘునాథశర్మ, 'కల్పవృక్షము - కవిప్రతిభ' (వ్యాసం) పు. 28 మేఖల - 1; విశ్వనాథ స్మారక సాహిత్య సంచిక, కాశయుక్తి.

9. ఈ తపస్సు గురించి సోవియట్ విమర్శకుడు A. zis అన్నమాట లిక్కడ ఉటంకించ దగ్గవి.

...a writer always looks for the "Perfect" word and an actor for the "Perfect" gesture or intonation. Mayakovsky used a most vivid image to express this situation:

> "You dig for the sake of a single word,
> through thousands of tons of Verbal ore"
> —Foundations of Marxist Aesthetics, Page - 142.

# పద్యశిల్పం

విరచించే శక్తివున్న మాలాకారుడు విరిసరాల కూర్పులో వింత సొగసులు తెచ్చినట్టు, ప్రతిభాశాలి అయిన కవికూడా పదాల పోహళింపుతో పద్యపు సొగసును జిగేలు మనిపిస్తాడు. అవే వృత్తాలు, అవే పదాలు - అయినా కవిసృష్టి నిత్యనూత్నమే. ఈమర్మం పద్య నిర్మాణానికి సంబంధించిన విషయం. ఇదే పద్యశిల్పంగా విశ్వనాథ గుర్తించింది కూడా. "పద్యమెత్తుగడ బాగుండుట, దింపుగడ బాగుండుట, ప్రాసయతి స్థానములయందు కొన్ని రమ్యములైన శబ్దముల ప్రయోగించి పద్యమంతయు బాగుగానున్న దనిపించుట, పద్యము ధారాశుద్ధి కలిగి యుండుట"[1] ఇవన్నీ పద్య సౌందర్య లక్షణాలుగా విశ్వనాథ గుర్తించటంలో పద్యాన్నతడు ఎంత శాస్త్రీయంగా భావించాడో అవగత మవుతూంది.

పద్యంలో గణాల చేత చూపే సౌందర్యం ఛందశ్శిల్పం. సమాస పౌరుష్య సారళ్యాల చేత, సంయుక్తాక్షరాల చేత, ఒకటే రకపు ఎత్తుగడ పునరావృతం చేయడం చేత పద్యశిల్పం సాధించబడుతుంది. ఇవి నియమాలు కావు. కవి ప్రతిభకొద్దీ ఈ నిపుణకర్మ రకరకాల పోకడలు పోతుంది. ఈ వ్యాసంలో బాలకాండలోని పద్యశిల్పం పరామర్శింపబడుతుంది.

ఋశ్యశృంగుడు రోమపాదుని రాజ్యానికి వస్తున్నపుడొక పద్యముంది.

ఆ రథమేగు త్రోవ జలదావళి మింట వినీలకాంతి మా
లారుచిరాతపత్ర పరిలంబినియై రథనేమి నిస్వన
స్ఫోరకహేతువై యుఱుముచున్ వెనుకన్ దెసలన్ ప్రవాతధా
రారమణీయ వాఃకణ ధురాపరితర్పితదేశమై చనెన్. (ఇష్టి-197)

ఈ పద్యంలో ప్రాసస్థానంలో రథ శబ్దాన్ని ప్రయోగించి దాని ప్రాబల్యాన్ని సూచిస్తున్నాడు కవి. పద్యమంతటా వినిపించే రేఫ, ఉఱుముల మోతను ధ్వని

---

1. చూ. నన్నయ గారి ప్రసన్నకథాకలితార్థయుక్తి. పు.23-24.

స్తూంది. 'ఉఱుముచున్ వెనుకన్ దసలన్' అని మూడు ముక్కలుగా విరిగిన వాక్యం వక్తవ్యాంశంలోని వర్షావేగాన్ని సూచిస్తూ, తరుముకొస్తూన్నట్టుంది. చివరి పాదంలో చిక్కగా అల్లుకున్న సమాసం తెరిపిలేని వానకు సూచకంగా వుంది. ప్రారంభంలో నిర్దేశ సర్వనామమైన 'ఆ' చేత రథప్రాశస్త్యం ప్రత్యే కించి సూచించినట్టయింది. పద్యశిల్పంతో పాటు చక్కని నేపథ్యచిత్రణ వున్న పద్యమిది.

కల్పవృక్షంలో పద్యాలు పునరావృత్తి కావటం చాలాచోట్ల జరిగింది. ప్రయోజన దృష్ట్యా వీటిని ఇలా విభజించవచ్చు.

1) కాలగమనాన్ని సూచించేవి.
2) వేగాన్ని సూచించేవి.
3) పట్టుదలను ప్రకటించేవి.
4) తెగిపోయిన కథాసూత్రానికి అతుకువేసేవి.
5) పాత్ర మనస్తత్వాన్ని సూచించేవి.

## 1. కాలగమన సూచకం :

శ్రీరామాది సోదర చతుష్టయం జన్మించాక, దశరథునికి ప్రొద్దు తెలియ లేదు. వారి సాన్నిధ్యంలో అతనికి లోకమే పట్టలేదు. వారి ఎదుగుదలను సూచిస్తూ వసంతకాల వర్ణన చేశాడు కవి.

తిరిగి వసంతకాల మరుదెంచె గరుత్కనకచ్ఛవిప్రభన్
గరుడి వియత్పథంబున సుఖంబుగ ఱెక్కలు సాచిపోయెమ్మై
హారువులు పాంచజన్యములు హంసలు ముక్కులుమీటె నందక
స్ఫురదురుకాంతి పుంజములు పుట్టె దిశాభిహతాతపంబులన్.

(అవతార. 309.)

ఇక్కడ హంస పాంచజన్యకాంతితో వుండనటం వట్టి పోలిక కాదు. నారాయ ణావతారాన్ని పాఠకుని స్ఫురణలో నిలిపేమాట. గరుడి, నందకము ఇవన్నీ ఆ ప్రయోజనాన్ని ఆశించి వేసిన మాటలే. ఈ వసంత వర్ణన మాటిమాటికీ చేశాడు కవి.

"తిరిగి వసంతకాల మరుదెంచె విరాజిత రాజహంసముల్
గరువపు ఠీవిపోయె నడకన్-" (అవతార. 342)

"తిరిగి వసంతకాల మరుదెంచెను మాధవుడున్ ప్రభుత్వమై
ఖరిని-" (అవతార. 353)

"తిరిగి వసంత కాలమరుదెంచె వినూత్న శిఖిప్రభాశిఖా
హరణము వోలె నొప్పెఁ జివురాకుల తుట్టతుదల్-" (అవతార-380)

ఇత్యాది పద్యాల్లో కాలగమనం సూచించబడింది. ఒక్కొక్క ఏడాదీ శ్రీరామ సాన్నిధ్యంలో వసంతరమణీయంగా గడిచిందని చెప్పటానికి కవి ఎంచుకున్న మార్గమిది. మొదటి పద్యంలోని హంసలు చిరుకూనల్లా ముక్కులు మీటే దశలో వున్నాయి. తర్వాతి పద్యంలో 'గరువపు ఠీవి', రాజిత రాజత్వం సంతరించుకున్నాయి. ఇక్కడి హంస ఎదిగే రామాదులకు సూచకం. ఈ విధంగా ఎదిగిన రామాదులు పన్రెండేళ్ళవారయ్యారు పదమూడవ యేడు ప్రవేశించగానే విశ్వామిత్రుడు రాబోతున్నాడు అతడిరాక వీరి జీవితానికొక మలుపు. కవి ఈ పన్రెండవ యేడు గడవటాన్ని మూడు పద్యాల్లో చెప్పాడు. ఇక్కడినుంచి కథ అనేక మలుపులు తిరుగుతుంది ఆ దృష్టితో ఇది పఠితకుఉత్కంఠ కలిగించే విషయం. కవికూడా ఆ ఉత్కంఠను పోషిస్తూ రచించాడు.

"పదిరెండేడులు వచ్చినన్ రఘుసుతుల్ -"
"పదిరెండేడులు సాగినన్ రఘుసుతుల్ -"
"పదిరెండేడులు నిండినన్ రఘుసుతుల్ -"
(అవతార 412, 13, 14)

'వచ్చినన్', 'సాగినన్', 'నిండినన్'-ఇవి పరిణామ సూచక శబ్దాలు. ఈ రెండు పద్య విధానాలు కాల సూచన చేయటంకోసం కవి తీర్చిన మార్గాలు.

## 2. వేగసూచన :

విశ్వామిత్రుడు యజ్ఞరక్షార్థం రామలక్ష్మణులను తోడు తీసుకెళుతున్నాడు. అతడికి రాజసభలోనే ఆలస్యమయింది. రామునికి బలాతిబల విద్యలనుపదేశించా

లని కౌశికుడొక ముహూర్తం నిర్ణయించుకున్నాడు. అది దాటిపోతూంది. అది గడవకపూర్వమే రామునికి ధారపోయాలి. అందుకని నదీ తీరానికి గబగబా నడుస్తున్నాడు.

వెనుకకు తిరుగడు తఱుముచు
జనును ద్వారాయాన విభృతి జనుచో భూభృ
త్తనయలు త్రిశీర్ష భుజగగ
మన వల్గన సుందర సుషమా మధుమూర్తుల్

"వెనుకకు తిరుగడు తఱుముచు
జనుముని - "

"వెనుకకు తిరుగడు తఱుముచు
జనియెడు మునిరాజు - "

"వెనుకకు తిరుగక చనచన
జనుదెంచెను సరయువంత - "

(అహల్య 77, 78, 79, 80).

పద్యగతిలో వున్న ద్రుతత్వం కౌశికుడి ఆగని వేగాన్ని పాఠకుడి మనస్సుకను సంధిస్తూంది. ఇది చలన చిత్రాలలో కనిపించే ధోరణి. ఉదాహరణకు, వేగంగా పోయే ఒక మోటారుకారును చూపాల్సి వచ్చినపుడు దర్శకుడనుసరించే విధాన మొకటుంది. గిరగిర తిరిగే చక్రాల్ని చూపటం, వెంటనే లోపల వున్న వ్యక్తి ఆంగికాభినయాల్ని చూపటం, మళ్ళీ కారు చక్రభ్రమణాన్ని చూపటం - ఇదీ ఆ పద్ధతి. అక్కడ ఎలాగైతే తిరిగే చక్రం పదేపదే చూపబడి ప్రేక్షకుణ్ణి ఆ వేగంలోకి లీనం చేస్తూందో, కవికూడా ఇక్కడ అలాగే పదే పదే వేగ గమన ప్రసక్తి తెచ్చి పఠితకు కౌశిక గమనాన్ని కనుల కట్టుతున్నాడు.

**3. పట్టుదల సూచించేవి :**

క్షీరసాగర మథనవేళ అమృతం సిద్ధించేదాకా అవిశ్రాంతంగా పోరాడిన దైత్యాదిత్యుల ప్రయత్న తీవ్రత ఇక్కడి విషయం. వారి ప్రయత్నాన్ని పద్యంలోనూ, తత్ఫలితాన్ని వచనంలోనూ చెప్పట మిక్కడి శిల్పవిధానం.

"చిలుకుచు నుండగా నుదధి క్షీరము చిందిన బిందు ౦ద్భూతం
బులును విచిత్రరూపములు పొందెను-" (అహల్యా. 448)

వెంటనే వచనంలో ధన్వంతరి పుట్టుక గురించి చెప్పబడింది. మళ్ళీ అదే ఎత్తుగడతో పద్యం.

"చిలుకుచునుండగా నుదధిక్షీరము చిందులు లోకమోహనం
బులు రమణీయ రూపములు పొందెను-" (అహల్యా. 450)

మళ్ళీ వచనంలో అప్సరల జనన విషయం చెప్పబడింది. వెంటనే పద్యం.

"చిలుకుచునుండగా నుదధిక్షీరము నుర్వులుదేరి యెట్టినో
వెలుగులు చిమ్మ-" (అహల్యా. 452)

అప్పుడమృత మావిర్భవించింది. కలిగిన ఫలితాలెంత సమ్మోహకరమైనవైనా అమృతం కోసం వారు అపూర్వమైన ప్రయత్నం చేసి సాధించారు. ఫలితాలుగా కనిపించిన ధన్వంతరి, అప్సరలు సురాసురులకు కాబట్టలేదు. ఏకాగ్రమైన వారి ప్రయత్నాన్ని ఈ పద్యవిధానంలోని ఒకటే ఎత్తుగడ నిరూపిస్తూంది. గంగావతరణ కథలో సాగరులు నేలను త్రవ్వినపుడు కూడా ఈ పద్యశిల్పమే పాటించబడింది.

**4. కథాసూత్రానికి అతుకు వేసేవి :**

ఇది నన్నయ శిల్పం. 'ఇది ముని కన్యయేని' 'ఇది మునినాథ కన్య యని' అనే రెండు పద్యాలకు విశ్వనాథ చేసిన వ్యాఖ్య ఇక్కడ అన్వయించ బడుతుంది. సాఫీగా నడుస్తున్న కథ ఒకచోట హఠాత్తుగా విరిగిపోతుంది. అక్కడ అవాంతరంగా వచ్చిన ఆ విషయం పూర్తికాగానే, కవి సరిగ్గా ఎక్కడ కథాభాగం విరిగిపోయిందో అక్కడ అదే ఎత్తుగడతో పద్యం రచించి అతుకు వేస్తాడు.

మిథిలానగర స్వయంవరంలో రాముడు విజేత. శివధనుర్భంగం జరిగాక, దశరథాదులకు ఆహ్వానాలు పంపబడ్డాయి. వారంతా వచ్చారు. అందరూ వచ్చాక యుధాజిత్తు వచ్చాడు. అపుడు ప్రక్కన వున్న వశిష్ఠుని గురించి

దశరథుడు చెప్పబోయాడు. అంతలో వాకిట ధనురుగ్రరావం వినిపించింది. ఆ చెప్పదలచినదేదో అక్కడే ఆగిపోయింది.

సానంద పరిణయ సాధు సామ్ముఖ్య సంభాషణముగ
బూని వశిష్ఠుం గూర్చి భూపతి ముగ్ధుడై పలుక
గా నెంచులోన ముంగిటను ఘనమేఘ గర్జయు గాగ
ధానుష్క ధనురుగ్రరావ ధార్ష్ట్యంబు దర్పంబు తోచె (ధను. 388)

పరశురామ ప్రవేశంతో సభ స్తంభించింది. ఆ మహోగ్ర రూపాన్ని చూసి ఎక్కడి మాటలక్కడే ఆగిపోయాయి. అతడు విష్ణు ధనుర్ధారిగా నిలచిన రాముNIకి నమస్కరించి నిష్క్రమించాక గాని సభ కుదుట పడలేదు. అపుడు మళ్ళీ సభలో చలనం వచ్చింది. అందరూ ఒక్కసారిగా ఊపిరి పీల్చుకోగలిగారు. కథలో ఈ పరశురాముని రాక అవాంతరం. ఇది గడిచాక కథ మళ్ళీ ఆరంభమవుతూంది. దీనిని మరో విధంగా చెబితే తెగిపోయిన కథాసూత్రం ముడిపడుతూంది. కవి ఇక్కడ పద్య రచనలో ఆ శిల్పం చూపాడు. మళ్ళీ అదే ప్రారంభంతో విరిగిన కథకు ముడివేశాడు.

ప్రాణంబులందున సర్వభారంబు బాసి తేలికగ
తూనీగవలెనైన మేనితో ప్రేమతో గాంచి జనకు
సానందపరిణయ సాధు సామ్ముఖ్య సంభాషణముగ
బూని వశిష్ఠుం గూర్చి భూపతి ముగ్ధుడై పలికె (కళ్యాణ. 2)

ప్రారంభపద్యం 'సానంద పరిణయ' అని ఆరంభమయింది. మలిపద్యంలో అదే పాదం ప్రసక్తమై సభ మళ్ళీ పూర్వ స్థితిలోకి చేరుకుంది అని వ్యంజింపబడుతూంది.

కళ్యాణ ఖండంలో ఇదే శిల్పం మళ్ళీ ప్రదర్శింపబడింది. వివాహితులైన రాఘవులు అయోధ్యాముఖంగా ప్రయాణం సాగించారు.

'మగిడి జనకాదుల రథా
శ్వగజ వృషభరాజ చక్రశఫ చరణ జవా

తిగమన విధూత ధూళి
స్థగిత వియద్వీధి కానతంబుగ నడచెన్ (కళ్యాణ. 112)

ఇలా నడుస్తున్న రథాలను అహల్యాశ్రమం వద్దకు పంపుమని రాముడు కోరాడు. రథాలు ఆశ్రమం మీదుగా మళ్ళించబడ్డాయి. అక్కడ అహల్య ఇచ్చిన ఆతిథ్యాన్ని స్వీకరించి, తిరిగి వారందరూ అయోధ్యాముఖంగా ప్రయాణం సాగించారు. అప్పుడు ఇదే పద్యం వ్రాయబడింది - కించిద్భేదంతో.

మగడ నడక యంది రథా
శ్వగజ వృషభరాజ చక్ర శఫ చరణ జవా
తి గమన విధూత ధూళి
స్థగిత వియద్వీధికానతంబుగ నడచెన్ (కళ్యాణ. 132)

అయోధ్యాగమన మన్నది ప్రధాన విషయం. అహల్యా దర్శనం అవాంతర విషయం. కనుక ప్రధానకథ ఒకసారి విరిగి మరీ అతుకుపడుతూంది. దానిని పద్యంలో ఇక్కడ ప్రదర్శించాడు, కవి.

**5. పాత్ర మన స్తత్వసూచన చేసేవి :-**

కల్పవృక్షంలోని పరశురాముడొక విలక్షణ వ్యక్తి. అతడింతలో ఆనందిస్తాడు. అంతలోనే ఆవేశపడిపోతాడు. అది అతడి మన స్తత్వం.

క్రుద్ధుడై ప్రవేశించిన పరశురాముడు, మిథిలా సభలో రాముడిని సమీపించి 'శివధనుర్భంగంతోనే నువ్వు వీరుడివనుకోకు. దీన్ని ధరించు. చూద్దాం' అని వైష్ణవ ధనుసు నిచ్చాడు. అక్కడి పద్యాలు వరుసగా ఒక శార్దూలం, ఒక కందం, ఆ పైన ఒక వచనం వున్నాయి.

ప్రాజీరంబలె విచ్చిపోయెను ధనూరాజంబు మంజూషలో
గోజాడం బనిలేదు వేఱధనువున్ ఘోరంబు నే దెచ్చితిన్
నే జెల్లా యిది యెక్కువెట్టి శరమున్ నింపన్వలెన్ నించినన్
నేజూతున్ భవదీయ శౌర్యవిభవానేక క్రియావైఖరుల్

అప్పుడు వీర్యశ్లాఘ్యున
కొప్పగ నే ద్వంద్వయుద్ధ మొసఁగెద నీకన్
దెప్పరము ధనువు గుణమును
గొప్పన సంధించి యమ్ముఁగూర్చి విడువుమీ

వ. అనినంత దీన వదనుండై దశరథుండు ప్రాంజలించి
పరశురాముంగాంచి యిట్లనియె (ధను. 423,24, 25)

ఇదంతా పరశురాముడు సృష్టించిన భయానక వాతావరణం. అతడి క్రోధం ముందు ఎవరి అర్థింపూ పనిచేయలేదు శ్రీరామునితో మాట్లాడటంలో అతడు క్రమంగా మెత్తబడిపోయాడు కోపాన్ని మరచి కోరికోరి తానే తన కథను చెప్పుకున్నాడు. ఈ కథలో తాను క్షత్రియ సంహారం చేసిన ఉదంతాన్ని వివరిస్తూ మళ్ళీ కోపపడిపోయాడు. శ్రీరాముడు క్షత్రియుడన్న స్ఫురణ కలిగి వుండాలి. అపుడన్నాడు.

తాదృక్ఛాంతిపరున్ ; సున్ విదళిత త్ర్యక్షాశుగాసంబుగా
నీ దోర్దండము పిల్చె యుద్ధమునకున్ నీవెంత వీరుండవో?
కాదా యీ ధనువెత్తి యొత్తి శరలక్ష్యంబేయుమే జూచెదన్
దోదుమ్మిన్ విదళింపుగా శివధనుర్ద్రోహీ! రఘూత్తంసకా!

అప్పుడు వీర్యశ్లాఘ్యున
కొప్పగ నే ద్వంద్వయుద్ధ మొసగెద నీకున్
దెప్పరము ధనువు గుణమును
గొప్పన సంధించి యమ్ముఁ గూర్చి విడువుమీ!

వ. అనినంత శ్రీరామచంద్రుం డిట్లనియె."
(కళ్యాణ. 472,73,74)

పరశురాముడు ఆవేశంతో మాట్లాడినపుడు ఏ మూసలో పద్యాలున్నాయో ఇప్పుడు రెండవమారు కోపం తెచ్చుకున్నప్పుడూ అదే రీతిలో వున్నాయి. పరశురాముడి మనస్సు కుదుటపడబోయి తిరిగి మొదటికి వచ్చింది. ఇది అతడి మనసు రాముడి సాన్నిధ్యంలో ఎంత డోలాయమాన స్థితినందుకుందో తెల్పుతూంది.

కథలోని ప్రధాన ఘట్టాలవద్ద ఒకే రకపు వాక్యవైఖరి చూపటం విశ్వనాథ చేసిన మరో ప్రయోగం. గంగావతరణ కథలో ఇది స్పష్టమవుతుంది. గంగకథ ప్రధానంగా నాలుగంచెలమీద సాగింది.

1. హయసంపాదనకై వెళ్లిన సాగరులు కపిలుని చూసి అతడిని హర్తగా అనుమానించి కోపించటం.
2. కపిల క్రోధాగ్నికి భస్మమైన సాగరుల బూడికుప్పల చూసి అంశుమంతుడు శోకించటం (తరువాత సాగిన తపస్సుకిది బీజం.)
3. భువికి దిగిన గంగావాహినిలో తప్తులై, శప్తులైనవారు విముక్తి పొందటం (ఇది గంగ మహిమను సూచించేది)
4. పాతాళం చేరిన గంగాస్రవంతి బూదికుప్పల తాకి సాగరులుత్తమలోకాలు పొందడం.

ఇవి నాలుగు ప్రధానఘట్టాలు. వీటిలోని ప్రథమ ఘట్టం చేత కథలో మలుపు ఏర్పడింది. వారి అనుమానం అలా లేకపోయి వుండింటే, కథ మరోలా వుండి వుండేది. కనుక, ఆ చేష్టకు కథలో ప్రాముఖ్యముంది. కవి దీనిని సూచిస్తూ, ఈ సాగరుల కోపాన్ని ఏ వాక్యవైఖరిలో రచించాడో అదే వైఖరిని తర్వాతి ఘట్టాల్లోనూ రచించాడు. వరుసగా ఆ పద్యాలివి.

1. "పెనుబయలై క్రుధానయన భీకరులై సగరాత్మజుల్" (అహల్యా. 341)
2. "అలిపిరులై మరుద్విధుతమై చిఱుబూది పొరల్ వెలార్చుదిబ్బలు-" (అహల్యా. 350)
3. "నాక నివాసులై శపితులై ధరజాటినవారు..." (అహల్యా. 394)
4. "అఱువదివేల రాజసుతులద్భుతదేహులు తైజసంబులై మెఱసెడి మేనులం." (అహల్యా. 407)

ఈ నాలుగు పద్యప్రారంభాల్లోనూ ఐత్వాంతమైన సమాసాలుండటం గమనించదగ్గది. సాగరుల కోపమే తర్వాతి కథకు హేతువు కనుక, వారి దుడుకుదనం ఏ పద్ధతిలో సూచించబడిందో తక్కిన మూడు ఘట్టాల్లో అదే పద్ధతి పాటించబడింది. ప్రధాన ఘట్టాల్లో సమాన నిర్మితిగల పద్యాల్ని మంటప స్తంభాల్లాగా నిల్పటం కథకు అందం.

# ఛందశ్శిల్పం

కవి తన మనోగత భావానికి తొడిగే పరివేషం పేరు ఛందస్సు. జ్ఞాత శిల్పి అయిన కవి ఏ రసప్రకటన కే ఛందోగతి నెంచుకోవాలో తెలిసి కావ్య సౌందర్యానికి నగిషీలు పట్టి ధగద్ధగాయమానంగా ప్రకాశింప చేస్తాడు. శాసించ గల ప్రభువుకు సేవకుగిలాగా సమర్థుడైన కవికి అయోగ్యవృత్తాలు కూడా పరమ ప్రయోగ్యాలవుతాయి ఇది కవిశక్తి. ఇలా కవిలోని మహాశిల్పి లక్షణాన్ని ప్రాచీనులు గుర్తించారు. ఛందోపరంగా కవికున్న ఈ జ్ఞాతృత్వమే అతడిని నిపుణవంతుని చేస్తుంది.

మహాకవుల రచనా విధానం భిన్న భిన్న ధోరణులలో వుంటుంది. అనంత ముఖాలుగా సాగే రచనా విధానంలో వృత్త ప్రయోగదక్షత కూడా ఒకటి. కల్ప వృక్షంలో విశ్వనాథ విశేష వృత్తాలెన్నింటినో ప్రయోగించాడు. సందర్భంలో వుండే విశేషాన్ని పురస్కరించుకుని కవి వృత్తాల్ని ఎంచుకుంటాడు. "వృత్తము వాడినచోటనెల్ల నర్థమో భావమో విలక్షణముగా నుండవలయును. కథ మాఱుట, కథలో నొక ఘట్టము ప్రత్యేకత మొదలయిన ప్రయోజనము లపేక్షించియే (కవి) వృత్తమును మార్చును" అని విశ్వనాథ దృష్టి.

విశేష వృత్తాల ప్రయోగంలో రెండురకాల మార్గాలు అనుసరింపబడ్డాయి. ఒకటి వృత్త నామాన్ననుసరించి ఆయా సందర్భాలలో ప్రయోగించటం. ఉదా హరణకు వెన్నెల వర్ణనకై 'చంద్రిక', గజవర్ణనకై 'గజవిలసితం', తెల్లవారటం గురించి చెప్పటానికై 'ప్రభాతం' ఇత్యాద వృత్తాలు ఈ వర్గానికి చెందినవి. ప్రభాత వృత్తవిషయంలో వున్న విశేషమంతా వృత్తనామమే. లోకంలోని అనేక సంఘటనలలో తెల్లవారటమూ ఒకటి. దానికి ప్రత్యేకత లేదు. కానీ, ఒక అవ తారమూర్తి ఏ రోజు జన్మిస్తాడో ఆ రోజు తెల్లవారటం ఒక విశేష సంఘటన. శ్రీరామ జననమైనరోజు తెల్లవారటం లోకానికొక పర్వదినం. ఈ విశేషాన్ని పురస్కరించుకుని కవి ఇక్కడ విశేష వృత్త ప్రయోగం చేస్తాడు. వృత్త నామం చేత విశేషాంశం సూచింపబడుతుంది. ఇదొక పద్ధతి.

ఇక రెండవ పద్ధతిలో వృత్తనామం కాక, వృత్తగతి ననుసరించి ప్రయోగించటం వుంటుంది. భిన్న మనోభావాల గురించి చెప్పటానికి భిన్నగతులు గల ఛందస్సు అవసరమవుతుంది. గేయగతిలో నడచే 'తస్వి' వృత్తంలో జోలపాట, రెండు సమాన భాగాలేకీకృతమైన 'క్షమాహార' వృత్తంలో రాముని సమన్వయమందిన మనస్సు, ఇత్యాది విషయ వివరణను ఆయా గతుల కనుకూలమైన ఛందో భేదాల్ని ఎంచుకున్నాడు కవి.

మరో దృష్టితో చూస్తే, పాఠకుడి భ్రమాకల్పనకు విశేషఛందస్సొక సాధనం. అభావాన్ని ప్రచ్ఛన్నం చేయటానికి కవి ఒక్కొక్కసారి విశేష వృత్త ప్రయోగం చేస్తాడు. దీనిలో వున్న అప్రసిద్ధ గమనంచేత సామాన్యాంశం కూడా విశేషంగా స్ఫురిస్తుంది. నిజానికి విశేషం వృత్తంలో వుంది తప్ప, విషయంలో లేదు. అందులోని గమనభిన్నత చేత విషయం కూడా కొత్తదనాన్ని సంతరించుకుంటుంది. విశ్వనాథ ఈ విషయాన్ని గుర్తించాడు. లక్కఇంటిలో పాండవులు మరణించారని జనులనే మాటల్ని నన్నయ మధ్యాక్కరలో వ్రాసిన విషయాన్ని విశ్వనాథ విమర్శిస్తూ అన్నాడు: "ఇచట మధ్యాక్కరనువాడుట వృత్తౌచిత్యము. ఈ ఔచిత్యము భిన్నవృత్త మగుటచేత మాత్రమే సంపాదింపబడినది. పాండవులు చనిపోలేదు. చనిపోయిరని యందరు ననుకొనుటకు వీలయిన స్థితి. ఇది యొక విలక్షణమైన పరిస్థితి. దానికి విభిన్నమైన వృత్తము." దీనిని బట్టిభిన్న వృత్త ప్రయోగం చేత కూడా వృత్తౌచిత్యం పోషింపబడవచ్చునన్న దృష్టి విశ్వనాథకున్నట్లు స్పష్టమవుతూంది. ఈ దృష్టితోనే ఆయన ఛందశ్శిల్ప ప్రవర్తకుడయ్యాడు.

ఛందస్సు దానంతట అదే ఒక శిల్పం. అది సృష్టించే భిన్నగతుల చేత ఛందోమార్గమే రమణీయంగా వుంటుంది. ఆధునిక చిత్రకళలో వర్ణం (colour) చేత చిత్రకారుడు ప్రభావం (effect) చూపుతాడు. ఇందులో వస్తువు ఏమిటన్న ప్రశ్న వుండదు. రంగులే అతనికి వస్తువులు. వర్ణ సంగీతం (Colour Symphony) పాడే చిత్రాలన్నీ ఈ కోవలోనివే.[1] ఛందస్సు కూడా ఇలాంటిది. అందులోని శబ్దగతి పాఠకుడిలో ఒక విలక్షణమైన అనుభవాన్ని కలిగిస్తుంది. లయగ్రాహి, కవిరాజ విరాజితం లాంటి వృత్తాలు కేవలం వాటి గతిచేత కూడా పఠితకొక అనుభవాన్ని కలిగించగలిగినవి. ఎలాగైతే వర్ణమే చిత్రానికి

వస్తువో అలాగే శబ్దమూ కవిత్వానికి వస్తువయింది. అర్థంకంటె శబ్దమే ముందుగా నిల్చి అక్కడి విషయాన్ని విశదం చేసిన సందర్భాలున్నాయి. ధనుర్భంగ ఘట్టంలో 'నిష్ఠా వర్షదమోఘ' లాంటి పద్యాలు శబ్దప్రాధాన్యత వున్నవి. శబ్దమొక సంగీతస్వరం. వాటి కూర్పుచేత కవి సంగీతాలాపన చేస్తాడు. ప్రస్తుత విషయ నిరూపణకు క్రింది పద్యోదాహరణ మప్రస్తుతం కాదు.

జయగోవింద! ముకుంద! చక్రధర! కంసద్వేషి! సాత్రాజితీ
ప్రియ! నారాయణ! కౌస్తుభాభరణ! కుంభిత్రాణపారీణ! కా
ళియ దర్పఘ్న! పతంగవాహ! వనమాలీ! కృష్ణ! వైకుంఠ! శౌ
రి! యశోదాత్మజ! భక్తవత్సల మురారీ! గోపికావల్లభా![2]

ఈ మేల్కొల్పు పద్యంలో కవి ఎంచుకున్న వస్తువేమిటి? పద్యం మొత్తం సంబోధనలే. నాదాత్మకమైన శబ్దాలతో కూడిన ఈ సంబోధనలు సంగీతాన్నాలాపిస్తున్నాయి. అర్థదృష్ట్యా పద్యంలో భక్తి వుంది. కానీ, శబ్దదృష్టితో చూస్తే కలిగే సౌందర్యం ఈ పద్యంలో అర్థదృష్టితో కనిపించదు. అంటే అర్థంకంటె శబ్దమే ప్రాధాన్యం వహిస్తూంది. శబ్దం ఏ అనుభవాన్ని ప్రసాదిస్తూందో అదే పద్యార్థం. కవిత్వంలో శబ్దం నిర్వహించే పాత్ర అర్థానికి మాధ్యమికంగా వుండటమే కాదు. దానంతట అది ఒక అనుభవాన్ని ప్రసాదించగలదుకూడా. పై పద్యం దీనికొక ప్రమాణం.

ప్రబంధాల్లో, కావ్యాల్లో కవులు అయిదారురకాల వృత్తాల కంటే ఎక్కువగా ప్రయోగించలేదు కనుక, వారి రచనా విన్యాసాలన్నింటినీ వాటిలోనే నిబంధించారు. కల్పవృక్షంవద్దకు వచ్చేసరికి అది మహేతిహాసం కనుక, విస్తృతమైన నేపథ్యం (Canvas) పై మానవ స్పందనలను చిత్రించాల్సి వచ్చింది కనుక, విశేష వృత్తాల నెన్నింటినో ప్రయోగించవలసి వచ్చింది. వీటి శిల్పాను శీలనంచేత కథాగతికి అవి ఎలా తోడ్పడ్డాయోకూడా తెలుస్తుంది. దాదాపు ఏడు పందల యేళ్ళ తరువాత[3] ఇంత విస్తృత సంఖ్యలో విశేషవృత్తాలు ప్రయుక్తమయ్యాయి.

విశ్వనాథ ప్రయోగించిన విశేష వృత్తాల్లో మధ్యాక్కరకొక ప్రత్యేక స్థానముంది. ఈ వృత్తాన్ని సహస్రాధిక ముఖాలుగా ఆయన భాసింపచేశాడు.

ఈ వృత్తలక్షణం తెలుగు వాక్య ధోరణికి సన్నిహితంగా వుంటూ, తెలుగువాడి మాటలకు చక్కగా ఒదుగుతుంది. ఈ వృత్తగమనంలో వున్న నిర్వేగ లక్షణం చేత ఇవి ఆలోచింపచేస్తాయి. కథాకథనానికీ, సంభాషణకూ ఒదిగినట్లు ఈ వృత్తం వర్ణనలకు ఒదగదు. కనుకనే, కథాదృష్టిగల విశ్వనాథ వీటిని కావ్యస్థం చేశాడు. (ఈ వృత్తం గురించిన చర్చ అనుబంధం - I లో చేయబడింది).

## పాద సూచికలు:

1. Michael Larionov వేసిన Cock of the Roost, Kazimir Malevich వేసిన Black square on a white ground, ఇతడే వేసిన Suprematist Composition అన్న చిత్రాల్లో వర్ణమే వస్తువుగా వుండటం గమనించవచ్చు.

చూ. 13,16,17 చిత్రాలు. పు. 205.
Aesthetics by Yuri Borev

2. పారిజాతాపహరణం; నంది తిమ్మన : 2-56 ప.

3. తిక్కన కాలం 12వ శతాబ్ది విశ్వనాథ కాలం 20వ శతాబ్ది. ఎంత లేదన్నా ఇద్దరికీ మధ్య 7 శతాబ్దులు గడిచాయి. తిక్కన స్త్రీ పర్వంలో విశేష చ్ఛందస్సుల ప్రయోగం తర్వాత, మళ్ళీ అంతవిస్తృతంగా, అంతకంటె ఎక్కువ వృత్తాలను కావ్యప్రయోగంలోకి తెచ్చాడు విశ్వనాథ.

విశేషచ్ఛందాలు:

# మహాక్కర*

ఇది దేశ్యఛందం. పంచవిధాక్కరలలో పెద్దది. 'మహా' శబ్దం అక్కరలలో దీని పరిమాణ వైశాల్యాన్ని సూచించే మాట. కవిజనాశ్రయకర్త దీనిని 'పెద్ద అక్కర' అన్నాడు.

అక్కర అంటే అక్షరమని అర్థం. పంచవిధాక్కరలలో ఎక్కువ అక్షరాలుగల ఛందమిదే కనుక 'పెద్ద అక్కర' అని సంకేతించబడి, తర్వాతి కాలాలలో అదే శాశ్వతనామంగా నిలచిపోయి వుండవచ్చు. అక్షరప్రమాణాన్ని బట్టి అక్కరల నామనిర్దేశం చేసి వుండవచ్చు. దీనికి సాక్ష్యంగా 'అల్పాక్కర' అన్న ఛందంలో అతి తక్కువ అక్షరాలుండటం స్మరించాలి.

వాక్యవిన్యాస వైఖరినిబట్టి ఇది వర్ణనాత్మక విషయాల కంటె సంభాషణాత్మక విషయాలకు ఉచితంగా వుంటుంది. బాలకాండలో వున్న రెండు మహాక్కరలూ సంభాషణకే ప్రయుక్తమయి వుండటంచేత కవికి కూడా ఇదే అభిప్రాయమున్నట్లు భావించ వీలున్నది.

మాధరాపతి సుత ధరాసుత మీరు మన్నింతు
　　రేని మీకుఁ గోడళ్ళు
భూదరేంద్రులు బాహుశాలులు మీకుఁ బుత్రికా
　　రత్నమ్ము నిచ్చెదము
సాధుమూర్తులను గ్రహింపుఁడు రససాధులు
　　పానకాల కావళ్ళు
సీధువుల్ గాని యనుమతించిన మీకు సీ
　　తమ్మ నర్పించి పుచ్చెదము　　　　(ధను. 358)

---

* పాదానికి 1 సూర్యగణం + 5 ఇంద్రగణాలు + 1 చంద్రగణం చొప్పున నాలుగుపాదాలుంటాయి. ప్రతిపాదంలో 4వ గణాద్యక్షరంయతి.

ఓసి ఓసి యయోధ్యరామయ్య తానొక్క విల్విరిచి
చందిరపు బొమ్మ
కోసము తెమ్ముఁ గొని తెచ్చినాడంట! కోడళ్లొకే
సారి సల్పురుసు
రాసులై పున్నెములు గుంపులై మూఁగిరాజుగారి
వరించెనఁటవె కొమ్మ
యోసి రావె రావే యంచు మూగినారూరి
ముత్తైదువ లెల్లరును (కళ్యాణ. 137)

దశరథాదులు మిథిలానగరపు పొలిమేరల్లోకి రాగానే అక్కడికి ముందుగా వచ్చిన గౌతమాదులు వీరికి స్వాగతం పలికారు. ఆ పలుకులివి. ద్యావా పృథ్వీ స్వరూపులైన శ్రీరాముడికీ, సీతకూ వివాహమనేది మహావిషయం. వారి వివాహ మొక వేడుక. దాని గురించి మాట్లాడే ప్రత్యక్షరమూ విలువయిందే. ఈ మహాక్ష రాలే ఇక్కడ మహాక్కరలు అయ్యాయి. తొలి పద్యంలో 'ధరా' శబ్దంలో ఒక చమత్కారముంది. ధరాసుత అంటే సీత. ఇక్కడ జనకుడు ధరకు పతి-రాజు. అంటే ధర ఈయన సతి. ఈ పతీసతుల పరమ పవిత్ర సంతానమీ సీత. ఇది శబ్ద చమత్కారం. సీత నాగలికొఱ్ఱుకు తగిలి లభించిన సంతానమే అయినా, ఆమెను తన తనుజగా జనకు డాదరించాడని ధ్వని.

వివాహితులైన సీతారాములు అయోధ్యకు తిరిగి వెళ్ళగా, అక్కడి ప్రజలు పట్టరాని ఆనందాన్ని బట్టబయలు చేశారు. ఆ స్పందన రెండవ పద్యం. 'ఓసిఓసి' అన్నది సంబోధన. సంభాషణల కనుకూలమైన ఛందంలో జనుల కోలాహలం రచింపబడింది. ప్రారంభంలో ఒక సూర్యగణం మాత్రమే లక్షణ రీత్యా నిర్దేశింపబడినా, రచనరీత్యా 'ఓసిఓసి' అని రెండు సూర్యగణాలున్నాయి. సీతాసమేతుడైన శ్రీరాముని వలన సూర్యవంశం ద్విగుణిత యశస్సంపాదక మవుతుందన్న చమత్కారం ఇక్కడ కలుగుతుంది.

రెండు పద్యాల్లోనూ, 1, 3 పాదాలకు; 2, 4 పాదాలకు అంత్యానుప్రాస పాటించబడింది. ('కోడళ్ళు' కావళ్ళు; ఇచ్చెదము, పుచ్చెదము ఇత్యాది) ఈ విషయం లాక్షణికులు నిర్దేశించలేదు. ఈ అంత్యప్రాసల వలన పద్యం రగడ స్వరూపానికి చేరువయింది. పైగా పఠనంలో ఒక సొగసు వస్తూంది.

అంత్యాను ప్రాస పాటించాల్సిన రగడల్లో పాటించక పోవడమూ, ఆ నియమంలేని మహాక్కరలలో పాటించడమూ కవి నిరంకుశత్వాన్ని ప్రకటించే విషయాలు.

# భుజంగ విజృంభితం*

ఈ వృత్తంలో పాదానికి 26 అక్షరాలుండగా, అందులో 12 గురువు లున్నాయి. ప్రారంభంలోనే వరుసగా ఎనిమిది గురువులు (మ-మ-త)న్నాయి. దీనివలన పద్యగమనం భారంగా వుంటూంది. పీటి తర్వాత వెంటనే వరుసగా పది లఘువులుండి, గమనంలో ఒక వేగం సిద్ధించి, పద్యం పరుగులిడుతుంది. చివరలో గురులఘువుల కలయికచేత ఒక సమగతి ప్రాప్తించింది. మొదట గుర్వాధిక్యతచేత ఆరోహణం, తర్వాత లఘువుల విస్తృతిచేత అవరోహణం ఉంది. ఈ ఎగుడు దిగుళ్ళుగా పరచుకున్న పద్యగమనం చంచలించే మనస్థితికి చక్కని వ్యంజకంగా వుంది.

బాలకాండలో ఈ వృత్తం రెండుసార్లు ప్రయుక్తమయింది. మేధాశ్వంతో రేయిగడిపిన మరునాడు కౌసల్యాది సతులకు యజ్ఞకర్మ లొనర్చుట మీ పద్యంలో చెప్పబడింది. రెండవది, రావణునిగురించి కౌశికుడన్న మాట.

పౌలస్త్య ప్రోద్భూతుండా రావణుఁడు
　　　దితిజ కులపతి బ్రహ్మదత్త వరంబులన్
త్రైలోక్యంబున్ బాధించున్ భూత వితతి
　　　బెగడుకొనఁగ దైత్య సైన్య భయంకరుం
డాలోచింపన్ వాఁడే యజ్ఞాయతన నిరత
　　　కుపితుఁడు నాకరాజ విరోధి వా
డాలంబంబై యజ్ఞ ధ్వంసం బనుమతి సలి
　　　పెదరు దురాగ్రహోనత దర్పులై　　　(అహల్యా. 56)

---

* ఇది ఉత్కృతి చ్ఛందస్సులో పుట్టిన వృత్తం. పాదానికి 26 అక్షరాలు. గణాలు: మ-మ-త-న-న-న-ర-స-లగ. యతి స్థానాలు: 9వ, 19వ అక్షరాలు. ప్రాస నియమముండి.

రావణునిగురించి దశరథునితో కౌశికుడన్న మాటలివి. తాను వచ్చింది రక్షకోసం. యజ్ఞధ్వంసం చేస్తున్న దితిజకులాన్ని దూరం చేయుమని, దానికి శ్రీరాముని పంపుమని అడగటానికి వచ్చాడు. తన స్థితిలోని కష్టం అవతలివాడికి తెలియాలి. పద్య ప్రారంభంలోనే సంయుక్తాక్షరాల క్లిష్టత వుంది. 'పౌలస్త్య ప్రోద్భూత' అన్న సమాసంలోని గాఢబంధం ఓజో ప్రదాయకమవుతూంది. రావణుడెంత భయదస్ఫురణ కలిగిస్తున్నాడో వక్త వాగ్వైఖరిలో బయల్పడుతూంది. గురు బాహుళ్యమున్న వృత్తంలో, క్లిష్ట సమాసాలద్వారా ఆ వైఖరి స్ఫురింపచేయబడుతూంది.

# పంచచామరం*

ఈ వృత్తంలో పాదానికి 8 లఘువులు, 8 గురువులు కావటంచేత, సమాన సంఖ్యాకమైన వీటి కలయిక చేత పద్యగతిలో ద్రుతమూ, విలంబితమూ సమన్వయింపబడిన మధ్యగతి ఏర్పడింది.

బాలకాండలో ఈ వృత్తాలు అయిదుచోట్ల ప్రయుక్తమయ్యాయి.

1. అశ్వమేధ ప్రారంభ దినాన యాజకుల హోమం (ఇష్టి-323)
2. యజ్ఞవేళ యాజకుల అగ్నిస్తవం (ఇష్టి-414)
3. శాంత, ఋష్యశృంగులు తిరిగిపోయేవేళ రాజు, రాణుల దుఃఖాన్ని సుమిత్ర అనునయించటం. (అవతార. 151)
4. అవతార ఖండాంత పద్యం - కవి శివస్తుతి, (సంస్కృత పద్యం) (అవతార-426)
5. కళ్యాణ ఖండాంత పద్యం - కవి శివస్తుతి (సంస్కృత పద్యం) (కళ్యాణ. 502)

ఇక్కడున్న విశేషమేమంటే, ప్రయోగించిన అయిదు పద్యాల్లో మూడు సంస్కృతమే కావటం.

శిరస్సురావళీ సరిచ్చుచి స్థితి ప్రశీతలా
ధురా ధర ద్వయద్ధరి ద్విధు స్థిరా రసాతలా!
యురు ప్రశాంతి మూలకంద! యోగి హృత్పరాయణా!
విరావ సర్వలోకతుంద! శ్వేత పర్వతాయణా!

(అవతార. 426)

---

* ఇది అష్టిచ్ఛందం నుంచి పుట్టిన వృత్తం. పాదానికి 16 అక్షరాలు; గణాలు - జ-ర-జ-ర-జ-గ. యతిస్థానం : 10వ అక్షరం. ప్రాస నియమముంది.

ఇది అవతార ఖండాంత పద్యం. జగణ పుష్టిచేత పద్యం కదం తొక్కుతూంది. ఉద్వేత్తుగా ఎగసిన ఆ భక్త్యావేశం పాదాంత్యానుప్రాసచేత ఒక లాలిత్యాన్ని పొందింది. తృతీయ, చతుర్థ పాదాల్లో పాదానికి విరామం కలిగించి, ప్రతి విరుపుకూ తర్వాతి పాదంలో అంత్యానుప్రాస పాటించాడు కవి. ఇది శ్రుతిమాధుర్య హేతువై, స్తోత్ర లక్షణాన్ని పుణికి పుచ్చుకుంది.

> అపార సత్కృపా పయోధి! యాత్మవస్తు సారథీ!
> యుపాసనా సమస్త సత్ఫలోప జీవనాకృతీ!
> తపద్విపచ్చటాశిరోధి తప్తలోక సేవధీ!
> కృపా ప్రణీత భక్తపాప కీలికా నిరాకృతీ! (కళ్యాణ. 302)

ఇదికూడా పరమేశ్వర స్తుతే. 'అపార', 'పయోధి' వంటి జగణాల చేత ఆ ఈశ్వర కారుణ్య హేతువుగా కవి పొందిన ఆవేశం పద్యంలో ప్రతిఫలిస్తూంది. 'ఆత్మ వస్తు సారథి' అన్నమాట ఉపనిషన్మూలకం పద్యంలోని అనుప్రాసలు స్తోత్ర లక్షణాన్ని కలిగిస్తున్నాయి.

మొదటి పద్యంలో (అవతార. 426) నిర్మాణరీత్యా ప్రథమ ద్వితీయ పాదాలు, తృతీయ చతుర్థ పాదాలు ఒకటిగా వున్నాయి. మొత్తం పాదం ఏక సమాసంగా సాగి, అంత్యానుప్రాసలతో కూడి ఉండటం రెండు పాదాల్లోనూ జరిగింది. తృతీయ చతుర్థ పాదాల్లో ఒక్కొక్క పాదం రెండు సమాసాలతో రెండు సంబోధనలుగా వున్నాయి. తృతీయ పాదంలోని రెండు సంబోధనలకు చతుర్థ పాదంలో సరిగా అనుప్రాసలు వేయబడ్డాయి. రెండవదిగా ఉదాహృతమైన పద్యం కూడా (కళ్యాణ. 302) ఇదే తీరులో వున్నా, పాదాల స్థానంలో కించిత్ భేదముంది.

అవతార ఖండాంత పద్యం ఇలావుంది :

> ................ప్రశీతలా!
> ................రసాతలా!
> ...కంద!...హృత్పరాయణా!
> ...తుంద!...పర్వతాయణా!

కళ్యాణ ఖండాంత పద్యం ఇలావుంది :

......పయోధి!......సారథీ!
.................ఆకృతీ!
......శిరోధి !......సేవధీ !
.................ఆకృతీ!

పై రెండు పద్యాల్లోనూ నిర్మాణం ఒక్కటే. పాదాల స్థాన విషయంలో మొదటి పద్యంలో 3, 4 పాదాల నిర్మాణమే తర్వాతి పద్యంలో 1, 3 పాద స్థానాల్లో వుంది.

పంచచామరమనే నామాన్ని పురస్కరించుకుని బాలకాండలో ఈ వృత్తంలో ఐదు పద్యాలు మాత్రమే రచించటం చమత్కారం.

# శిఖరిణి*

'ఉపపన్న పరిచ్ఛేద కాలే శిఖరిణీ మతా'[1] అని క్షేమేంద్రుడు పేర్కొన్నాడు. ఉపసంహారంలో ఈ వృత్తిప్రయోగ ముచితమని తాత్పర్యం. దీనిని ప్రయోగించిన మహాకవి తిక్కన కూడా రచించిన ఒక్క శిఖరిణి వృత్తాన్ని[2] ఆశ్వాసోప సంహారంలో నిబద్ధంచేసి, క్షేమేంద్రుని అభిప్రాయాన్ననుసరించాడు. ఈ మార్గానుగామి అయిన విశ్వనాథ దీనిని కాండాంతంలో ఖండాంత పద్యంగా రచించి ఔచిత్యం పాటించాడు. 'శిఖరిణ్యా సమారోహాత్ సహజై వోజసః స్థితిః'[3] అన్న వాక్యాన్ననుసరించి, ఆరోహణగతిగల శిఖరిణికి ఓజోగుణం సహజమని గుర్తించాలి. పరమేశ్వరునిపట్ల గల ప్రేమావేశంతో భక్త్యావేశంతో చేసే స్తుతిలో ఓజస్సు వుండటం అసహజం కాదు.

> ధృతాంభః పూతాకృత్యమర తటినీ తీర సుగృహీ!
> నిరాంత వ్యావల్గన్నిజ భజన కృన్నిత్యవిరహీ!
> కృతాంత ప్రౌఢాజ్ఞా నిరసన కళాకేళి జటిలా!
> శ్రుతి ప్రామాణ్యాత్త ప్రకటతర తేజోఽచ్ఛపటలా!

(కళ్యాణ. 303)

చిక్కని పాలమీగడలాంటి శ్లిష్ట బంధంలో సమాస రచన చేసి విశ్వనాథ పద్యానికి బరువూ, సొగసూ తెచ్చాడు. ప్రాదాంతాల్లో ప్రతి రెండు పాదాలకు అనుప్రాస పాటించి, పద్యంలో లలితగతి సృష్టించాడు. పద్య స్వరూపంలో గాంభీర్యమున్నా, స్వభావంలో మధురభక్తి వుందని సూచించినట్టు అంత్యానుప్రాసలు పాటించబడ్డాయి. తిక్కన ప్రయోగించిన ఒకే ఒక్క శిఖరిణి[4] ఆశ్వాసాంత పద్యం కావటమూ, అది కూడా కృతిపతి స్తుతి కావటమూ, అందులో

---

* ఇది అత్యష్టి ఛ్ఛందస్సు నుంచి పుట్టిన వృత్తం. పాదానికి 17 అక్షరాలు. గణాలు : య-మ-న-స-భ-వ-; యతిస్థానం : 13వ అక్షరం. ప్రాస నియమముంది.

కూడా ప్రతి రెండు పాదాలకు అనుప్రాస పాటించబడి వుండటమూ గమనిస్తే, తిక్కన మార్గాన్ని విశ్వనాథ ఎంతగా కళ్ళకద్దుకున్నదీ తెలుస్తుంది. తానూ ఆయన మార్గాన్నే అనుసరించి ఖండాంతంలో విశ్వేశ్వర స్తుతి చేశాడు.

భరతుడు మొదలైన సంస్కృత లాక్షణికులు దీనికి 7 వ అక్షరాన్ని యతిస్థానంగా నిర్దేశించారు. తెలుగు లాక్షణికులు మాత్రం 13 వ అక్షరాన్ని యతిస్థానం చేశారు. విశ్వనాథ ఈ రెంటినీ స్వీకరించి, ప్రథమ, ద్వితీయ పాదాల్లో మాత్రం రెండు చోట్లా యతి పాటించాడు. అంటే స్రగ్ధరావృత్తంలో లాగా పాదానికి రెండు యతులు. దీనిచేత ఒక మాధుర్యం సిద్ధిస్తుంది.

# లయగ్రాహి*

సంస్కృత లాక్షణికులైన హేమచంద్రుడు వృత్త లలితమనీ, జయకీర్తి వృత్తలలితం లేక లలితవృత్తమనీ పేర్కొన్నారు. పంచమాత్రాకంగా సాగే ఈ వృత్తంలో ఒక గుర్వక్షరం తరువాత మూడు లఘ్వక్షరాలు చొప్పున వుండి, అవరోహణగతిని సూచిస్తున్నాయి. లఘ్వక్షరాలు ద్రుతగతి సూచకాలుగా వున్నాయి. ద్రుతావరోహణం ఈ విధంగా కలిగి, మధురగతి ఏర్పడుతూంది.

ఇచ్చట వశిష్ఠులును హెచ్చిన ముదంబలరఁ
        బచ్చని నవాంకురము గ్రొచ్చిన శరావా
ళ్యచ్చతర ధూపములు ప్రుచ్చిలిన లాజ విల
        సచ్చయము కాంతిఁ గనవచ్చినవి పాత్రల్
పుచ్చికొని చేర్చికొని మచ్చిక సమస్తమును
        నెచ్చట నెదుండవలె నచ్చట నదుండన్
బుచ్చి రఘుబాలకులు వచ్చినను బీఠముల
        ముచ్చట నిషణ్ణులుగ హెచ్చరికతోడన్ (కళ్యాణ. 75)

శ్రీరామ కళ్యాణోత్సవాలకై వశిష్ఠుడు పొందిన ఆతృత, ఆనందం ఈ పద్యంలో ప్రకటించబడింది.

బాలకాండలో లయగ్రాహి ప్రయుక్తమైన సందర్భ మిదొక్కటే. ద్రుత గతి వలన పద్యంలో వర్ణితాంశమైన పాత్ర చేష్టవెనుక వున్న ఆతృత స్పష్ట మవుతూంది. రాముడంటే రాజ్యానికంతా మమతే. కులగురువు వశిష్ఠుడికి మరీ ఇష్టం. అలాంటి రాముడి కళ్యాణ మహోత్సవాలను తన అధ్వర్యంలో నిర్వ హించటంలో అలవికాని ఆనందముంది వశిష్ఠునికి. 'ఎచ్చట నెదుండవలె నచ్చట నదుండన్ బుచ్చు'టలో ఆతడు పెళ్ళి పందిట్లో ఎంత హడావిడితో వున్నాడో పద్యంలోని అనుప్రాస సూచిస్తూంది.

---

* ఇది ఉద్ధురమాలావృత్తం. పాదానికి 30 అక్షరాలు.
గణాలు : భ-జ-స-న-భ-జ స-న-భ-య.
యతిస్థానాలు : 9-17-25 అక్షరాలతో ప్రాసయతి. ప్రాస నియమముంది.

# విచికిలితం*

ఈ వృత్తగతి 'ఉత్సాహ' వృత్తగతితో ఏ మాత్రం భేదించదు. లక్షణరీత్యా రెంటికీ భేదం లేదు, కానీ, 'ఉత్సాహ'కు అక్షరచ్ఛందో నియమం లేదు. అది గణ ఛందస్సు [5] గణ ఛందస్సులో ద్రుతవిలంబిత గతులు కవి రచననుసరించి వుంటాయి. ఉత్సాహ, సుగంధి, హంసయాన అన్నవి విచికిలిత వృత్తగతితో సంవదిస్తాయి.

'ఉత్సాహ'లో — 7 సూర్యగణాలు + 1 గురువు
'సుగంధి' — 7 గలములు + 1 గురువు
'హంసయాన' — ర-జ-ర-జ-ర
(ర-జ-ర-జ-ర అందే ఏడు గలములు + 1 గురువే)

ఈ మూడు వృత్తాలూ విచికిలిత భేదాలే. ఈ భేదం కేవలం అక్షర వర్గీకరణ వలన వచ్చిందే తప్ప అక్షర క్రమంలో కాదు [6] విచికిలిత వృత్తగతి అతిద్రుతం కనుక, వీరరసాభివ్యక్తికిది పరమోచితంగా వుంటుంది.

పొదివి పొదివి నృపుల తలలు పుణికి పుణికి నఱికి స
మ్మదము ముదము నెదఁ దఁగదుర మలఁగి మలఁగి సురనసన్
గుదురు కలుగ జలము వదలి కొనకుఁ గినుక తొలఁగితిన్
వదలి ధనువు జగమఖిలము వదలి యెచటొ యరిగితిన్

(ధనుస్సు. 471)

---

* ఇది ఆకృతిచ్ఛందోజనితమైన వృత్తం. పాదానికి 22 అక్షరాలు. గణాలు: న-న-న-స-న-న-న-గ (ఏడు నగణాలపై ఒక గురువు). యతి స్థానం: 8వ అక్షరం: ప్రాస నియమముంది.

పరశురాముడి క్షత్రియ సంహార ఘట్టమిది. జనక సభలో తానే పలికిన పలుకులివి. నగణాలు ప్రస్ఫుటంగా విడివిడిగా కనిపిస్తున్నాయి. ఇది శిథిలబంధం. విశ్లథమై పోయిన రాజవంశాల్ని ఈ శిథిలబంధం వ్యంజిస్తూంది. ప్రథమ పాదాంత 'స'కారం ద్వితీయ పాదాద్యక్షరమైన ద్విత్వ 'మ'కారంపై ఊనిక తీసుకుంటూంది. 'సమ్ మదము' అని పలుకబడుతూంది. క్షత్రియ సంహారకాలం నాటి వీరావేశమంతా మళ్ళీ పొంగులెత్తిన భార్గవరాముడి ఉచ్చారణ అది. ఆ ఆవేశం దవడలు బిగించి మాట్లాడినట్లు అనిపించే 'సమ్-మద' అనటంలో కని పిస్తూంది. మూడవ పాదంలో తాను సంహార కార్యానికి జలం వదిలానని తెలి పాడు. ముందు రెండు పాదాల్లోని ఆరోహణగతి ఇక్కడ అవరోహణ దశకు వచ్చింది. 'పొదివి పొదివి', 'పుణికి పుణికి', '(స)మ్మదము ముదము' 'మలగి మలగి' - ఇలాగ ద్విరుక్త పదాలు క్రోధసూచకాలుగా వుండి ప్రథమ ద్వితీయ చతుర్థ పాదాల్లో జలము వదలి, వదలి ధనువు, జగమఖిలము వదలి - అని పదేపదే వదలి అనే మాట వచ్చి పాద విరామాన్ని ప్రకటించి, క్రమంగా అవరోహణ స్థితికి వచ్చిన ఆవేశాన్ని ధ్వనిస్తూంది.

ఈ వృత్తాన్ని న-న-న-న-న-న-న-గ అని చెప్పటం కంటె నల-న-నల -న-నల-నగ అని చెపితే, లయను సూచించేదిగా వుండటమే కాక, గణలక్ష ణాన్ని ఉచ్చరించటంలో ఒక సౌలభ్యమేర్పడుతుంది.

పాదానికి 21 లఘువులుండి తర్వాత ఒక గురువు వున్న ఈ వృత్తం, 21 సార్లు క్షత్రియలోక సంహారంచేసి విరమించిన పరశురామతత్త్వానికి ప్రతీకగా వుంది.

లఘ్వక్షర ప్రాయమైన వృత్తరచనద్వారా అద్భుతరసాన్ని వ్యంజింప జేయవచ్చునని భరతుడన్నాడు.[7] ఒక్కడైన పరశురాముని చేతిలో రాజవంశాలు కూల్చబడటం అద్భుతావహమైన శౌర్యవిషయం. ఆ భావవ్యంజనకు ప్రస్తుత వృత్తముచితంగా వుంది.

# కమలన గీతి*

గతిరీత్యా ఈ గీతి ఉత్సాహవృత్తాన్ని పోలివుంది. ఉత్సాహవృత్తంలో ఏడు సూర్యగణాలమీద ఒక గురువు వుంటుంది. ఇక్కడ చివర గురువులేదు.

ధనువుఁబూను రామచంద్రు దర్శనంబు చేయఁ
జనిరి సర్వదేవతలును జలజసంభవుండు
ధనువుఁ బూని రాఘవుండు దాని గొనము చేత
నినిచి జ్యానినాదమునను వించె సర్వధాత్రి

(ధను. 483)

కళ్యాణ ఘట్టంలో ప్రళయ భీకరంగా ప్రవేశించిన పరశురామమూర్తి వైష్ణవ ధనువును ధరించుమని రామునితో సవాలు చేశాడు. ఆ సందర్భంలోని పద్యం ఇది ఇందులో మొత్తం 20 హ గణాలు, 29 నగణాలున్నాయి. నగణ సంఖ్య ఎక్కువయినప్పటికీ ద్రుతగతి కనిపించదు. ఇది తొందరపాటులేని దేవతల మనఃస్థితిని సూచిస్తూంది. ఈ వైష్ణవ ధనుస్స్వీకార యోగ్యతపైనే శ్రీరాముడి జీవితం ఆధారపడినంతటి క్లిష్ట ఘట్టమది. రాముడి శక్తి గురించి ఏ శంకాలేని దేవతలు తత్తరపడాల్సిన అవసరంలేదు. పద్యంలో లఘు సంఖ్య ఎక్కువ వున్నా ద్రుతగతిని భాసింపచేయకపోవటం వెనుక ఈ ప్రయోజనముంది. ఇది దేవతల ధైర్య సూచకంగా వుంది.

---

* అప్పకవి చెప్పిన నవగీతుల్లో ఇది ఎనిమిదవది. దీనిలో నగణాలు కానీ, హగణాలు కానీ, లేక రెండూ కలసి కానీ పాదానికి ఏడు సూర్యగణాలుండాలి. 5 వ గణాద్యక్షరం యతిస్థానం. ప్రాస నియమముంది.

# చతుష్పద*

ఇది మధురగతి రగడను పోలిన గతిలో నడుస్తుంది. చతుర్మాత్రా గణాలు నాలిగింటితో నడచే మధురగతిలోనూ పాదానికి 16 మాత్రలే వుంటాయి.

వాద్యముల్ పెండ్లివారు మున్ వెనుక
సద్యోమహాలసత్వమగు నడక
చోద్యమౌ ననగ జూడగా సర్వ
హృద్యమై తోఁచె నెద ముదము బర్వ (కళ్యాణ.64.)

సీతారామ కళ్యాణార్థం పెళ్ళివారు వాద్యాలతో బయలుదేరారు. ప్రాస స్థానంలోని సంయుక్తాక్షరమైన 'ద్య'కారం పద్యంలోని విలంబితగతికి శ్రీకారం చుట్టుతూంది. లఘువుల ద్రుతగతికి ఏ మాత్రం అవకాశం ఇవ్వకుండా మధ్యన గుర్వక్షరాలు జొరబడి పెళ్ళివారి 'అలసత్వమగు నడక'ను నిరూపిస్తున్నాయి.

---

* దీనికి పాదానికి 16 మితలఘువు (మాత్ర) లన్నాడు అప్పకవి. పాదంలోని 9వ మాత్ర యతి స్థానం. ప్రాస నియమముంది.

# ప్రమాణి*

ఈ వృత్తగతి ఎగుడు దిగుడులుగా వుంటుంది. ఒక లఘువు తర్వాత ఒక గురువు అనే క్రమం వృత్తమంతటా కనిపిస్తుంది. లఘువును పలకటంలో వున్న స్వరస్థాయి అనుదాత్తం. గురువును పలకాల్సి వచ్చినపుడు ఉదాత్త స్వర స్థాయి ఏర్పడుతుంది. నిమ్నోన్నత స్వరమార్గాలతో కూడిన ఈ గతి ఉద్రిక్త మనస్తత్వాన్నీ, నిలకడ లేన్కువైన మాటల ధోరణినీ వ్యంజిస్తుంది.

శ్వమాంస భోక్తలై చనన్
సమల్ సహస్రముల్ చనుం
డమంద దర్పులై వృథా
భ్రమన్ మనుష్య పాళిలో (ధను. 171)

ఇది విశ్వామిత్రుడి కోపం. శాపం. శునశ్శేఫుని రక్షించటం కోసం యజ్ఞపశువు కావటానికి నిరాకరించిన పుత్రులను విశ్వామిత్రుడు శపించినప్పటి పద్యమిది. 'ధర్మంబు చెప్పిన మీ కింతయుఁ బట్టదే?' అని అతడు 'కోప విహ్వలిత నేత్రాంతు' డయ్యాడు. కౌశికుడి ఆ కోప విహ్వలత ఈ పద్య మంతటా ప్రకంపిస్తుంది. పద్యపాదాదిలోనే జగణముండి ఆ ఎగసిపడే కోపాన్ని తెలుపుతూంది. ఈ చంచలించే స్వరాన్ని చిత్రిస్తే ఇలా వుంటుంది :




ఇదీ 'కోపవిహ్వలిత' మంటే, చివరకు ఉచ్చస్వరమే మిగిలింది. 'ప్రమాణం చేసి చెబుతున్నాను, మీగతి ఇంతే' నన్నట్లుగా ప్రమాణి వృత్తంలో రచించటమొక చమత్కారం.

---

* ఇది అనుష్టుప్ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 8 అక్షరాలు; యతి నియతి లేదు. గణాలు : జ-ర-వ. ప్రాస నియమముంది.

# మధురగతి రగడ*

ఇది చతురస్రగతి రగడ. శ్రవణ పేయమైన గతి కలది కాబట్టి 'మధుర గతి' అని పేరు వచ్చింది. ఈ మాధుర్యం సమగతి వలన వచ్చింది. మనస్సుకు ఆనంద హేతువులైన విషయాలను చెప్పటానికి రగడ ఉచితంగా వుంటుంది.

అచ్చట రథములు నాఁగిన నాలుగు
వచ్చిన కచ్చులపల్లకు లందునఁ
గ్రచ్చఱఁ గొడుకులఁ గన్యల నల్వుర
హెచ్చిన మదమున నెక్కఁగఁ జేయుచు (కళ్యాణ 134)

కళ్యాణానంతరం పుత్రులతో కోడళ్ళతో కలిసి దశరథుడు తిరిగి అయోధ్యకు వచ్చాడు. అక్కడ పొలిమేరలో రథం దిగి అక్కడినుంచి పల్యంకికలలో క్రొత్త పెళ్ళికూతుళ్ళనీ, క్రొత్త పెళ్ళికొడుకుల్నీ పంపాడు, దశరథుడు. పరమా నందంలో ఈ పనులన్నీ నిర్వహించాడతను. అప్పటి అతని చిత్త స్పందనకు ప్రతీక ఈ మధురగతి.

ఈ రగడలో అంత్యప్రాస పాటింపబడలేదు.

---

* అప్పకవి దీనిని నవవిధ రగడలలో ఒకటిగా పేర్కొన్నాడు (4-300. అప్పక.) ప్రతి మధురగతి రగడకూ నాలుగు పాదాలుంటాయి. ప్రతి పాదానికి 4 చతుర్మాత్రాగణాలుంటాయి. రెండవ గణాద్యక్షరం యతి స్థానం. ప్రాస, అంత్యప్రాసలు రెండూ పాటించాలి.

# తరలం*

'మత్తకోకిల' పాద ప్రథమాక్షరమైన గురువును లఘువుగా మార్చితే అది తరల వృత్తమవుతుంది. లక్షణరీత్యా మత్తకోకిలకూ, తరలానికీ కించిత్తు భేదమున్నా, లయ విషయంలో రెంటిగతి ఒకటిగానే వుంటుంది. రెండూ మిశ్ర గతిలోనే నడుస్తాయి. 19 అక్షరాలున్న పాదంలో 12 లఘువులున్న దీని గతి ద్రుతమని తలపించినా, గుర్వక్షరాల కూడికచేత ఆ ద్రుతగతి మధుర గతిగా పర్యవసిస్తుంది.

> చెఱువు గట్టున రత్నకంబళిఁ జెన్నుగాఁ బఱపించి యే
> డ్తెఱను గౌతముఁడుం డె బండ్లను దించి పెద్దలు సేరఁగాఁ
> గఱదలాడుచు గౌతముండును గంధమిచ్చి సపర్యగాఁ
> దుఱఁగలించిన కన్నుదోయిని దోయిలించి మహానృపుల్
>
> (ధనుస్సు 358)

ప్రతి పాదాంతంలోనూ దీర్ఘమూ, పాదాదిలో లఘువూ వుండటం ఈ వృత్త లక్షణం. దీనివలన పాదాంతంలోని దీర్ఘాన్ని పలికి వెంటనే తర్వాతి పాదాదిలోని హ్రస్వాన్ని అందుకోవటం పఠితకు కష్టమై, విరామం తీసుకోవలసి వస్తుంది. అంతదాకా గురు లఘువుల హెచ్చు తగ్గులలో నడచిన పద్యం వొడుదుడుకులలో పడి సాగిన రథగమనాన్ని సూచిస్తుండగా, చివరగా దీర్ఘాక్షరం పలకబడి, విరామాన్ని సూచిస్తుంది. చివరి అక్షరం లఘువు కానీ, సంయుక్తాక్షర పూర్వకమైన గురువుకానీ అయితే పఠితకు పలకటంలో శ్రమ అధికం. అలా కాకుండా చివరి అక్షరం దీర్ఘంగా సాగితే, స్వరానికి శ్రమలేకుండా వుండటమే కాక, విశ్రాంతిదాయకమవుతుంది కూడా. ఈ విధంగా పద్య నిర్మాణంలో విశ్రాంతిని సూచించి, ప్రయాణపు బడలికలో అలసి విశ్రమించే దశరథాదులకు చేసిన ఏర్పాట్లను వర్ణించటం ఉచితంగా వుంది.

కవిత్రయం తరలవృత్తాన్ని వివిధరసాల కనుకూలంగా ప్రయోగించారు.[8] విరామ సూచకంగా ప్రయోగించి విశ్వనాథ దీనికి శాంతరసానుకూలత కూడా చేకూర్చినాడు.

---

* ఇది అతిధృతిచ్ఛందో జనితమైన వృత్తం. పాదానికి 19 అక్షరాలు. గణాలు : న-భ-ర-స-జ-జ-గ, యతిస్థానం: 12 వ అక్షరం. ప్రాస నియతి వుంది.

# ద్విపద*

రెండు పాదాలు కలది కనుక, ద్విపద. లక్షణదృష్ట్యా ఇది తరువోజ అనే ఛందస్సులో సగభాగం. ద్విపద పాదాన్ని రెట్టిస్తే 'తరువోజ'లో ఒక పాద మవుతుంది. ఈ రెంటినిగురించి విచారిస్తే, ద్విపద మొదట ఏర్పడి, తరువాత తరువోజ ఏర్పడివుంటుందనిపిస్తుంది. పాటిబండవారు తమ 'ఛందశ్శిల్పం'లో గుర్తించిన విషయం ఒకటుంది. అల్పాక్షర పాదాలను కూర్చి అధికాక్షర పాదాలుగా మార్చే పద్ధతి సంస్కృతంలో వున్నట్లే తెలుగులోనూ వుంది. 'ప్రమాణి' వృత్తపాదాన్ని రెట్టిస్తే పంచ చామర వృత్తంలో ఒక పాదమవుతుందని వారుదాహరించారు. ఇలాంటివి దేశిఛందస్సులోనూ వున్నాయి. 'ద్విరదగతి' రెట్టించబడితే 'విజయభద్ర రగడ' ఏర్పడటం విదితవిషయమే. ఈ దృష్టితో, అల్పాక్షరాలుగల ద్విపద ముందుగా ఏర్పడి, తరువాత 'తరువోజ' ఏర్పడివుంటుంది.

మరోవిషయమేమంటే, మనకున్న స్త్రీల పాటల్లో అనేకచోట్ల ద్విపద ఛందమే కనిపిస్తుంది. జానపద గాయకులు సృష్టించుకున్న మూసగా ఈ ఛందస్సును భావిస్తే, ఆదే నిదానంగా ప్రజాసాహిత్యంగా కావ్యప్రవేశం చేసి, 'తరువోజ' సృష్టికి హేతువు అయివుండవచ్చు ననిపిస్తుంది. క్రింద పేర్కొన్న పాటలో ద్విపద లక్షణాల్ని అతిస్పష్టంగా గుర్తించవచ్చు :

ఆణిముత్యాలచే అమర పతకాము
ఆ సీత వేసెను దాసుని మెడను!

(శ్రీరాములవారి అలుక.)

---

* ప్రతిపాదానికి 3 ఇంద్రగణాలు + ఒక సూర్యగణం చొప్పున రెండుపాదాలు కలసి ఒక ద్విపద. పాదంలో నాల్గవగణాద్యక్షరం యతిస్థానంగా వుంటుంది. రెండుపాదాలకు కలిపి ఒక ప్రాసపాటించబడుతుంది.

ఇది పాట. దీనిలోని దీర్ఘాక్షరాలను కొన్నిటిని దిద్దితే ఇలా వుంటుంది.

> ఆణిముత్యాలదే అమరపతకము
> ఆ సీత వేసెను రాముని మెడను

ఇందులో యతిప్రాసల విషయంలో నియతి లేకపోయినా, లక్షణరీత్యా ఇది ద్విపద. కనుక, పాటగా వున్న ద్విపద తొలుతగా ఏర్పడి వుంటుంది. దీని పాదాలు విడి విడిగా వున్నందువల్ల అఖండైక రూపంలో ఛందస్సు సాగదు. కావ్యప్రపంచంలో తక్కువగా ఆదరింపబడటానికి ఈ ఛందస్సు కిదొక కారణం. (పాల్కురికి సోమన, శ్రీనాథుడు లాంటి కవుల రచనల్లో ఈ ఛందస్సు విశేషంగా మెరిసి పోయినా, ఇతర మహాకవులు దీనికి దూరంగా వుండటం గమనించాలి.)

రెండు పాదాల కొకటిగా వుండటం చేత ద్విపదలో నీతి సూత్రాలు చెప్పటానికి కానీ, సంక్షిప్త విషయాల్ని చెప్పటానికి కానీ వీలుగా వుంటుంది.

> నా తండ్రికిని రంగ నాథుండు రక్ష
> నా తల్లికిని రంగ నాథుండు రక్ష
> మా బాబునకు ధర్మ మహిమలు రక్ష
> మా బుజ్జికిని మౌని మహసులు రక్ష
> దేవి కౌసల్య పాతివ్రత్య రక్ష
> శ్రీ వశిష్ఠుల తపస్స్వధుల్ రక్ష
> దశరథేశుల పూర్వతపసులు రక్ష
> ప్రశమితాఖిల దైత్య భావంబు రక్ష (అవతార. 371-74)

ప్రతి పాదాంతానా రక్షా శబ్దం పునరుక్తం కావటం వలన ఇది ఏ వెన్నెల పదమో, గొబ్బి పదమో లాటి పాటరీతిని సంతరించుకుంది. ఈ ద్విపదకు వక్త కైకేయి, రామధనుర్విద్యకు దిష్టి సోకకుండా ఆమె పలికిన రక్ష ఇది. పదే పదే రక్షా శబ్దం పలకటంలో ఆమెకు రామునిపట్ల ఎంత మమత వుందో తెలుస్తూంది. కైకకు రాముడంటే ప్రాణం. 'నిద్ర మేల్కొన్నదిగ రామభద్రు కౌఁగిటను నంగ లార్చుచుఁ జనుఁ గేకయాత్మజాత' (2-336). అంతటి ప్రేమాస్పదుడు కనుకనే రాముని 'నా తల్లి', 'నా తండ్రి' అనటం. ప్రతి రక్షా శబ్దం దగ్గర 'దృష్టి తీసి పోసెడు', 'వీపున నేలమన్ను సద్ది చమిరెడు' (375) కైక మూర్తి కనులకు కట్టుతూంది.

# నవనందిని*

శక్వరీ ఛందోజనితమైన వృత్తాలు కరుణ రసోచితాలని భరతుడు తెల్పాడు.[10] కానీ, లఘువులే ఎక్కువగా వున్నందువల్ల ఇది ద్రుతగతి కల్గి వీరరస వ్యంజకమవుతూందని చెప్పాలి.

కనుమూసి కన్నెఱుపులోఁ గదు వశిష్ఠుం
డనె భీతిలేదు పదఁడా! యనుచు గాధే
యుని నీవు నీవు కుటిలా! యదరు పాటా?
మునిపల్లె మంటనిడెదో? ములుచ యంచున్ (ధను. 88)

అస్త్ర విద్యాశక్తి సాధించిన విశ్వామిత్రుడు వశిష్ఠాశ్రమాన్ని దగ్ధం చేసినపుడు వశిష్ఠుడు పొందిన ప్రతిస్పందన ఇది. భయాందోళితులైన ముని సమూహానికి ధైర్యం చెప్పి, చరచరా నడచి వెళ్ళి నిలిచాడు. లఘ్వక్షర ప్రాధాన్యమైన ఈ వృత్తగతిలో వేగం వుంది. 'పదడా,' 'కుటిలా,' 'అదరుపాటా,' 'మంటనిడెదో,' 'ములుచ'- ఇలా మాటిమాటికీ విరిగిపోయే పద్యపాదాలు ఉద్రిక్త చిత్తవృత్తిని పట్టిస్తున్నాయి. 'నీవు నీవు' అని రెండుసార్లనటంలో కూడా ఆ క్రోధమే పలుకుతూంది.

---

* ఇది శక్వరీ ఛందోజనితవృత్తం. పాదానికి 14 అక్షరాలు. గణాలు : స-జ-స-న-గగ; 4 వ గణాద్యక్షరం యతిస్థానం. ప్రాస నియమముంది.

# కుసుమ విచిత్రం*

ఈ వృత్తంలో గతిలోని వేగంచేత యుద్ధాది వీరవిషయాల వర్ణనకు ఇది అనుకూలంగా వుంటుంది.

శకయవనాళుల్ సకల ధరిత్రిన్
వికటగతిన్ ద్రెవ్వెన నరపాలుం
డకుటిలబుద్ధిన్ హతులను జేసెన్
శకచముపుల్ భాస్వరశరవహ్నిన్ (ధను. 88)

శబళ దేహం నుండి పుట్టిన సైన్యం కౌశికుడి సేనపై పరాక్రమించిన సన్నివేశ మిది. ఆ సైన్యం ఎంత వేగంగా ముందుకురికిందీ ద్రుతగతి సూచకాలైన నగణాలు సూచిస్తే, శక్తిలో ఎంత గురుత్వం ప్రదర్శించిందీ తర్వాతి రెండు గురువులు సూచిస్తున్నాయి. పద్యం హలంతాక్షరాలచే పదేపదే విరిగి, విశ్లథ మయిపోతున్న విశ్వామిత్ర సైన్యాన్ని వ్యంజిస్తూంది.

కుసుమ సదృశమైన సాధు స్వభావం గల శబళ అతి విచిత్రంగా సైన్యాన్ని ఎదుర్కొంది. ఈ విషయాన్ని వృత్తనామంతో ధ్వనించడం చమత్కారం.

---

* ఇది జగతీ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 12 అక్షరాలు. గణాలు: న-య-న-య. యతిస్థానం: 2 వ గణాద్యక్షరం. ప్రాస నియమముంది.

# రథగమన మనోహరము*

ఈ వృత్తంలోని నాలుగు పాదాలలో రెండవ పాదం మాత్రం ఒక ప్రత్యేక లక్షణంతో వుండి, తక్కిన పాదాల లక్షణంతో భేదిస్తుంది.

అనడుహములు ధేయటం చదల్చినంతన్
గనలి తురంగము వల్గు గాఢ వేగ దీప్తిన్
జని కదచన నశ్వసారథుల్ విలాసా
ననులు రథములాపి నవ్వుచుంద్రు కొంటెల్. (ధను.356)

అయోధ్యవీడి మిథిలా నగరానికి పయనమైన దశరథుని రథగమన వర్ణన ఈ పద్యం. మొదటి పాదంలోని గతి రెండవ పాదంలో లేదు. రథగమనంలో మార్పు వచ్చిందన్న సూచన ఇది. ఆ మార్పేమిటంటే - మొదటి పాదంలో 'ధేయటంచు' అదలించాల్సి వచ్చింది. దానికి ఫలితంగా 'గాఢవేగదీప్తి' కలిగింది. తిరిగి మూడవపాదం వద్దకు వచ్చేసరికి మళ్ళీ ప్రథమ పాదగతే వచ్చింది. 'విలాసా' అన్న దీర్ఘాక్షరాలతోడి పాదాంతం విలంబిత గతి సూచకంగా వుంది. ఇది రథగమనంలో వున్న విలంబిత-ద్రుత-విలంబిత గతుల్ని రెండు రకాల గతులలో నడచే ఛందంలో మనోహరంగా వ్యంజిస్తూంది. కనుక, ఇది రథగమన మనోహరం.

---

* ఇది పరస్థాన విషమవృత్తం (అప్పక. 4 వ ఆ. 22౮.27 ప.)
1, 3, 4, పాదాల గణాలు : స-స-ర-జ-గగ; 9వ అక్షరం యతి.
2వ పాదం గణాలు : న-జ-జ-ర-య, 10 వ అక్షరం యతి. ప్రాస నియమంవుంది.

# తురగవల్గన రగడ*

బాలకాండలో ప్రయుక్తమైన తురగవల్గనములు రెండూ కలిపి ఒకేచోట నాలుగు పాదాలుగా ప్రయోగించబడ్డాయి. సీతారామ కళ్యాణానంతరం నవ దంపతులు అయోధ్యానగరపు పొలిమేర వద్దనుంచి పల్లకీలతో నగర ప్రవేశం చేశారు. ఆ పల్యంకికలు వాద్యబృందంతోనూ, నాట్యాంగనలతోనూ పెళ్ళి సొగసంతా తమనే వరించినట్లు నడిచే పెద్దలతోనూ సాగింది.

వేణునాదములును దివ్యభేరికా నినాదములును
బూని వారకామినీ విముగ్ధ నాట్య చారుగతులు
పెండ్లి నడక సిరియుఁ దమ్మెనే వరించినట్లు నడచు
పెండ్లి పెద్దలుగఁ బురీ ప్రవేశముం బొనర్చినారు.

(కళ్యాణ. 185, 86)

'నినాద', 'విముగ్ధ', 'వరించి', 'ప్రవేశ', 'పొనర్చి', - ఇవి పద్యంలోని జగణాలు. పాదంలోని ఒక జగణం తప్పని సరిగా వుండి, ఆనంద స్పందన ననుభవించే మనసుల్ని సూచిస్తుంది.

ఈ రగడలో అంత్యప్రాస పాటింపబడలేదు.

---

* నవవిధ రగడల్లో ఇదొకటి. పాదానికి ఎనిమిది సూర్య గణాలుంటాయి. 5వ గణాద్యక్షరం యతిస్థానం ప్రాస, అంత్యప్రాస నియమముండు. రెండుపాదాలు కలిపి ఒక తురగవల్గన మవుతుంది.

# వేగవతి*

ఈ వృత్తగతిలో ఒక వైచిత్రి వుంది. మొదటి పాదంలో మూడు సగణాలు, ఒక గురువు వుంటే, రెండో పాదంలో మూడు భగణాలు రెండు గురువులూ వున్నాయి 3,4 పాదాలిట్లే వున్నాయి. సగణం IIU వుంటే, భగణంలో UII వున్నాయి. అద్దంలో కుడి ఎడమలు మారినట్లు ఒకటో పాదంలోని సగణాలు రెండో పాదంలో భగణాలయ్యాయి. పై ఒకటవ పాదంలో ఒకే గురు వుంటే, రెండో పాదంలో రెండున్నాయి. ఒక ధ్వనికి కలిగే ప్రతిధ్వనిలాగ పై గణస్వరూపం క్రింది పాదంలో వెనక్కి తిరుగుతూంటి. నిర్మాణ రీత్యా వైచిత్రి వున్న ఈ వృత్తం మహారవాల ప్రతిధ్వనులను గూర్చి చెప్పటానికి ఉచితంగా వుంటుంది.

మొగినెచ్చటఁ గ్రమ్మకొనున్ జ్యా
వల్లి రవంబులు పొదులు గాఁగన్
నిగుడున్ ముసురై నినదంబుల్
వేల్లిత రుద్రుని వింటిరవంబుల్ (ధను. 378)

ఇది పెళ్ళికి వచ్చిన వారికి వినిపించిన వింటిరవం. శివ ధనుర్భంగం జరిగినపుడు ఆ మహాధ్వని రోదోఽంతరాలలో నిండింది. అది ప్రతిధ్వనిస్తూంది. తరంగాలు తరంగాలుగా ధ్వనించే ఆ ధనూరవాన్ని ప్రతిధ్వని ప్రకటించటానికి ఈ వృత్తగతి అనుకూలంగా వుంది.

---

* ఇది పరస్థానార్థ సమవృత్తం (అప్పక. 4-213). సమపాదాలొక లక్షణం, విషమ పాదాలొక లక్షణంతోనూ వుంటాయి.

1,3 పాదాలు : స-స-స-గ
2,4 పాదాలు : భ-భ-భ-గ-గ
} గణాలతో వుండి సర్వపాదాల్లో యతి స్థానం 7 వ అక్షరంగా వుంటుంది.

1,3 పాదాలకు ఒక ప్రాస వుంటుంది.

2,4 పాదాలకు ఒక ప్రాస వుంటుంది.

# సుముఖి*

వెడలి విచిత్ర విచిత్ర గతుల్
కడవఁ గడంగి కడంగి రథుల్
నడపఁగ దూలిన వాజితతుల్
కడచి చనున్ ముఖ క్షిప్త కశల్ (ధను. 355)

సీతరామ కళ్యాణ నిమిత్తం మిథిలకు దశరథాదులు బయల్దేరారు వారి రథాలు మిథిలానగర సమీపానికి వచ్చాయి. అప్పటి పద్యమిది.

'విచిత్ర విచిత్ర' 'కడంగి కడంగి' అని జగణాల ద్విరుక్తంద్వారా అశ్వగతిలోని ఉత్ప్లుతి వ్యంజించబడుతూంది. మొదటి రెండు పాదాల్లోని వేగం మూడో పాదంలో లేదు. రెండు జగణాలుండవలసిన పాదంలో జగణమే లేకుండా పద్యరచన సాగింది. 'వాజితతుల్' 'తూలు'తున్నాయి. వాటి అలసట అంతా అవి దూకలేకపోవటంలో వుంది. ఆ దూకుడుకు వ్యంజక గణం జగణం. వాటి అలసటను వ్యంజించటానికి జగణహీనంగా పాదరచన చేయబడింది. అలా తూలిన అశ్వాలపై కశాఘాతం చురుకెత్తించి, ఉరుకెత్తించింది. ఆ ఉరుకు ఒకే పాదంలో ద్రుతాంతమూ (చనున్), హలంతమూ (కశల్) కలిగిన పదాలు తెల్పుతున్నాయి. అచ్చు చేర్చక హలంతం చేయటం చేత ఉచ్చారణలో వేగం వస్తుంది.

సీతారామ కళ్యాణానికి సుముఖత చూపిన దశరథుడి ప్రయాణాన్ని 'సుముఖి' ఛందంలో నడపటం చమత్కారం.

---

* ఇది త్రిష్టుప్ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 11 అక్షరాలు గణాలు: న-జ-జ-లగ. యతిస్థానం: 7 వ అక్షరం. ప్రాస నియమముంది.

# మాలిని*

భరతుడు దీనిని 'నాందీముఖి' అని పేర్కొన్నాడు. అయితే, ఇతడు కూడా ఒక మాలినీ వృత్తాన్ని సూచించాడు. నామసామ్యం మాత్రమే వున్న ఆ వృత్తానికీ ఈ వృత్తానికీ గణసామ్యం మాత్రం లేదు 'గాయత్రి' చ్ఛందోజనిత మైన 'మాలిని'ని భరతుడు పేర్కొన్నాడు. దానికి పాదానికి ఆరక్షరాలు.'ర-మ' గణాలు. దాని లక్షణమే వేరు.11

తిక్కనననుసరించి ఖండాంతానికి విశ్వనాథ మాలినీ వృత్తాన్ని ప్రయోగించాడు. తిక్కన ప్రయోగరీతినే కాక, పద్య నిర్మాణ రీతినికూడా తానను సరించాడు

తిక్కన పద్యం :

అకృతక మధురోక్తి వ్యాప్త సందీప్త సారా!
సకల భువనరక్షాశాలి శుంభద్విహారా!
శుకజనక మనీషా! శుద్ధబుద్ధానుభావా!
సకృపకృతవిలాసా! సంభృతానందభావా! (స్వర్గా. 97ప.)

విశ్వనాథ పద్యం:

ఉపనిషదుదితోక్తి వ్యూహ నానాభిధానా!
తప ఉదిత ప్రమాభాక్తత్త్వ తేజోనిధానా!
నిపుణనుతి వచో నిర్ణీత వేదైకమూర్తీ!
వపురమలిన చాంద్రీభావ పీయూషవర్తీ! (ధను. 510)

అంత్యానుప్రాసలచేత శ్రవణపేయత్వం కలిగి, భగవంతునికి మనోరంజకంగా వుందీ పద్యం. దీర్ఘసమాస సాంద్రతచేత భక్తితో బరువెక్కిన హృదయ స్పందన సూచించబడుతూంది.

---

* ఇది అతిశక్వరీ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 15 అక్షరాలుంటాయి. గణాలు: న-న-మ-య-య; 19వ అక్షరం యతిస్థానం, ప్రాస నియతి వుంది.

# విశ్వదేవి*

ఈ వృత్తానికి 'చంద్రలేఖ' అనే నామాంతరముంది.[12] ఇది గురువు లెక్కువగావున్న వృత్తం. 12 అక్షరాలున్న పాదంలో 10 గురువులుండటమే ఈ గుర్వాధిక్యతను సూచిస్తూంది. అత్యంత అల్పసంఖ్యలో కేవలం రెండు లఘువు లున్నాయి. దీనివలన వర్ణనీయాంశంలోని గురుత్వం వ్యంజింపబడుతుంది.

అంభారావోత్సృష్టంబులై పప్లవోగ్రో
జ్జృంభమ్ముల్ సైన్యంబుల్ ధురీణంబులంతన్
భుంభుం ధ్వానంబు ల్గాగఁబుట్టెన్ ధరా భృ
ద్గంభీరానీకంబున్ విఘాతంబు చేసెన్ (ధను. 85)

ఇది శబళ శరీరం నుండి పప్లవులనే సైన్యం పుట్టినప్పటి పద్యం. వశిష్ఠ ధేనువును రాజాధికారంతో కైవసం చేసుకోవాలని వచ్చిన విశ్వామిత్రుని సైన్యంపై శబళ చేసిన తిరుగుబాటు ఇది.

గుర్వక్షరప్రాయమైన ఈ వృత్తం ధర్షణ్యాకృతి పూనిన శబళాస్వరూపాన్ని ఆవిష్కరిస్తూంది. జగతీఛందోజనితమైన రచన వీరరసోచితమని నాట్యశాస్త్రం పేర్కొంటూంది.[13] 'అంభారావం', 'ఉత్కృష్టంబు', 'జృంభమ్ము', 'సైన్యంబు', 'ధురీణంబు', 'భుం భుం ధ్వానంబుల్', 'గంభీరానీకంబున్', 'విఘాతంబు'— ఈ విధంగా బిందుపూర్వక 'బ' కారం చేత పద్యమంతటా ఆ 'భుంభుం' ధ్వానమూ, అ శబళ వీరవిక్రమంతో చెలరేగిన యుద్ధసన్నివేశంలోని మహాధ్వానమూ మనసుకు స్ఫురిస్తూంది.

ఇక్కడొక విశేషం వుంది అక్కడ వున్నది శబళ. యుద్ధానికి ప్రథమ సేనాని. తాను యుద్ధభూమిలో వుండి వీరోద్రేకంతో అరవటం సహజమే. శబళ ధేనువు కనుక అది 'అంభా' అనే అరుస్తుంది. ఈ పద్యమంతటా పరచుకున్న బిందుపూర్వక బకారం ఆ ధేనూరవ స్ఫోరకంగా వుంది. ఇది చమత్కారం.

---

* ఇది జగతీఛందో జనితమైన వృత్తం. పాదానికి 12 అక్షరాలుంటాయి. గణాలు : మ-మ-య-య. యతిస్థానం : 8 వ అక్షరం. ప్రాస నియమముంది.

# చంద్రకళ*

దశరథుడు పుత్రకామనాలోలుడై చింతాగ్రస్తుడై వున్నపుడు సుమంత్రుడు చెప్పినమాట ఈ వృత్తంలో రచింపబడింది.

మున్నువిన్నది దేవరహస్యంబున్ దమకున్ వినిపింపగా
నెన్నొసార్లు తలంచితిఁ గానీ యేను వచింపనెలేదు నేఁ
డెన్నఁ జెప్పకయున్న ఫలం బొక్కింతయులేదు ధరాధిపా!
మున్నుదేవయుగంబున వింటిన్ భూప! భవత్సుత హేతువున్
(ఆష్టి 144)

ఈ పద్యంలో సుమంత్రుడి వినయలక్షణం ద్రుతప్రకృతికాలచేత సూచించబడుతూంది. 'రహస్యంబున్', 'తమకున్' కానీ 'వింటిన్', 'హేతువున్' ఇవన్నీ, పద్యపు వేగాన్ని తగ్గిస్తున్నాయి. పైగా నాలుగుపాదాల పద్యంలో 'ధరాధిప' 'భూప' అని రెండు సంబోధనలున్నాయి. అంటే, పద్యం ఆగి ఆగి నడుస్తూంది. ఈ నెమ్మదితనంలో సుమంత్రుడి వినయం కనిపిస్తుంది.

దిగులు మొగమై కూచున్న రాజుకు సుమంత్రుడీ విషయం చెప్పాడు. అది వెన్నెలరాత్రి. రాజుకు ఈ మాటలు వెన్నెలంత చల్లగా, హాయిగా సోకాయి. ఆ అనుభవ సూచన వృత్తనామంచేత చేయబడింది. దీనిని మరింత స్పష్టంచేస్తూ కవి ఈ పద్యానంతరం అని 'చంద్రకళలు విరిసిన వనపల్కిన' అన్నాడు.

---

* ఇది అతిధృతిచ్ఛందోజనితమైన వృత్తం. పాదానికి 19 అక్షరాలు. లక్షణాలు: ర-స-స-త-జ-జ-గ; యతిస్థానం: 11 వ అక్షరం; ప్రాస నియమముంది.

# అశ్వవిలసితం*

దీనినే భరతుడు,[14] అప్పకవి[15] 'అశ్వలలిత' మని పేర్కొన్నారు. వృత్త నామాన్నిబట్టి అశ్వసౌందర్య వర్ణనకిది ఉచితమని భావింపదగివుంది.

దశరథుడు అయోధ్యా నగర దర్శనానంతరం అశ్వశాలకు వెళ్ళినపుడు, అక్కడి అశ్వవర్ణన ఈ వృత్తంలో చేయబడింది.

శరనిధిఫేనరమ్యములు కొన్ని చైత్రవన బాలపత్ర రుచిభా
స్వరతరునైగనిగ్యములు కొన్ని చాంద్రమసబాలరేఖఁగ ముఖా
గ్రరుచిర చిహ్నముల్గలిగి కొన్ని కంధరలు పైకి నెత్తి పృథివీ
శ్వర గురుదర్పమేఁచునవి కొన్ని జాతి హయరత్నముల్గనబడెన్

(ఇష్టి. 71)

ప్రతి పాదంలోనూ మొదటి సగం చంపకమాల ఇది అని తలపింపచేసి, వెంటనే తర్వాతి సగంలో అది విశ్లథం కావటంతో ఆ భావం భంగించబడుతూంది. అంటే, తొలుత స్ఫురించిన ఆ గమనవేగం తర్వాత గుర్వాధిక్యతచేత నెమ్మదితనాన్ని పొంది, విలంబితగతిలోకి మారింది. ఇది అశ్వ విషయాన్ని సున్నితంగా సూచిస్తూంది. అవి బంధించబడ్డ అశ్వాలు తప్ప, పరిగెడుతున్నవి కావు. అయినా వాటిని చూడగానే వాటి వేగలక్షణం స్ఫురిస్తుందనటానికి సూచనగా ద్రుతగతిరచనా; అవి కట్టివేయబడినందున ప్రస్తుతం వూరకే వున్నా యనటానికి సూచనగా విలంబిత గతిరచనా తోడ్పడుతున్నాయి. ప్రతి పాదాంతం లోనూ ఒక గుర్వక్షరం సాగి, తర్వాతి పాద ప్రారంభాక్షరంతో ముడిపడి, ద్రుతగతి నందుకుంటూంది. కట్టు వదిలితే కదనుతొక్కే పంచకళ్యాణి గుర్రాల వేగస్వరూపాన్ని ఇది భావింపచేస్తూంది.

---

* ఇది వికృతిచ్ఛందో జనితమైన వృత్తం. పాదానికి 23 అక్షరాలు. గణాలు : న-జ-భ-జ-భ-జ-భ-వగ. యతిస్థానం : 13వ అక్షరం. ప్రాస నియమముంది.

# అశ్వగతి*

ఈ వృత్తం బాలకాండలో ఒక్క చోట మాత్రమే ప్రయుక్తమయింది.

పుత్ర సంతానం లేని దశరథ దుఃఖాన్ని ఓదార్చడానికి సుమంత్రుడు అశ్వంపై వెళ్ళినప్పటి వర్ణన ఈ వృత్తంలో వుంది.

పోయెదనంచు వచించి విభుంగన నశ్వముపైఁ
బోయె సుమంత్రుఁడు మంత్రులు పొందిరి సంతసమున్
శ్రీయుతవజ్ర మహాశ్మ గరిష్ఠ సుసౌధముపై
ఝామ్రయువతీ సుమనోహరు గాంచె సుమంత్రుఁడొగిన్ (ఇష్టి. 25)

భగణ పూరితమైన ఈ వృత్తంలో అశ్వగతిని చిందులు తొక్కించటం కోసం కవి జగణాల్ని నియమించాడు. లక్షణరీత్యా ఒక్క జగణం కూడా వుండటానికి వీలులేని వృత్తమిది. కానీ, ఇందులో 'వచించి', 'విభుంగన', 'సుమంత్రుడు', 'మహాశ్మ', 'గరిష్ఠ', 'సుసౌధము', 'సుమనోహరు', 'సుమంత్రుడు'- ఇవన్నీ జగణాలు. వీని వలన కదంతొక్కే పంచకళ్యాణి రూపం కనిపిస్తుంది. మహాశ్మ గరిష్ఠ సుసౌధమని వరుసగా మూడు జగణాలు వచ్చాయి. సౌధ సోపానాలను మంత్రి చెంగు చెంగున ఎగురుతూ ఎక్కాడని భావింప వీలు కలిగిస్తున్నాయివి.

---

* ఇది అష్టిచ్ఛందోజనితమైన వృత్తం. పాదానికి 16 అక్షరాలు. గణాలు: 5 భగణాల మీద ఒక గురువు. (భ-భ-భ-భ-భ-గ) యతిస్థానం: 10వ అక్షరం. ప్రాస నియమముంది.

# మత్తకోకిల*

ఈ వృత్తాన్ని ప్రాచీన లాక్షణికులు వివిధ నామాలతో వ్యవహరించారు. పింగళుడు హరసర్తనమనీ, హేమచంద్రుడు ఉజ్జ్వలమనీ, జయకీర్తి మాలికోత్తర మాలిక అనీ, కేదారభట్టు హరనర్తకమనీ వ్యవహరించారు. వారు 8వ, 13వ అక్షరాంపై విచ్ఛేదం చెప్పారు. సంస్కృత లాక్షణికులలో జయకీర్తి ఒకడే మత్తకోకిల అనే వృత్తాన్ని గురించి చెప్పాడు. దాని గణలక్షణం న-భ-జ-ర. హేమచంద్ర కేదారభట్టులు దీన్నే ప్రియంవద అన్నారు ఆంధ్ర లాక్షణికులు కూడా ప్రియంవద అనే అన్నారు.[16]

ఇది 3 + 4 మాత్రల ఆవృత్తితో మిశ్రగతిలో నడుస్తుంది. 18 అక్షరాల పాదంలో 10 లఘువులే ఉన్నాయి. ఇది మధుర చిత్తస్పందనను సూచించటానికి అనుకూలమైన గతి.

ఎంత చక్కని చీరఁ గట్టిన దెంత సొమ్ములు క్రొత్తవిన్
వింతలున్ మెయిఁ దాల్చికొన్నది విశ్వమోహన మూర్తియై
యెంత భాగ్యము భర్తతో రథమెక్కి ముందటి బండిపై
నింత గౌరవ మొప్పనేగుట యే లతాంగులు నోతురే? (ఇష్టి. 247)

ఋశ్యశృంగ సహితయైన శాంతను చూసి అయోధ్యా పౌరులు పొందిన ఆనంద స్పందన ఇది. లక్షణరీత్యా ఎనిమిది జగణాలుపుండాల్సిన ఈ వృత్తంలో కేవలం ఒకే ఒక్క జగణముంది. (**లతాంగులు**), భగణ, రగణాలు ఆధిక్యత వహించి, పౌరుల ఆనందడోలనానికి వ్యంజకాలుగా వున్నాయి. అద్యంతాలలో గురువున్న రగణం ఈ ఆనందడోలనను చక్కగా సూచిస్తుంది. జగణాలు లేకపోవటం పౌరుల ప్రశాంతానంద స్థితిని భావింప చేస్తున్నది.

---

* ఇది ధృతిచ్ఛందోజనితమైన వృత్తం పాదానికి 18 అక్షరాలు. గణాలు: ర-స-జ-జ-భ-ర. యతిస్థానం: 11వ అక్షరం. ప్రాస నియమముంది.

మాధవాగమ మెల్ల లోచన మంజుశోణ నవచ్ఛవిన్
సాధులై యెసఁగన్ బికీతతి శ్రావ్యమోహన గీతికా
మాధు నిర్ఝరపాళిఁ జిమ్మగ మాధవుండరుణాక్షుడై
సాధుధర్మము నెగ్గఁజేసెడి చాయఁ దోఁచినదెల్లెడన్ (అవతార. 186)

మాధవుడు శ్రీరామచంద్రుడై లోకావతరణ చేయబోయే సమయంలో కోయిలలు శ్రావ్యంగా పాడాయి. అప్పటి వర్ణన ఇది. కోయిల కూతను మత్త కోకిలావృత్తంలో వర్ణించటం ఒక సొగసు. జగణాలను విశ్లథంచేసి భగణ, సగణ, రగణాలుగా ప్రస్తరించటం వలన ఎగసిపాటు లేని ప్రశాంత గతి ఏర్పడింది. ఇది మధురభావ సూచకం కనుక ఈ గతి ఉచితమే. 'పికీతతి' అన్న చోట జగణం వుండి, 'కీ' అన్న అక్షరంపై దీర్ఘీకరించబడి, కోయిల కూతలో వున్న దీర్ఘస్వరాల్ని స్ఫురింప చేస్తూంది.

# ప్రభాతం*

బాలకాండలో ఈ వృత్తాలు రెండుచోట్ల మాత్రమే ప్రయుక్తమయ్యాయి. రెండుచోట్లలోనూ రాముని కన్వయిస్తాయి.

తుకతుకనై పడఁద్రోలి నేడు గుఱ్ఱా
ల కొండుపు ముట్టియఁన్ వెలారు నుర్వుల్
చికిలి వెలుంగులు చిమ్మెఁ బ్రాచిఁ భాస్వ
త్ప్రకటిత సారథిఖా కశాంత కాంతుల్ (అవతార. 197)

శ్రీరాముడు జన్మించబోయే ప్రభాత వర్ణన ఇది తెల్లవారట మన్నది సామాన్యాంశం. కానీ, ఇక్కడ రోజూ జరిగే కార్యక్రమంలాగా తెల్లవారటం లేదు ఆ దినం లోక శుభంకరుడైన దాశరథి జనించబోతున్నాడు. కనుక, అది విశేష దినం. దాన్ని సూచిస్తూ ఇక్కడ విశేష వృత్తరచన చేయబడ్డది.

సూర్యదేవుని రథాశ్వాల నురుగుల వెలుగులు ప్రాచీదిశలో తోతెంచాయి. పద్యగమనంలో ఆ గుఱ్ఱాల వేగమూ, త్రొటుపాటు కనిపిస్తుంది. 'కశాంత కాంతుల్' అన్న మాటలో- 'కశాంత.కాంత' శబ్దాల కూర్పులో అశ్వాల కళ్ళాలు లాగి వదిలిన తీరు భావింపదగి వుంది. 'క' కారం తొలగిస్తే వినిపించే 'శాంత' శబ్ద సామ్యం కలిగి 'కాంతుల్' అన్న మాట ముక్తపదగ్రస్త భ్రాంతిని కలిగిస్తుంది. ఇది కాస్త వదలిన కళ్ళెం తిరిగి బిగించే తీరుకు సూచకంగా వుంది.

తొలి వెలుఁగయ్యె నిదోయి! యోయి! యో కో
సలసుత ప్రజ! సాధు రామచంద్రా!
తొలివెలుఁగయ్యె నిదోయి! కౌసలేయా!
మెలుకువ వచ్చెనె మీకు రామభద్రా! (అహల్య. 92)

'కౌసల్యా సుప్రజారామా' అన్న శ్లోకం ఈ పద్యానికి ఆధారమని భావింపదగి వుంది. భగవంతుని మేల్కొల్పడానికి భక్తులు సుప్రభాత గీతికలు పాడటముంది. ఈ పద్యంలో ఆ ధోరణి కనిపిస్తుంది. రాముడిపట్లవున్న ప్రేమాదరంచేత కౌశికుడీ రీతితో మేల్కొల్పాడు. ఇది 'సుప్రభాతం' కనుక ప్రభాత వృత్తంలో రచించబడింది.

---

* ఇది అతి జగతీ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 13 అక్షరాలు. గణాలు : న-జ-జ-ర-గ : యతిస్థానం : 8 వ అక్షరం. ప్రాస నియమముంది.

# సుందరి*

బాలకాండలో ఈ వృత్త ప్రయోగ మొక్కసారి మాత్రమే కనిపిస్తుంది.

శాంతయు వచ్చినదన్న సంబరమందు రా
ట్కాంతలు సప్తమి యెంత గమ్మన బోయెనో?
యంతట నష్టమివచ్చి యంతన చన్నదో?
యింత యెఱుంగరు శాంత యెంతటి తీపియో (అవతార. 196)

గర్భిణులైన రాణులను చూడటానికి శాంతాదేవి వచ్చింది. ఆమె వచ్చిన దినం చైత్ర శుక్లపక్ష సప్తమి. ఆమె వచ్చాక రెండు రోజులకు రామజనన మయ్యింది. ఆమె సాన్నిధ్యం వారికి మనోహరంగా వుంది. ఆమె సుందర ప్రకృతి వీరినందరి నాకర్షించింది. ఆ సూచన చేస్తూ ఈ విషయాన్ని 'సుందరీ' వృత్తంలో వర్ణించాడు కవి.

పద్యంలో ప్రాసస్థానంలో వున్న బిందు పూర్వక 'త' కారాలు నాలుగు కాక, 'యెంత', 'యంతన', 'శాంత', 'యెంతటి' అన్న చోట్ల మరో నాలుగు పొర్లున్నాయి. ఈ బిందు పూర్వక 'త'కారం శాంతానామస్ఫోరకమై పదేపదే ఆమెను స్మృతికి తెచ్చి ఆమె 'సుందర' ప్రకృతిని ప్రకటిస్తూంది.

---

* ఇది శక్వరీ ఛందో జనితమైన వృత్తం. పాదానికి 14 అక్షరాలు. గణాలు: భ-భ-ర-స-వ, యతిస్థానం: 9వ అక్షరం. ప్రాస నియమముంది.

# మధుమతి*

దివ్యఛందాలుగా పేర్కొనబడిన వాటిలో ఇదొకటి.17 ప్రతి పాదంలోనూ అయిదు లఘువులు, రెండు గురువులు వుంటాయి. మాత్రాపరంగా చూస్తే 5 లఘువులు = 5 మాత్రలు; రెండు గురువులు = 4 మాత్రలు. ఈ రెంటి మధ్య ఒక లఘువు భేదముంది. అంటే, రెండూ దాదాపు సమంగా వుండి, పద్యానికి సమగతి నిస్తాయి ఇందుచేత, ఈ పద్యగతి ప్రశాంత చిత్తవృత్తిని ప్రకటించడానికి అనుకూలంగా వుంటుంది.

వగరు పిందెలతోఁ
జిగురు టాకులతోఁ
దొగరు వన్నెలతోఁ
మిగిలె మావి తరుల్ (అవతార. 188)

గర్భిణులైన రాణులు శ్రీరామాదులను ప్రసవించే సమయం సమీపించింది. మాధవు డాగమించే వేళలో మధుమాసం తనను తానలంకరించుకుంటూంది. అక్కడి పద్యమిది. 'మధుమతి' అనే నామం చేత అలంకార శోభిత అయిన ప్రకృతికాంత స్ఫురిస్తుంది. పద్యపాదాలు చిన్నవి కావటం చేత, ఆమె అలంకరించుకోవటంలోని తొందరతనం వ్యంజింపబడుతూంది.

---

* ఇది ఉష్ణిక్ఛందో జనితం. పాదానికి 7 అక్షరాలు. యతి నియతి లేదు. గణాలు: న-భ-గ. ప్రాస నియమముంది.

# భ్రమర విలసితం*

ప్రతి పాదంలోనూ 5 గురువులు, 6 లఘువులు వున్న ఈ వృత్తం మధ్యగతిలో నడుస్తుంది. ఇది శృంగార రసోచితమైన లయ.[18] వసంతంలో శృంగార రంగభూమిలో భ్రమరాలు మాధవునికి స్వాగతం పాడే తరుణమిది. శ్రీరాముడిగా అవతరించబోయే శృంగారమూర్తికి ఈ వృత్తంతో భ్రమరాలాహ్వానాలు పలకటం ఉచితగతిలో వుంది.

మాకందోద్యత్సుమ మధుఝరిణీ
సేకంబై త్రావి సివము లెసగన్
సాకూతం బొప్ప సరస సరఘా
నీకంబుల్ ఝుమ్మని రొదలురలెన్ (అవతార. 185)

'ఝుమ్మని' అనే పదంలో మొదటి అక్షరమైన 'ఝు' కారాన్ని రెండవ అక్షరమైన ద్విత్వ 'మ' కారం మీద నొక్కి 'ఝుమ్మని' అని చదివితే ఆ భ్రమర ఝుంకారం వినిపిస్తుంది. భ్రమరాల విలాస చేష్టను సూచించటానికి ఈ వృత్తనామం తగివుంది. వర్ణితాంశాన్ని వృత్తనామంతో సూచించిన చోటుల్లో ఇదొకటి.

---

* ఇది త్రిష్టుప్ ఛందోజనితం. పాదానికి 11 అక్షరాలు. గణాలు : మ-భ-న-వ. యతిస్థానం : 6వ అక్షరం. ప్రాస నియమముంది.

# హంసరుతము*

ఈ వృత్తనామం వర్ణితాంశాన్ని సూచించేది.

శ్రీ సంపాదితములై య
భ్యాసం బొప్పంగ సరోజా
వాసంబై మధురవంబై
కూసెన్ మత్తకలహంసల్ (అవతార. 184)

శ్రీరామ జననాత్పూర్వం ప్రకృతి పొందిన స్పందనల్లో ఇదొక భాగం. మాధవస్వామి వచ్చేవేళ మంగళ గీతాలాలపించే కలహంసల మధురవ వర్ణన ఇది.

ప్రసన్నార్థ బోధక విషయాలకు అనుష్టుప్ఛందస్సు ఉచితమని క్షేమేంద్రుడు సూచించాడు.[19] ప్రశాంత చిత్తగతికి సూచకమైన హంసరుతం అనుష్టుప్ఛందోజనితమైన 'హంసరుతం'లో చెప్పటం ఉచితంగా వుంది.

---

* ఇది అనుష్టుప్ఛందో జనితమైన వృత్తం. పాదానికి 8 అక్షరాలు.
గణాలు: మ-న-గగ. యతి నియతి లేదు.
ప్రాస నియమముంది.

# పద్మనాభం*

ఈ వృత్తంలో ప్రతిపాదానికీ 16 గుర్వక్షరాలున్నాయి. దీనివలన పద్యం సాంద్రతను సంతరించుకుంటుంది. ఫలితంగా గమనంలో విలంబితగతి ఏర్పడుతుంది. ప్రతి రెండు గుర్వక్షరాల తరువాత ఒక లఘ్వక్షరముండటం చేత గతిలో అవరోహణ కనిపిస్తుంది. కనుక, ఇది అవరోహణాత్మక విలంబిత గతిలో వుంది.

బాలకాండలో రెండు సందర్భాల్లో మాత్రమే ఈ వృత్తం ప్రయుక్తమయింది:

1. ఇష్టివేళ యాజకులు యూపసంఖ్య సరిచూచుకోవటం (ఇష్టి-355).

2. శ్రీరామ జననం (అవతార - 208)

మొదటి పద్యం యజ్ఞవిషయ సంబంధి. 'యజ్ఞో వై విష్ణుః' అను వాక్యానుసారం యజ్ఞం విష్ణుస్వరూపం. పద్మనాభ స్వరూపమైన ఆ యజ్ఞ సమారంభార్థక విషయాల్ని పద్మనాభ వృత్తంలో రచించటం ఉచితంగా వుంది. పైగా ఇది సామాన్య యజ్ఞం కాదు. దేని మూలంగా నారాయణస్వామి నరుడై భువి కవతరించనున్నాడో ఆ యజ్ఞమది. ఈ దృష్టితో కవి దాని విశేషత్వం భాసింప చేయటంకోసం విశేష వృత్తాన్ని ప్రయోగించాడు.

---

* ఇది వికృతిచ్ఛందోజనితమైన వృత్తం. పాదానికి 28 అక్షరాలు.
గణాలు : 7 తగణాల మీద ఒక గగం (త-త-త-త-త-త-త-గగ)
యతిస్థానం : 13 వ అక్షరం ప్రాస నియమముంది

ఘంటారవం బట్లు శీర్షోదయం బిట్లు
గానయ్యె లగ్నంబు నిష్కర్ష గాఁగన్
ఝింటీ ప్రసూనంబు లట్టుల్ గ్రహశ్రేణి
చెల్వొందెఁ దత్కాల సంభూత దేహిన్
వెంటన్ జగన్నాశ నోద్యన్మహాదైత్య
విధ్వంసన క్రీడ నారంభుఁ జేయన్
ఘంటాపథంబయ్యెఁ, గన్పింపరాకుండ
క్ష్మానాథు గేహంబు దేవాళికెల్లన్. (అవతార. 208)

ఇది శ్రీరామజననకాలవర్ణన. ప్రాసస్థానంలో వున్న బిందుపూర్వక 'ట' కారం పద్యంలో 'ఘంటా' నాద స్ఫోరకంగా వుండి 'జగన్నాశనోద్యన్మహా దైత్య విధ్వంసన క్రీడ' కి అర్చనా పూర్వకంగా వుంది. దీర్ఘాక్షరాలధికంగా వున్నందు చేత ఈ పద్యం నాదాత్మకంగా వుంది. శ్రీరామజననం జగదానంద కారకమైన ఘటన. దీనిని మధురతరగతి గల ఈ వృత్తంలో వర్ణించటం చేత లోకుల హృదయస్పందనలోని ఆనందం వ్యంజితమవుతూంది.

పద్మనాభ స్వరూపమైన యజ్ఞం సాక్షాత్తూ పద్మనాభునే అవతరింప చేసింది. ఈ వృత్త ప్రయోగం దానికి వ్యంజకంగా వుంది.

# క్ష్మాహారం*

ఈ వృత్తలక్షణంలో ఒక చిత్రముంది. ఈ పద్ధతి 'వికటకవి' అనే పదాన్ని పోలివుంటుంది. ఈ పదం తొలిసగమెలా వుందో మలిసగం సరిగ్గా దానికి వ్యతిరేకంగా వుంది. వీటిని ఆంగ్లంలో 'పాలింద్రోమ్స్' (Palindromes) అంటారు. ఆ పద్ధతి ఈ వృత్తలక్షణంలో కనిపిస్తుంది. గురు లఘువుల్లో చూపితే ఈ విషయం స్పష్టమవుతుంది.

| మ | న | య | | త | న | మ |
|---|---|---|---|---|---|---|
| UUU | III | IUU | — | UUI | III | UUU |
| | తొలిసగం | | — | | మలిసగం | |

ఈ నిర్మాణంలో తొలిసగం తిరగబడి మలిసగం కావటం కనిపిస్తుంది. ఈ దృష్ట్యా పరస్పర విరుద్ధభావాలు ఒక్కచోట కూర్చబడిన సన్నివేశ వర్ణనకు ఈ వృత్తం ఉచితంగా వుంటుంది.

ఆనందాస్యుఁడు పరుషంబౌ నే మాట యనఁడు తోనాడు
న్దానే ముందుగ నెవరైనన్ గానీ యితరుల పారుష్య
స్థానోక్తుల్ తలఁపఁ డొగిన్ దానై సర్వేశ్వర సువిద్యాప్రా
రీణుండయ్యు నితర శస్త్రవ్రాతంబు కృతికి నగ్గించున్

(కళ్యాణ. 291)

వైరాగ్య శృంగార భావాలు 'గంగా యమునలవలె సమప్రసార' రమ్యాలైన శ్రీరామ చంద్రుడి ప్రవర్తన ఇది.

---

* ఇది ధృతిచ్ఛందో జనితమైన వృత్తం. పాదానికి 18 అక్షరాలు. గణాలు. మ-న-య-త-న-మ. దీనికి రెండు యతిస్థానాలు: 9వ, 18వ అక్షరాలు: ప్రాస నియమముంది.

సీతతో తన కళ్యాణం జరిగాక కొంతకాలానికి రాముడిలో వైరాగ్యరేఖ పొడ చూపింది. 'ప్రాణము కంటె ప్రాణము ధరాజాతా ముఖాంభోజమే యేమోగా' కనిపించింది. ఈ 'పక్షపద ప్రిపాత వికటానంతోహ భారం' ఆతడిని సంసార భావాలపట్ల విరక్తుణ్ణి చేసింది. అపుడు వశిష్ఠుడు చేసిన బోధవలన రాముడిలో కర్మజ్ఞానం కలిగింది. క్రమంగా అతడిలో శృంగారభావాలు పునః పల్లవించాయి. రాముడు 'శ్రీజనకాత్మజా ప్రణయజీవన మోహనకారి' అయ్యాడు. తొలుత కలిగిన విరాగభావన, మలిదశలో కలిగిన శృంగారభావన రెండూ సమంగా కలిసి రాముడిని కర్మజ్ఞానయోగిగా పరిణమింపచేశాయి.

పద్యనిర్మాణంలో ఈ పై విషయమంతా వుంది. ప్రతిపాదం తొలి సగంలో వున్నట్లు మలిసగంలో లేదు. అయితే, ఈ లేకపోవడంలో ఒక పద్ధతి వుంది. అద్దంలో కనిపించే ప్రతిబింబం అసలు బింబానికి కుడి ఎడమలుగా మారినట్లు, తొలి సగంలోని గణాల వరుస మలి సగంలో తిరగబడ్డాయి. ఇది వైరాగ్య భావంతో పాటుగా తద్విరుద్ధమైన శృంగార భావమూ కలసి వుండ టానికి ప్రతీకగా వుంది.

# అష్టమూర్తి*

ఈ వృత్తనామం పరమేశ్వరమూర్తి సూచకం. పంచభూతాలు, సూర్య చంద్రులు, యజమాని- ఈ ఎనిమిది విషయాల సమష్టి స్వరూపానికి 'అష్టమూర్తి' అని పేరు. యజమాని అనే స్వరూపానికి మిగిలిన విషయా లాత్మపదార్థం.

ఈ వృత్తంలో ఎన్ని గుర్వక్షరాలున్నాయో, సరిగ్గా అన్ని లఘ్వక్షరాలున్నాయి. 12 గురువులు + 12 లఘువులతో కూడిన ఈ వృత్తం సమవర్తిత్వమనే భగవత్తత్త్వ సూచన చేస్తూంది.

ఋక్సామాకృతి యజుర్మూర్తిని మహా
    థర్వవాసున్ గృతపతంగ తురంగున్
వాక్సమ్యక్చర దుదాత్త స్వరిత మా
    ర్గ ప్రవిష్టున్ బటుహవిః ప్రియ చిత్తున్
దిక్సీమాంత నిబిడ జ్యోతిని హృషీ
    కేశ విష్ణున్ ధృత ధనుశ్చణ హస్తున్
ద్రాక్సంతుష్ట హృదయాజ్ఞాత కనేఁ గౌ
    సల్యా శౌరిన్ దళిత దైత్యా మహౌఘున్ (అవతార. 209.)

ఇది శ్రీరామ జనన వర్ణన. "అష్టానాం లోకపాలానాం వపుర్ధారయతే నృపః" అన్న మనుస్మృతి ప్రకారం రాజష్టమూర్తి. శ్రీరాముడు రాజు. పైగా నారాయణుడు. అందుచేత అతడష్టమూర్తిగా భావింపదగివున్నాడు. అలాటి వ్యక్తి వర్ణనకు ఈ వృత్తరచన ఉచితం. ఈ ఔచిత్యం వృత్తనామానికి అన్వయించే మాట. వర్ణితాంశం వృత్తనామంతో సూచించబడింది.

---

* ఇది సంకృతిచ్ఛందో జనితమైన వృత్తం. పాదానికి 24 అక్షరాలు. గణాలు: మ-న-త-స-ర-భ-జ-య.; యతిస్థానాలు: 9వ, 17వ అక్షరాలు. ప్రాస నియమముంది.

# భూనుత*

బాలకాండలో ఒక్కచోట మాత్రమే ఈ వృత్త ప్రయోగముంది. రావణ సంహారానికై తోడ్పడే వానర సృష్టిలో హనుమంతుని వర్ణనకై ఈ వృత్త మెంచుకున్నాడు కవి.

ఆఁక లేకయ యపాంపతినైనను దాఁటున్
దోఁక చిచ్చునఁగ రక్కసి తుంగ దహించున్
వీఁక యీ దృశము లోకము వీరులకెల్లన్
జోఁక యీతనికి నంజన సూనునకెందున్ (అవతార. 72)

హనుమంతుడొక ప్రత్యేక సృష్టి. అత 'దస్తోక మనీషాపయోధి', 'మోహా శోకాన్వేషణుడధీతి చూడామణియున్'. అలాటివాడినిగురించి చెప్పాలంటే అతి ప్రత్యేకమైన వృత్తమవసరం. ఆ విశేష వ్యక్తిత్వ స్ఫురణకోసమిక్కడ విశేష ఛందం ప్రయుక్తమయింది. 'అపాంపతి దాటడం, తోకచిచ్చునగ రక్కసితుంగ దహించడం' మొదలైనవి ఇక్కడ అతని వీరత్వాన్ని సూచిస్తున్నా, సూక్ష్మంగా ఇవి భవిష్యద్రామాయణ విషయాలు. ఇవే సముద్రలంఘన, లంకాదహన, రాక్షస సంహార కార్యాలు.

---

* ఇది శక్వరీ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 14 అక్షరాలు. గణాలు:
గణాలు: ర-న-భ-భ - గగ: యతిస్థానం: 10వ అక్షరం. ప్రాస నియమం వుంది.

# మందాక్రాంత*

భరతుడు దీన్ని 'శ్రీధర' నామంతో వ్యవహరించాడు.[20] సంస్కృత మర్యాద ననుసరించి మందాక్రాంతకు రెండు విరతులు. నాల్గక్షరాలకు మొదటి యతి. ఆపై మరి ఆరక్షరాలకు రెండవ యతి. ఆంధ్రులు మాత్రం పదకొండవ అక్షరాన్ని యతిగా పాటించారు.

మందాక్రాంత మందమైన గతిలో నడవటానికి క్షేమేంద్రుడొక సూచన చేశాడు.

"మంధరా క్రాంత విస్రబ్ధైః చతుర్భిః ప్రథమాక్షరైః
మధ్యషట్కేఽతి చతురే మందాక్రాంతా విరాజతే"

ప్రతి చరణంలోనూ మొదటినాల్గక్షరాలు విలంబనంతో నడవాలి. అంటే అక్కడ దీర్ఘాక్షరాలే గురువులుగా వుండాలి.

గౌరీ పాదాంబురుహ వినమత్కాంత లాక్షానురక్తా!
పారా వారోన్మథన జనిత ప్రౌఢ కాకోల భుక్తా!
శారజ్యోత్స్నా మృదు శశి శిశుస్వచ్ఛ చూడాగ్రముక్తా!
సౌరప్రోద్యజ్జగదవన నిష్ణాత గంగాభిషిక్తా! (ఇష్టి. 433)

ఇది ఇష్టిఖండాంత పద్యం. తన ఇలవేల్పు అయిన విశ్వేశ్వరస్వామిని మధుర మందగతిలోనడచే మందాక్రాంతలో స్తుతించాడు విశ్వనాథ. బాలకాండలో ఇదొకటే మందాక్రాంత. అదీ కృతిస్వామిని స్తుతించేదిగా ఖండాంతంలో వుంది.

పాదప్రారంభంలో గుర్వక్షరాల స్థానంలో దీర్ఘాక్షరాలుండి, క్షేమేంద్ర వాక్యానుసారం అందమైన గతి నందుకుంది. కాళిదాసాదులు దీన్ని ప్రవాస విప్రలంభ శృంగారానికై ప్రయోగించగా, విశ్వనాథ తిక్కన తీర్చిన మార్గంలో ఖండాంత పద్యంగా నిక్షేపించి, స్తోత్రయోగ్యంగా నిరూపించాడు.

---

* ఇది అత్యష్టి ఛ్చందో జనితమైన వృత్తం. పాదానికి 17 అక్షరాలు. గణాలు: మ-భ-న-త-త-గగ. యతిస్థానం: 11 వ అక్షరం. ప్రాస నియమముంది.

# చంద్రరేఖ*

ఈ వృత్తంలో మూడు లఘువులు, పన్నెండు గురువులు వున్నాయి. అంటే, లఘ్వక్షరాలకు నాలుగురెట్లు గుర్వక్షరాలున్నాయి. గుర్వాధికతచేత పద్యం బరువెక్కుతూంది. భావోద్రేకంచేత భారావహమైన మనస్స్థితిని సూచించ టానికీ వృత్త ముచితంగా వుంది.

భూమీభృన్మౌళి కాంతుల్ భూషామణిశ్రేణి వెల్గన్
శ్రీమత్కాంతి ప్రసార క్షీరోద రత్న ప్రవాళో
ద్దామాంశుల్ రాజసౌధ ద్రాఘిష్ఠ గాంగేయ కుంభ
గ్రామంబుల్ వెల్గుప్రోవుల్గాఁ జంద్రరేఖల్ చలించెన్ (ఇష్టి. 206.)

సుతుని పొందటానికి మార్గంగా ఋష్యశృంగర్షి అధ్వర్యంలో పుత్ర కామేష్టిని గురించి చెప్పాడు సుమంత్రుడు. దుఃఖితుడైన దశరథునికి ఈ వర్త మానం పరమానందహేతువైంది. అప్పటి చంద్రరేఖల సౌందర్యవర్ణన ఇది.

పద్యంలో వున్న శ్లిష్ట సమాసాలచేత దశరథుని ఆనందసాంద్రత సూచిత మవుతూంది. 'శ్రీమత్కాంతి', 'ద్రాఘిష్ఠ', 'గాంగేయ', వంటి తగణాలచేత పద్యంలో ధారాశుద్ధి ఏర్పడి, నిండుదనం చేకూరుతుంది.

పద్యంలో వృత్తనామముంది. ఇది ముద్రాలంకారం.

---

* ఇది అతిశక్వరీ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 15 అక్షరాలు.
గణాలు : మ-ర-మ-య-య : యతిస్థానం : 8వ అక్షరం.
ప్రాస నియమముంది.

# ద్రుతవిలంబితము*

భరతుడీ వృత్తాన్ని 'హరిణప్లుత' నామంతో వ్యవహరించాడు. దీనికి 'సుందరి' అనే వ్యవహారం కూడా వుందని పాటిబండవారు పేర్కొన్నారు.

"ప్రారంభే ద్రుత విన్యాసం పర్యంతేషు విలంబితం
విచ్ఛిత్యా సర్వపాదానాం భాతి ద్రుత విలంబితం" (క్షేమేంద్రుడు)

ఇది ద్రుతవిలంబిత నిర్మాణ రహస్యం.

బాలకాండలో రెండు సందర్భాల్లో ఈ వృత్త ప్రయోగం జరిగింది. ఇది దశరథుడి శోకాన్ని ఓదార్చటానికి సుమంత్రుడే తగినవాడని తక్కిన మంత్రులు నిర్ణయించి అతణ్ణి రాజు వద్దకు వెళ్ళాల్సిందిగా కోరినపుడు అతడు ఆలోచనలో పడి, మీ ఇష్టం (ఇష్టి-24) అన్న సందర్భంలో ఒకటి వుంది. సుమంత్రుడి సందిగ్ధత ఒక నిర్ణయంగా మారటం ఇక్కడి విషయం.

ఇక రెండవది విశ్వామిత్రుని కథలోని పద్యం.

సురలు దేవఋషుల్ పరివల్గిత
స్ఫురణ నట్టిటు సోలిరి భ్రాంతులై
తొరఁగి గాధి సుతుండును నస్త్రమున్
బరగఁ జేసెఁ గృపాళు మునీంద్రుపై. (ధను. 104)

బ్రహ్మర్షి వశిష్ఠునిపైకి కౌశికుడు బ్రహ్మాస్త్రం సంధించినపుడు దేవతలు పొందిన భయమిది.

ప్రచండమైన క్రోధంతో బ్రహ్మర్షి మీదకు విజృంభించిన కౌశికుని చూసి దేవర్షులు గడగడలాడారు. ఆ తర్వాత వశిష్ఠుడు బ్రహ్మ బలాన్ని చూసి సాంత్వన పొందారు. వృత్తిగతి సరిగ్గా దీనిని ప్రతిఫలిస్తూంది. మొదట ద్రుతగతి, చివరకు విలంబితగతి వుండి, భయమందిన మనస్సు సాంత్వన పొందడాన్ని సూచిస్తూంది. మరో అర్థంలో, కౌశికుడి మహాశక్తి అంతా బ్రహ్మ దండంలోకి విలీనమయింది- ద్రుతగతి విలంబితగతిలోకి పర్యవసించినట్లు.

---

* ఇది జగతీ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 12 అక్షరాలు. గణాలు: స-భ-భ-ర. యతిస్థానం: 7 వ అక్షరం ప్రాస నియమముంది.

# చంద్రిక*

ఈ వృత్తంలో పాదానికి 12 అక్షరాలుండగా అందులో మూడుమాత్రమే గురువులు. తక్కిన తొమ్మిదీ లఘ్వక్షరాలు. పాదప్రారంభంలో వరుసగా రెండు నగణాలుండి ద్రుతగతిని సూచిస్తున్నాయి. వృత్తనామంచేత, గతిలోని ద్రుతత్వం చేత ఇది మధురచిత్తస్పందన కనుకూలమైనదని భావింపబడుతూంది.

కువలయమణి చిట్టి కోర్కులున్
దవిలి శిశిరమూర్తిఁ దాల్చి పె
ల్లివము చిలక మింటి కెక్కెనన్
సవియుఁ జెలగఁ నొప్పెఁ జంద్రికల్ (ఇష్టి. 205.)

ఋష్యశృంగుని రాకతో యజ్ఞం నిర్విఘ్నంగా నడిచి ఫలవంతమవుతుం దని విన్న దశరథుడి నేత్రాలకు నాటి వెన్నెల హృద్యంగా తోచింది. ఆ వర్ణన ఈ పద్యం. పద్యంలోని లఘ్వక్షరాధిక్యత పాత్రయొక్క లలిత మనస్పందనను ప్రతిఫలిస్తూంది.

పది కొలఁతగ వేయి వర్షముల్
కదలెను శిశురక్ష గల్గగా
మది సురపతి సేవ మక్కువై
యెదయు హృషితమౌచు నిట్లనెన్ (అహల్యా. 470.)

ఇందులోని ద్రుతగతివలన అనేక సంవత్సరాలు గబగబా గడిచిపోవటం, తనను సేవించిన ఇంద్రుని చూచి దితి 'హృషిత' మనస్క కావటం భావింపబడుతున్నాయి. చల్లని కిరణాలతో మనసుకానందాన్ని ప్రసాదించే వెన్నెల లాగా ఇంద్రుడు తనసేవతో ఆమెను ఆనందింపజేశాడనే సూచనకు 'చంద్రిక' వృత్తం ఉపబలకంగా వుంది.

---

* ఇది జగతీ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 12 అక్షరాలు. గణాలు : న-న-ర-వ; యతిస్థానం : 9 వ అక్షరం. ప్రాస నియమముంది.

# పణవం*

భరతుడు ఈ వృత్తాన్ని కువలయమాల, ఉత్పలమాలిక అనే పేర్లతో వ్యవహరించాడు. ఆంధ్ర మహాభారతంలో తిక్కన దీనిని ప్రణవమన్నాడు. అనంతాదులైన కొందరాంధ్ర లాక్షణికులు దీనినే పణవమన్నారు.

పద్య స్వరూపరీత్యా పణవమనే పేరు సరిపోయింది. పణవమంటే హుడుక్క అనే వాద్యవిశేషం. పద్యంలో గణాలిట్లా వున్నాయి:

UUU III IUU U (మ-న-య-గ)

దీన్ని సమ విభజనచేసి వ్రాస్తే ఇలా వుంటుంది :

UUUII - IIUUU

ఇది ఆద్యంతాల్లో గురువులచేత స్థూలమై, నడుమ లఘువులచేత సూక్ష్మమైన రూపంతో హుడుక్కను పోలివుంటుంది. ఇది చిత్రించినపుడు మరింత స్పష్ట మవుతుంది.

)————(
గురు లఘు గురు

ఇది రగడ స్వరూపాన్ని తలపిస్తుంది.

ఋశ్యశృంగర్షిని తాను తీసుకరాగలనని వింజామర పీచే స్త్రీ రోమ పాదునితో అంది. ఆమె మాటలీ వృత్తంలో ప్రయుక్తమయ్యాయి.

---

* ఇది పంక్తిచ్ఛందో జనితమైన వృత్తం. పాదానికి 10 అక్షరాలు. గణాలు : మ-న-య-గ. యతిస్థానం : 6 వ అక్షరం. ప్రాస నియమ ముంది.

క్ష్మానాథుల్ పటి మముఁ బంపింపన్
మానింద్రున్ గొని మమతం దెత్తున్
దేనుం జాలక ధృతినే రానే
రానీ పట్టణరమ సిగ్గిల్లన్. (ఇష్టి. 168)

ఇవి ఆమె అన్న మాటలు. ఈ మాటల్లో వున్న ధైర్యానికి రాజుసైతం 'అచ్చెరువడి' పోయాడు. మహారాజు ఎదుట 'నేను తిరిగివస్తే ఈ పట్టణరమకే సిగ్గు' అనేటంత తెగువ ఆమెది. ప్రభుసన్నిధిలో వినయం పాటించాలన్న స్పృహ మాటల ప్రారంభంలో మాత్రమే వుంది. మొదటి రెండుపాదాల్లో 'క్ష్మానాథుల్', 'పంపింపన్', 'మానింద్రున్' 'తెత్తున్' - అని ఆగి ఆగి సాగిన ధోరణిలో ఆమె వినయముంది. తర్వాతి రెండుపాదాలూ నిరాటంకంగా సాగాయి. ఇక్కడే ఆమె సవాలు చేసింది. ఆ మాటలు పల్కుతూ ఆమె ఆవేశానికిలోనైందన్న స్ఫురణ కలిగిస్తూ అఖండంగా రెండు పాదాలు నడిచాయి. 'సిగ్గిల్లన్' అని చప్పున ఆగిన ధోరణి కనిపిస్తూంది. 'అరె, రాజుగారి ఎదురుగా ఇలా మాట్లాడవచ్చా?' అన్న బుద్ధితో హఠాత్తుగా ఆవేశం తగ్గిన తీరు ఇది.

# ప్రియంవద*

ఈ వృత్తంలో వున్న 12 అక్షరాల ప్రతి పాదానికి 8 లఘువులు 4 గురువులు వున్నాయి. ఈ గురు, లఘువుల నిష్పత్తి మాత్రా పరిమాణ రీత్యా సమంగా వుంది. ఒడుదుడుకులు లేని మనస్సు సమస్థితి (balanced state) నుండి మాటాడితే ఎలా వుంటుందో ఈ వృత్తగతి ఆలాగ వుంది. అంటే అది మధుర భాషణానుకూలమైనగతి. ఆ గతి వుంది కనుక ఇది 'ప్రియంవద'. మధురభాషి అని అర్థం.

దివిషదీశ్వరుడు తేప మౌనులున్
గవురు గప్పుచు పొగల్ వెలార్పఁగా
నవు దపస్సుల మహాగ్ని రేఁగఁగా
నవుర! యచ్చరల నంపునంటగా! (ఇష్టి. 165)

ఋష్యశృంగుని రప్పించే మార్గాన్వేషణ చేస్తూన్న రోమపాదునితో వింజామర వీచే వారిలో ఒక స్త్రీ అన్నమాట ఇది. సంక్లిష్ట మానసుడైన రాజుకు ఈ మాట పరమ ప్రియంగా వినిపించింది. స్త్రీశక్తితో అతణ్ణి వశపరచుకోవచ్చు గదా అన్న సూచన అత్యంత వినయంగా వుంది.

---

* ఇది జగతీ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 12 అక్షరాలు. గణాలు: న-భ-జ-ర. యతిస్థానం : 8 వ అక్షరం. ప్రాస నియమముంది.

# వంశస్థం*

ఇది దివ్యఛందస్సులో ఒకటి. కనుక దివ్యత్వ సూచక విషయాల నిందులో వర్ణించటానికి ఉచితంగా వుంది. బహుశా కాళిదాసు కూడా ఈ దృష్టి తోనే రఘువు జనించబోయే తృతీయాశ్వాసంలో సుదక్షిణ దౌహృదలక్షణాలు మొదలు రఘుజనన పర్యంతం ఈ వృత్తంలోనే రచించాడు. వంశకీర్తింకరు డైన రఘుజననం దివ్య విషయం కనుక.

సంస్కృత కావ్య నేపథ్యం గల విశ్వనాథ ఇక్కడి సన్నివేశంలో కాళి దాస మార్గాన్ననుసరించి ఈ వృత్త ప్రయోగం చేశాడు. రఘువంశ సుధాంబుధి చంద్రుడైన శ్రీరామచంద్రు డుదయించటం జగతికి చంద్రోదయం. అదొక దివ్య సంఘటన. ఆ దివ్యత్వం రాణుల దౌహృదలక్షణాల నుండే సూచితమవు తూంది. ఆ విషయ వ్యంజనకీ వృత్తప్రయోగ మనుకూలిస్తూంది. బాలకాండలో వంశస్థ వృత్తమిదొక్కటే.

లతాంగులానంద విలాసమూర్తులై
నితాంత గర్భంబులు నిక్కముందటన్
పతంగ రాట్చుంచువు భాతి శార్ఙ్గ స
జ్యతాధురావైఖరి నద్భుతంబుగాన్ (అవతార. 180)

ఇక్కడి 'పతంగరాట్', 'శార్ఙ్గ' శబ్దాలలో కేవల ఉపమావాచకమే కాదు- గర్భస్థ శిశువు మహానారాయణమూర్తి అన్న సూచన వుంది.

పద్య ప్రారంభంలో వున్న వేగం ముగింపులో లేదు. 'లతాంగు' 'విలాస', 'నితాంత', 'పతంగ' అని జగణాలచేత వేగిరపడి నడచే పాదాలు, ముగింపులోకి వచ్చేసరికి గుర్వాధిక్యతచేత, దీర్ఘాక్షరాలచేత, జగణ హైన్యతచేత విలంబితగతి నవలంబించాయి. ఇవి గర్భిణుల నడకను తలపిస్తుంది. గబగబా నాలుగడుగులు వేయగానే అలసిపోయి, మెల్లగా నడవటం గర్భిణి లక్షణం. ఆమె శరీరస్థితి ఆమె కలసటను కలిగిస్తుంది. పద్యగతిలోని తొలుతవున్న వేగం, తర్వాత లేకపోవటం ఈ విషయానికి వ్యంజకంగా వుంది.

---

* ఇది జగతీ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 12 అక్షరాలు. గణాలు: జ-త-జ-ర. యతిస్థానం : 8 వ అక్షరం. ప్రాస నియమముంది.

# రథోద్ధతం*

సంస్కృత లాక్షణికులు దీన్ని రథోద్ధత అని స్త్రీలింగంలోనూ, తెలుగు లాక్షణికులు రథోద్ధతమని నపుంసక లింగంలోనూ వ్యవహరించారు. అప్పకవి దీన్ని 'పరాంతిక' మనే పేరుతో పిలిచాడు.[21]

తేని సంతస మెటింగి సూతుఁడున్
దోన వాజులన్ దూఁకఁ జేయగన్
బూనికన్ ఖదను పోవఁగా రథా
స్థాని రాజు మెయి సాఁగ నూగుచున్. (ఇష్టి. 51)

ఇది దశరథుడు అయోధ్యానగర దర్శనం చేసినప్పటి రథగమన వర్ణన. దశరథుడికి నగర దర్శనంలో విశాలమైన వీథులు, అందమైన ఉద్యానాలు ఇత్యాది విషయాలు కన్పించాయి. 'శాత్రవులకె యయోధ్య గాక అయోధ్య పర పురి శోభ కయోధ్య' అయిందని అతడానందించాడు. రాజు ఆనందమే తనదిగా భావించిన సూతుడు అశ్వాల్ని దూకించాడు.

'సూతుడున్', 'దూకజేయగన్', 'పూనికన్', 'ఊగుచున్' - ఇలాగా ద్రుతాంతపదాలు ప్రతి పాదంలోనూ వున్నాయి. అందువలన ద్రుతం వచ్చిన చోటంతా పద్యం ఆగి ఆగి నడుస్తూంది. ఇది రథగమనంలోని కుదుపుకు సూచకంగా వుంది. 'మెయిసాగ నూగుచున్' పయనించే దశరథుని అనుభవం పద్యంలో ఇలా ప్రతిబింబిస్తూంది. నేడు చలనచిత్రాల్లో సన్నివేశాన్ననుసరించి సంగీతం వినిపించినట్టు, ఇక్కడ రథగమనంలోని ఒడుదుడుకుల్నీ, ఊగిస లాటనీ ఈ ఛందోగతి చక్కగా సూచిస్తూంది.

ఇక్కడ ఉద్ధతమైన వేగంలో ఉరకలెత్తిన రథాన్ని రథోద్ధత వృత్తంలో వర్ణించటం జరిగింది.

---

* ఇది త్రిష్టుప్ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 11 అక్షరాలు. లక్షణం : ర-న-ర-వ అనే గణాలుంటాయి యతిస్థానం : 7వ అక్షరం ప్రాస నియమముంది.

# గజవిలసితం*

దశరథుడయోధ్యానగర దర్శనం చేస్తూ గజశాలనూ సందర్శించాడు. అక్కడి గజవర్ణనకు ఈ వృత్తం ప్రయుక్తమయింది.

చీకటులిప్పి కావు జిలుగు తళుకు జిగి దం
తాకృతి గానరాద యసలు నలుపుటిరులన్
గాక నగాళికావు కదలవు మెదలవు ముం
దీ కరరాజి లేద యిటు గునగున కదపన్. (ఇష్టి. 67)

ఇది సూతుడు చేసిన గజవర్ణన. ఈ పద్యంలో 'నగాళి' అన్నచోట జగణముంది. ఈ మాటలో ఆద్యంతాలలో లఘువుండి, నడుమ గురువుండటం కొండయొక్క స్వరూపాన్ని స్ఫురింపచేస్తుంది. తెల్లనిదంతపు వెలుగు కనిపిస్తుంది కనుక, ఆ ఏనుగులు చీకట్లు కావు. చైతన్యముంది కనుక కొండలు కావు. ఇది తాత్పర్యం. అంటే చీకటిలాగా నల్లగా వున్నాయనీ, కొండల్లాగా ఉన్నతంగా, దృఢంగా వున్నాయనీ సూచన.

వర్ణనీయాంశమైన గజవిలసనాన్ని అదే పేరున్న వృత్తంలో రచించాడు కవి.

---

* ఇది అష్టిచ్ఛందోజనితమైన వృత్తం. పాదానికి 16 అక్షరాలు.
లక్షణం : భ-ర-న-న-న-గ. యతిస్థానం : 8వ అక్షరం.
ప్రాస నియమముంది.

# మేఘవిస్ఫూర్జితం*

వృత్తనామం చేత గంభీరధ్వని సూచితమవుతూంది. ఇందులో పాదానికి 11 గురువులుండి, మందగమనాన్ని సృష్టిస్తున్నాయి.

స్థిరాంశు ప్రస్విన్నాప్సృతకర వియద్దేశ చూడా మనోజ్ఞా!
పురాళీ ప్రధ్వంసాద్భుతతర భుజాభోగ కేళీ సముజ్ఞా!
మరుత్పాళీకేళీ గిరికృత ధనుర్మండలీ లగ్నవిష్ణూ!
సరజ్జ్వాలాహాల విషమహా సహ్యా రేఖా సహిష్ణూ! (అహల్యా. 559)

ఇది ఖండాంతంలో కవి చేసిన విశ్వేశ్వర స్తుతి పద్యంలో అనేక గుర్వక్షరాలు సంయుక్తాక్షరపూర్వకమై వున్నాయి. కవి కృతి భర్తనెంత భారావహమైన మనస్సుతో వేడుకుంటున్నాడో ఇవి తెలుపుతున్నాయి 'ప్రధ్వంసాద్భుత' వంటి మాటల్లో ఆ 'మేఘవిస్ఫూర్జిత' ధ్వని వినిపిస్తుంది.

పాదాంత్య ప్రాస పద్యానికి సొగసు కూర్చటమే కాక, విశ్వేశ్వరునికి విశేషించి సంగీతారాధన సమర్పిస్తూంది.

* ఇది అతిధృతిచ్ఛందోజనితమైన వృత్తం. పాదానికి 19 అక్షరాలు. గణాలు: య-మ-న-స-ర-ర-గ. యతిస్థానం: 13వ అక్షరం. ప్రాస నియమముంది.

# మేదిని*

ఈ వృత్తానికి 'వాణి' అనే నామాంతరమున్నట్లు అప్పకవి పేర్కొన్నాడు. సంస్కృతచ్ఛాందసికులలో హేమచంద్ర, కేదారభట్టులు మాత్రం దీనిని 'వాణి' అని పేర్కొన్నారు.

బాలకాండలో ఈ వృత్తం నాలుగు సార్లు ప్రయుక్తమయింది. మేధాశ్వ నిమిత్తం అన్వేషిస్తూ పాతాళ లోకాల్లోకి సగర సుతులు ప్రవేశించడానికి, వారు చతుర్దిశల్లోనూ మేదినీ గర్భాన్ని పెళ్ళగించినపుడు, దిశకొకటి చొప్పున నాలుగు వృత్తాలున్నాయి. అక్కడి పద్యాల ప్రారంభాలివి:

'గుములుగఁ దూర్పుదిక్కుఁబడి గ్రొచ్చుచున్-' (అహల్యా. ౩౩౨)
'గుములుగఁ దక్షిణంపు దిశఁ గ్రొచ్చుచున్-' (పై. ౩౩౪)
'గుములుగఁ బశ్చిమమ్ము దెసఁ గ్రొచ్చుచున్-' (పై. ౩౩౬)
'గుములుగఁ నుత్తరంబు దిశ గ్రొచ్చికొంచు-' (పై. ౩౩౮)

ఇది చంపకమాలా వృత్తంగా భ్రమింపజేస్తూ, చివరి గణాల వద్ద ఆ లక్షణభంగం పొందింది. న-జ-భ-జ- వరకు చంపకమాలే. తర్వాతి 'ర-గ'లు ఛందోభంగకారకాలు. ఈ గతి ఆశాభంగసూచకంగా వుంది. సగరుల ప్రయత్నంలో వున్న తీవ్రత, సాధించగలమనే ఆశాహేతువుగా వుంది అయితే వారి ప్రయత్నం ఏ దిశలోనూ ఫలించలేదు. మేధాశ్వాన్ని కనుక్కోవాలనే వారి ప్రయత్నం విఫలమైంది ఆ వైఫల్యాన్ని ఈ వృత్తగతి సూచిస్తూంది.

నాలుగు పద్యాల్లోనూ ప్రాసాక్షర మొకటిగానే వుంది, వారి ప్రయత్న తీవ్రత అన్ని దిశల్లోనూ ఒకటిగానే వుందని, ఎక్కడా వారి పట్టుదల సడలిపోలేదనీ భావింపచేస్తూంది.

'మేదిని అంటే భూమి' భూమిని త్రవ్వే విషయం దాని పర్యాయపదమైన మేదినీ నామం కల్గిన వృత్తంలో చెప్పటం చమత్కారం.

---

* ఇది అష్టిచ్ఛందోపజనితమైన వృత్తం. పాదానికి 16 అక్షరాలు. గణాలు: న-జ-భ-జ-ర-గ. యతిస్థానం: 11వ అక్షరం. ప్రాస నియమముంది.

# స్రగ్ధర*

'వీరస్య భుజదండానాం వర్ణనే స్రగ్ధరా భవేత్' అని కాత్యాయనుడు పేర్కొన్నాడు. వీరుని భుజదండాల్ని వర్ణించటాని కీవృత్త ముచితమని అతని సూచన.

నానాదైవత్యముల్ పన్నగములు ఖగముల్ నాకరాజాది దేవ
శ్రేణి ప్రీత్యర్థమై కూర్చిరి ద్విజుల్ పశుశ్రేణులన్ రమ్యయూప
శ్రేణిన్ మేధీయమై పొల్చిన తురగము రాజిల్లె యాదోమహార
ణ్యాసీ సంభూతముల్ గ్రామ్యములును దబుచై యాగమోక్తంబుగాఁగన్.
(ఇష్టి. 362.)

ఇది అశ్వమేధ యజ్ఞ సంభార వర్ణన. దిగ్విజయంతో తిరిగి వచ్చిన మేధాశ్వం పరోక్షంగా వీరుని భుజదండ విక్రమాన్ని చాటుతూంది కాత్యాయనోక్తి ప్రకారం ఈ సందర్భంలో ఈ వృత్తప్రయోగముచితం. అక్కడి యూపస్తంభాది సంభారాలు గంభీరమైన ఆగమోక్త విషయాలను సూచిస్తున్నాయి. పైగా అవన్నీ 'సుమమాలా' శోభితాలై (359) వున్నాయి. సుమాలు దాల్చిన వానిని గురించి గంభీరగమనం గల 'స్రగ్ధర'లో చెప్పటం సమంజసంగా వుంది. స్రక్ + ధర = పూలు దాల్చినదనే అర్థంలో ఇది చమత్కారం.

---

* ఇది ప్రకృతిచ్ఛందో జనితమైన వృత్తం. పాదానికి 21 అక్షరాలు
గణాలు: మ-ర-భ-న-య-య.
యతిస్థానాలు: 8వ, 15వ అక్షరాలు.
ప్రాస నియమముంది.

# తన్వి*

బాలకాండలో ఈ వృత్తం మూడు చోట్ల వుంది. వీటిలో రెండు పట్టమహిషుల మేధాశ్వపరిచర్య గురించి చెప్పడానికి, ఒకటి రామునికి స్త్రీలు పాడిన జోలపాట గురించి ప్రయుక్తమయ్యాయి.

జో! కమలా చారు వదన కమలా చూర్ణ కపోల
వికచ నఖ! జోజో!
జో! కరుణాపాంగ కలిత తరుణాజూ వినివారణ
మధునిధి! జోజో!
జో! కృతనాకేశ్వరతత పృతనాజ్యోతి రమోఘ
కరణతను! జోజో!
జో! కుటిలారాతి హరిణజటిలాచ్ఛోదస కార్ముక
పటుకర! జోజో! (అవతార. 297.)

ఇది శ్రీరామునికి వనితలు పాడిన జోల. గుర్వక్షరాలుండాల్సిన స్థానంలో దీర్ఘాక్షరాలుండి, ఈ పద్యం గేయంలాగా గానానుకూలత సంతరించుకుంది. ప్రారంభంలో 'జో' అని అంతలో 'జోజో' అని ప్రతి పాదంలోనూ వుండటం చేత 'ఇది జోలపాటే' ననుకునేట్లుగా వుందీ పద్యం. మధ్య నున్న దీర్ఘసమాసాలు పరమేశ్వర ప్రాభవాన్ని ప్రస్తుతించేవిగా వున్నాయి. బాలరూపుడైన నాయకుని జోలపాటలో స్తుతించటం సమంజసమే.

ఈ పద్యపు నడక చతుర్మాత్రాకమైన మధురగతి రగడకు సన్నిహితంగా వుంది.

జోకమ-లాచా-రువదన-కమలా-చూర్ణక-పోలవి-కచనఖ-జోజో - ఈ విభజనతో ఇది మధురగతి రగడ అవుతుంది.

---

* ఇది సంస్కృతిచ్ఛందో జనితమైన వృత్తం. పాదానికి 24 అక్షరాలు.
గణాలు: భ-త-న-స-భ-భ-న-య.
యతి స్థానం: 13వ అక్షరం. ప్రాస నియమముంది.

# కర్ణాట చతుష్పద *

తెలుగులో వున్న మూడు రకాల చతుష్పదలలో ఇది ఒకటి. నాలుగు పాదాలున్నది కనుక చతుష్పద.[22]

లలితునిం జేసితిమి లోభ పెట్టితిమి
కొలకొలం జేసితిమి క్రోధ పెట్టితిమి.
తలఁకు పొందడు మునియుఁ దపసుమానఁడును
జిలుకైన వృజినంబు జేరదా మునిని.

ఆతఁడేయది కోరు నది యీయమేని
భూతములు లోకములుఁ ద్రుంగిపోయెడును
ఆతఁడే సురలోక మర్థించెనేని
జేతిలోఁ బెట్టినను సేగి లేదెందు.

నాశమగుదు మటంచు నట్టాటలేదు
కౌశికుఁడు లోకమును గాల్చివేసెడిని
ఈశ! జగదీశ! పరమేశ! సర్వేశ!
కౌశికుండడిగినది గాని యిప్పించు. (ధను. 246, 47, 48)

కౌశికుని తపోఽగ్నిని తాళలేక దేవతలు బ్రహ్మకుచేసిన వినతి ఇది.

బ్రహర్షి పదవి సాధించాలని పరమదీక్షతో తపస్సు చేసే విశ్వామిత్రుడిని ఆదినుండీ ఆటంక పరంపర కష్టపెడుతూ వుంది. మేనకా, రంభలను పంపి కాముకతనీ, క్రోధాన్ని రెచ్చగొట్టి అతడి తపస్సుకు భంగం కలిగించారు, దేవతలు. చివరకు ప్రాశన సమయంలో కూడా ఇంద్రుడతణ్ణి పరీక్షకు గురి చేశాడు. ఇలా 'లలితుడై' మేనక వెంటపడినా, రంభపట్ల 'క్రోధం' చూపినా

---

* ఇది మాత్రా ఛందస్సు. పాదానికి పంచమాత్రాగణాలు. 3 + 1 సూర్య గణముంటాయి యతిస్థానం: 4 వ గణాద్యక్షరం. ప్రాస నియమముంది.

అతని పట్టుదల వదలలేదు. దేవతల ప్రయత్నాలు తొలుత కౌశికుని తపోభంగ కార్యంలో విజయం సాధించినా, తుది గెలుపు అతడిదే అయింది. ఈ విష యాన్ని పద్యనిర్మాణం సూచిస్తూంది ప్రథమ పద్యం ఆరోహ ణావరోహణా త్మకగతుల్లో నడిచింది.

లలితునిం ...... పెట్టితిమి
కొలకొలం ...... పెట్టితిమి
తలకు పొం ...... మానడును
జిలుకైన ...... దా మునిని

పద్య ప్రారంభాంతా లిలా వున్నాయి. ప్రతి పాదారంభంలోవున్న పంచ మాత్రకగణం మూడు లఘువులు + ఒక గురువుచేత ఆరోహణాత్మకం కావటం, పాదాంతంలో ఒక లఘువు + మూడు గురువులు వుండి, అవరోహణాత్మకం కావటం జరిగింది.

దేవతల ప్రయత్న తీవ్రతను ఆరోహణగతిలోనూ, అవి ఫలించక భగ్నం కావడమన్న అర్థాన్ని అవరోహణగతిలోనూ పద్యం సూచిస్తూంది. 'మేమెంత యత్నించినా మావల్ల కాలే' దనే అర్థాన్ని పద్యమే కాక, తన్నిర్మాణం కూడా సూచించటం శిల్పం.

రెండవ పద్యం 'అతడే యదికోరు' అని నిర్దేశ సర్వనామంతో ప్రారం భించబడి పైె చెప్పబడ్డ తీవ్రతపోమూర్తి అని ప్రసిద్ధార్థ కల్పన చేస్తూంది.

కౌశికుని తపస్తీవ్రతకు దక్కిన పరమ ప్రశంస మూడోపద్యం. 'అతడి తపస్సు మమ్మల్ని దహించేమాట నిజమే అయినా మేం నాశనమై పోతామనే భయంతో కోరటంలేదు. అటువైపున లోకాలు కాలిపోతున్నాయి. అతడడిగిన దిప్పించు' అన్న మాటల్లో లోకాలపట్ల దేవతలకున్న కారుణ్యదృష్టి సూచిత మయింది. బ్రహ్మను 'ఈశ' ఇత్యాదిగా నాలుగు సంబోధనలతో పిలవటంలో దేవతల ఉద్రిక్తత ప్రకటితమయింది. అప్పుడైన వాడిని సహాయమర్థించినపుడు పదేపదే పిలిచి చెప్పటం సహజం. ఆ మనస్తత్త్వానికిది సూచకం. ఇక్కడ ఒక

చమత్కారం కూడా వుంది. బ్రహ్మకు చతుర్ముఖాలు. కనుక నాలుగు సంబోధనలు. ఈ పద్యంలోని 'అఱ్ఱాట' అనే మాటలోని ద్విత్వ శకటరేఫ ఉచ్చారణతో కంపితమై 'మా ప్రాణాలకై మేము కక్కుర్తి పడటంలేదు. మా రక్షకై వెంపరలాడటం లేదు' ఇత్యాది భావాల్ని అభినయిస్తూంది. ఇక్కడి మూడు (పద్యాల) సంఖ్య త్రిదశుల కోరికలోని త్రికరణశుద్ధిని భావింపజేస్తూంది.

కళ్యాణ ఖండంలో మరొక కర్ణాటక చతుష్పద వుంది.

మునువశిష్ఠులు వెన్క మొగిడి రాఘవుడు
ముని కౌశికులు వెన్క మొగిడి లక్ష్మణుడు
ముని యుధాజిత్తు వెన్ మొగిడి భరతుండు
మునికొడుకు వెనుకగా మును దశరథుండు (కళ్యాణ 63.)

ఈ పద్యంలో ఆదిప్రాస మాత్రమేకాక రెండు పాదాల కొక అంత్యప్రాస కూడా పాటించబడింది.

# మధ్యాక్కర*

మరుగున పడిపోయిన ఈ వృత్తాన్ని విశ్వనాథ నిద్రలేపి, కదనుతొక్కి నడిచేట్టు చేశాడు. ఈ పద్యలక్షణంలో వున్న వాక్యనిర్మాణ ధోరణిచేత, సంభాషణల కనుకూలించే వృత్తమిది.

బాలకాండలో మధ్యాక్కర వృత్తం క్రింది సందర్భాలలో ప్రయుక్తమయింది. మొత్తం 24 పద్యాలు.

1. దేవతలు విష్ణువు వద్దకు వెళ్లి రాక్షసులవల్ల తాము పొందుతున్న బాధల గురించి చెప్పుకోవడం. (అవతార. 47)
2. తాను దశరథనందనునిగా అవతరించి రావణ సంహారం చేస్తానని విష్ణువు అభయ మివ్వడం. (అవతార. 102)
3. సర్వదైత్య సంహారానికి విష్ణువు మాట ఇవ్వడం. (అవతార. 103)
4. జనకసభలో పరశురాముని రాకకు సూచనగా ధనురుగ్రరావం వినిపించడం. (ధను. 388)
5. శివధనుర్భంగకర్త 'ఎవడ'ని పరశురాముడు పరుషభాషణ చేయడం. (ధను. 409)
6. శివకార్ముకచ్ఛేత్త 'నే' నని రాముడు పరశురామునితో చెప్పడం (ధను. 415)
7. తానెలా విల్లువిరిచిందీ పరశురామునికి రాముడు చెప్పడం (ధను. 420)
8. పరశురాముని శాంతించుమని దశరథుడు వేడుకోవడం (ధను. 426)
9. పరశురాముని వశిష్ఠుడు వేడుకోవడం (ధను. 428)

---

* ఇది పంచవిధాక్కరలలో ఒకటి. లక్షణం : పాదానికి 2 ఇంద్ర గణాలు + 1 సూర్యగణం + 2ఇంద్రగణాలు + 1 సూర్యగణం చొప్పున నాలుగు పాదాలుంటాయి. ప్రతిపాదంలోనూ నాల్గవ గణాద్యక్షరం యతి. ప్రాస నియమముంది.

10. పరశురాముని జనకుడు వేడుకోవడం (ధను. 430)
11. పరశురాముని లక్ష్మణుడు ప్రార్థించడం (ధను. 432)
12. పరశురాముడు వైష్ణవ ధనుఃప్రాశస్త్యాన్ని గురించి చెప్పడం. (ధను. 436)
13. హరిహరుల శక్తిభేదం తెలియక బ్రహ్మ వారిద్దరికీ వైరం కల్పించడం. (ధను. 438)
14. కార్తవీర్యార్జునుని సంహరించిన పరశురాముని తల్లి కీర్తించడం, తండ్రి 'తప్ప'నడం. (ధను. 464)
15. జమదగ్నిని కార్తవీర్యులు చంపగా రేణుక విలపించడం (ధను. 469)
16. పరశురాముని కర్మ 'లోకాద్భుత'మని రాముడు ప్రశంసించడం. (ధను. 475)
17. పరశురాముడు వైష్ణవ ధనుస్సు నివ్వడం (ధను. 478)
18. పరశురాముడిపై రాముడు బాణం సంధించడం (ధను. 486)
19. 'నీ పాదాలు కొట్టనా? తపో లోకాలు కొట్టనా?' అని పరశురాముని రాముడడగడం (ధను. 487).
20. తపోలోకాల్ని కొట్టుమని పరశురాముడు రామునికి చెప్పడం (ధను. 491)
21. రాముడు బాణం వదలగానే పరశురాముడు మహేంద్ర పర్వతానికి కదలడం. (ధను. 498)
22. గండం గడిచిందని రాముని దశరథుడు ముద్దాడడం (ధను. 497)
23. క్షత్రియలోక మర్యాద నిల్పావని రాముని రాజలోకం కీర్తించడం. (ధను. 501)
24. మనసు తేలికపడిన దశరథుని చిత్రణ. (కళ్యాణ. 2)

ఈ 24 పద్యాలలో కేవలం నాలుగు మాత్రం (4,17,18,24 సంఖ్యగలవి) విషయాన్ని వర్ణించేవి. తక్కిన ఇరవై పద్యాలు సంభాషణాత్మకాలు. ఈ విభజన చేత స్పష్టమవుతున్న విషమేమిటంటే - మధ్యాక్కర వృత్తం సంభాషణలకు ఉచితంగా వుంటుందని కవి నిష్కర్ష.

ప్రమథులు కైలాసనాథ పాదసంబంధ మస్తకులు
ప్రమథులు కోపప్రభావ పాటిత స్వర్గ్యమస్తకులు
ప్రమథులచేత నాః ప్రకటరావమ్ము పల్కించినట్టి
యిముడజాలని క్షత్రి బంధువెవడురా? యెవడురా వాడు? (ధను. 409)

ఇది భార్గవరాముని క్రోధం. ప్రారంభ గణంగా సర్వ లఘు గణమైన నలము. ద్రుతగతి సూచకంగా నిలిచింది. 'ప్రమథ' శబ్దం మాటిమాటికీ వస్తూ పరశురాముడి కోప హేతువును వ్యంజిస్తూంది. 'ప్రమథుల చేత నాః ప్రకట రావం' వెలువరింప చేయడమే రాముడు చేసిన మహాదోషమని పరశురాముడి తీర్పు. కైలాస నాథుడన్నా, ప్రమథ గణమన్నా అతనికి చెప్పరానంత భక్తి, గౌరవాలున్నాయి. అంతటివారినే క్షోభపరిచిన వాడెవడని అతనికి కోపం. పద్యంలో 'అః' అన్న విసర్గాక్షరం ఓజస్సును కలిగిస్తూంది. 'ఎవడురా' అన్న ప్రశ్న ద్విరుక్తం కావడంచేత పాత్ర మనసులో పొంగే క్రోధం మాటలో బయల్పడింది. ప్రతి పాదంలోనూ నాల్గవ, అయిదవ గణాద్యక్షరాలను రెంటినీ యతులుగా పాటించడం గమనించదగింది. దీనిచేత శ్రవణంలో ఒక మాధుర్యం కలుగుతూంది. వాక్య విన్యాసం అందగిస్తుంది. 'ఇముడజాలని' అన్న మాటలో ఒక్కొక్క అక్షరాన్ని విడివిడిగా పలికినపుడు అక్కడి పాత్రక్రోధం వ్యంజిత మవుతూంది.

ఎవ్వడు ప్రమథులనేత హేరంబు ప్రీకారియయ్యె
నెవ్వని కతమున స్వామి దృక్తతి యింతగా విచ్చె
నెవ్వడు శివఫాల విధృతి హేతువైయెగసెనో వాడు
క్రొవ్వి శివద్రోహ పథము కొన్నట్టి కోడిడు నేను (ధను. 415)

ఇది శ్రీరాముని సమాధానం. ప్రారంభంలోనే భగణం వుండి పద్యపు నడకలో అవరోహణాత్మక విలంబితగతి హేతువవుతూంది. ప్రాస స్థానంలో వున్న ద్విత్వాక్షరంచేత వక్త వాగ్విధానంలో నెమ్మదితనం భావించబడుతుంది. పద్యంలో శ్రీరాముడి వినయం కనిపిస్తుంది. 'నేను' అన్న మాటను ఓవరిదాకా నొక్కిపట్టి చివరగా హఠాత్తుగా చెప్పటం సొగసు.

చేతిలో బూని జ్యాకోటి చెందింప చెట్టంత విల్లు
చేతిలో నాదుగునాః లక్ష్యసిద్ధి కజిహ్మగమెత్తు
చేతీరుః మంజూషనే రహించిన యీ పెద్దవిల్లు
చేత లాగితిని కాబోలు చేతిలో ఛిన్నమై విఱిగె (ధను. 420)

రాముడు పరశురామునితో అన్నమాటలివి. శివధనుస్సు చేతిలో ఒదిగేంత చిన్నదాః అన్న భావాన్ని ఒక పాదంలో ఒదగని వాక్యంచేత సాధించబడింది. ఈ ప్రశ్నలో గుర్వక్షరాలధికంగా వుండి, ధనువుయొక్క గురుత్వాన్ని వ్యంజిస్తున్నాయి.

# మంగళ మహాశ్రీ*

ఇది లయగ్రాహిలాగ లయప్రధానమైన వృత్తం. ఈ రెంటికీ పాదాంత గణంలో కొంత భేదముంది. రెంటిలోనూ ఖండగతి వినిపిస్తుంది. ఒక గురువు వెంట మూడు లఘువుల ఆవృత్తితో నడిచే ఈ వృత్తం ఆరోహణాత్మక అవరోహణగతిలో వుంది. సంస్కృత లాక్షణికులెవరూ ఈ వృత్తం గురించి చెప్పనందున ఇది దేశీయ ఛందంగా భావింపదగి వుందని, మార్గచ్ఛందమనే గౌరవం కల్పించటం కోసం దేశీయ లాక్షణికులు దీనిని అక్షరచ్ఛందంగా మార్చివుంటారని, పాటిబండవారు ఊహ చేశారు.[23] దేశీయ ఛందాల్లో కనిపించే లయబద్ధత ఇందులో వుండటం ఈ ఊహకు భూమిక.

ఈ వృత్తనామాన్ని బట్టి, మంగళాంతంగా ప్రయోగింప నిర్దేశించబడినట్లు తెలుస్తుంది. గతిలో వున్న మాధుర్యదృష్ట్యా దీనిని ప్రశాంత మధురభావాలను చెప్పటానికి ప్రయోగించటముచితం.

బాలకాండలో విశ్వనాథ ఒకే ఒక్క మంగళ మహాశ్రీవృత్తాన్ని ప్రయోగించాడు. రామునకు స్త్రీలు పాడినజోల ఈ వృత్తంలో రచింపబడింది.

పొత్తులను సందములు బొత్తులిడినట్టు
గొలపొత్తివలె నొత్తిగిలు జోజో!
గుత్తులుగ ప్రాకి చని కొత్తళము ప్రేలు
సరికొత్తలగు ద్రాక్షవగు స్వామీ!
చిత్తునకు సత్తునకు జిత్తులగు బోకులకు
జిత్తులమరించగల సామీ!
ఒత్తిగిలి పండుకొను ముత్తకలి యేడుపుల
నొత్తుగను నెత్తకుము జోజో! (అవతార 398.)

---

* ఇది ఉత్కృతిచ్ఛందోజనితం. పాదానికి 26 అక్షరాలు. భ-జ-స-న-భ-జ-స-న-గగ - ఇవి గణాలు. 9 వ, 17 వ అక్షరాలు యతిస్థానాలు. ప్రాస నియమముంది.

పద్యమంతటా ద్విత్వ 'త' కారం మెత్తగా హత్తుకుంటూంది. పసి పాపల నిద్రబుచ్చేటపుడు జోలపాడుతూ వారిని మెత్తగా తట్టడం సామాన్య విషయం. ఆ జోకొట్టడం పదేపదే వచ్చే 'త' కార ప్రాస చేస్తున్న సూచన. పాదాంతాన దీర్ఘాక్షరాలు వుండి, రాగాలాపనకు వీలు కలిగిస్తూ, పాట రూపాన్ని పద్యానికిస్తున్నాయి. తొలి పాదాంతంలో వున్న 'జోజో', పద్యం ముగింపులో మరీ 'జోజో' అని పునరుక్తమై బాలుని నిద్రపుచ్చే జోల సొగసును తలపిస్తూంది. పసిబాలుడుగా అవతరించిన పరమేశ్వరునికి పాడిన జోలను మంగళంగా భావించి, మధురమైన ఈ పాటను తద్భావానుకూలగమనం గల మంగళ మహాశ్రీలో నిబద్ధించి, అనుప్రాసలచేత లాలించటం ఒక సొగసు.

# శార్దూలం*

పాదానికి 19 అక్షరాలుండి, అందులో 11 గుర్వక్షరాలే కావటం చేత విలంబిత గతిలో నడిచే వృత్తంగా దీన్ని చెప్పవచ్చు. పాదారంభంలో మగణముండి ఆరోహణగతినీ, అంతంలో తగణద్వయముండి అవరోహణ గతినీ కల్గిస్తున్నాయి. కనుక ఇది ఆరోహణాత్మకమైన విలంబనగతిలో వుంది.

తెలుగు భాషలో ఈ వృత్తానికి తక్కువ ప్రయోగముండటానికి కారణం శ్రీ పాటిబండవారు చెప్పినట్లు దానిలోని గుర్వక్షర బాహుళ్యమూ, ఓజో మయత్వమూ, లలితలలితంగా నడిచే పద్యాల్ని ఆదరించే ఆంధ్రుల మనస్సు దీర్ఘ సమాసాలతో ఫెళఫెళలాడే శార్దూలం వంటి వృత్తాల్ని అంతగా సహించలేదు. పైగా తెలుగులో గుర్వక్షర బాహుళ్యం వున్న పదాలు సకృత్తు. 'కాహళ సంధించినట్లు'24 చిట్టిపొట్టి పదాలతో నడిచే తెలుగు పద్యాలకు శార్దూలంలోని ఓజస్సు కుదరదు. అంచేత, ఇతర వృత్తాలతో పోల్చిచూస్తే శార్దూలానికి తెలుగులో తక్కువ ప్రయోగముండటానికి కారణమిది.

ఈ వృత్త ప్రయోగం గురించి క్షేమేంద్రుని అభిప్రాయం ఇలా వుంది:

పాదాదిలోని 'గుర్వక్షరాలు' 'ఆ' కారంతో వుండి, పాదాంతంలో విసర్గ వుంటే, అది ఊర్జిత తేజోజీవితం కలిగి వుంటుంది. అలాకాక పాదాంతంలోని విసర్గలు 'ఓ'కారంతో వుంటే, శార్దూలం కుంటినడక నడుస్తుంది. దీనివల్ల విలంబనమే తప్ప ఓజస్సు కనబడదు. పూర్వపాద ద్వయంలో వ్యస్తపదాలు, పాదాంత

---

* ఇది అతిధృతిచ్ఛందోజనితమైన వృత్తం. పాదానికి 19 అక్షరాలు. గణాలు : మ-స-జ-స-త-త-గ. యతిస్థానం : 13 వ అక్షరం. ప్రాస నియమముంది.

విరామం వుండాలి ఉత్తర పాదద్వయంలో క్రమవర్ధమాన విరామ విలంబనం వుండాలి. తృతీయ చతుర్థ పాదాలు సంశ్లిష్టంగా వుండాలి. ఇలావుంటే శార్దూలం శోభిస్తుంది. క్రమవర్ధమానమైన గాఢబంధంలో నడిచే శార్దూల వృత్తం వీర రౌద్రాదులకు ఉచితంగా వుంటుంది.[25]

బాలకాండలో శార్దూల ప్రసక్తి తేగానే మొదటగా స్ఫురించేది ధనుర్భంగ ఘట్టం.

> నిష్టావర్షద మోఘ మేఘపటలీ నిర్గచ్ఛదుద్యోదిత
> స్ఫేష్మేరమ్మద మాలికా యుగపదుజ్జృంభన్మహా హోరబం
> హిష్ఠ స్ఫూర్జథు షండ మండిత రవాహీన క్రియా ప్రౌఢిద్రా
> ఘిష్ఠంబై యొకరావమంతట నెసంగెన్ ఛిన్న చాపంబునన్ (ధను. 308)

ఇక్కడ ప్రాసాక్షరమైన 'ష్ఠ' కారం ఊష్మ మూర్ధన్యోచ్చారణలచేత ధనుస్సుయొక్క పెళుసుదనాన్ని భావింప చేస్తూంది. (మూర్ధన్యాక్షరమైన 'ఠ' కారం ఊష్మాక్షరోచ్చారణ ('ష')ను భంజిస్తూంది!) పాదాంతాల్లోని 'ఉద్యోతిత-స్ఫేష్మేరమ్మద' అన్నచోట 'త'కారం చేత 'స'కారం మీద నొక్కుబడి, బంహిష్ఠ అన్నచోట 'హ'కారానికి ముందు బిందువుండి, విసర్గోచ్చారణ కలుగుతూంది. ఈ పాదాంత విసర్గస్ఫురణ చేత పద్యానికి క్షేమేంద్రు డాశించిన ఓజోరూపం వస్తూంది. నాల్గవపాదందాకా నిరాటంకంగా సాగిన దీర్ఘ సమాసం ద్రాఘిష్ఠధ్వని సూచకంగా వుంది. ఇక్కడి పద్యాలైనా శార్దూల వృత్తాల్లో సంశ్లిష్ట సమాసాల్లోనే సాగాయి. అక్కడి భీకరధ్వని నీ రీతిలో చెప్పినప్పుడున్న ఔచిత్యం మధురశబ్ద సంయోజనంలో లేదు. అలాచేస్తే గౌతమరావుగారన్నట్టు మీసాలు లేని భీమపాత్ర లాగా అసమంజసంగా వుంటుంది.[26]

> 'ఎన్నన్ నీవు జటాయువా, సఖుడ రారా యెన్నొ రెన్నాళ్ళకీ
> నన్నున్ లోన దలంచినావు.' (కిష్కి. 344)

> 'మీ యారోగ్యము చూచుకోవలెనయా! మీ తండ్రి కిష్టంబుతో
> నాయెంబో మిము బంప నన్నుబడి' (అహల్య. 265)

ఆ శార్దూలమేనా ఇంత మార్దవ శాబకంలా మారిపోయిందీ అనిపించే రచన ఇది. పాదంలో మాటిమాటికీ విరామం వుండటంచేత, సమాసక్లిష్టత, అన్వయక్లేశం లేకపోవటం చేత, ఈ వృత్త స్వభావమైన ఓజోగుణ స్థానంలో ప్రసాదగుణం ప్రాపించింది. 'ఎన్నాళ్ళ కెన్నాళ్ళ' కన్నది తెలుగు పలుకుబడి. మహారాజు మాటలు కనుక శార్దూల వృత్తమూ, మాటాడింది మిత్రునితో కనుక మృదురచనా. రెండో పద్యంలోనూ అంతే. మహాతీవ్ర స్వభావుడైన కౌశికుడు శార్దూల సదృశుడు. అతని మాటల ధోరణి శార్దూల భీకరమే అయినా, రాముని వద్ద ప్రవర్తిల్లే మనసు మాత్రం కౌముదీ శీతలమే. ఆ విషయాన్ని ఈ శార్దూలం లోని సరళపద్యం ధ్వనిస్తూంది.

భిస్సాధాత్రివటే పితాళ్ళకును గంభీరాంబుమూర్తీ! మహై
నస్సంహారిణి! త్వత్కృపీట నిచయాంతర్లీన నైస్త్రింశికా
ర్చిస్సుల్ మాకును రక్షగా నిలుపవే శ్రీవారి! నీ దివ్య పా
థస్సమ్మేధిత దేహయష్టులుగా సంధానింపవే పావనీ! (అహల్య. 273.)

పాదాదిలో మహాప్రాణాక్షరమైన 'భ' వుండి, యతిస్థానంలో 'భీ' అని ఒక్కో మహాప్రాణాక్షరమే వుండటంచేత పద్యం సాంద్రమవుతూంది. ఇది గంగా స్తుతి. చేసినవారు మహర్షిసంఘం. మహర్షుల వాక్కులు నిరంతర నిగమో చ్చారణచేత పరమ సంస్కృతాలు. ఈ పద్యమంతటా సంస్కృతపద ధ్వనులే వుండి ఋషుల వాగ్వైఖరిని వ్యంజిస్తున్నాయి. ప్రాసాక్షరంలోని ద్విత్వ 'స' కారం విసర్గోచ్చారణ కలిగిస్తూ పద్యంలో ఓజో రూపాన్ని తోపింపచేస్తూంది. 'శౌర్యస్తవం'లో శార్దూలం ముచితమని చెప్పబడింది.[27] భక్తునికి భగవచ్ఛక్తే శౌర్యం. దాన్ని స్తుతించడమే శౌర్యస్తవం. 'మహైనస్సంహారిణి' అయిన భాగీ రథీ స్తుతి తచ్ఛౌర్యస్తవమే. కనుక, ఇక్కడి శార్దూల ప్రయోగ మౌచిత్యశోభితం.

అడంజూడగఁ జూడ నాడగను వారన్యోఽన్య నేత్రాంతర
క్రీడాదర్పణ దృశ్యమానము లసంఖ్యేయాత్మరూపంబులన్
వ్రీడాముగ్ధములన్ వినిశ్చల దృగావిర్భూత రోచిస్సులన్
గూడన్ దోరణబద్ధమాలలఁ గనన్ గూలంకషప్రేములై (కళ్యాణ. 285.

సీతారాముల శృంగార జీవనమిది కళ్యాణానంతరం శ్రీరాములిలో వైరాగ్యరేఖలు పొడసూపాయి. ప్రతిదృశ్యమూ అతనిలోని విరాగిని నిద్రలేపింది. సీత ఈ హఠాత్పరిణామానికి క్రుంగిపోయింది. 'సహజంగానే నీకిష్టంలేకుంటే చెప్పు, నన్నెందుకిలా బాధిస్తావు' (263) అంది. ఈ వైరాగ్య స్థితినుంచి సమస్థిని అల వడడానికి శ్రీరాముడికి వశిష్ఠగీత తోడ్పడింది. ఆ తర్వాత మామూలుగా సరస సల్లాపాలతో సీతతో జీవితం సాగింది. ఆ స్థితి వర్ణన ఈ పద్యం. సీతారాములు దైహికంగా ఇద్దరైనా, మానసికంగా ఒక్కరే. ఇద్దరి ప్రేమకలాపాలను ఒకే పద్యంలో చెప్పటం ఈ విషయాన్ని రమణీయంగా వ్యంజిస్తూంది. నిర్మాణరీత్యా ఈ పద్యం 'నలదమయంతు లిద్దరు' అనే పద్యాన్ని పోలివుంది [28]

ఇష్టి ఖండంలో ఋశ్యశృంగర్షి అయోధ్యకు అశ్వమేధ నిమిత్తం వచ్చే వేళ వరుసగా ఆరు శార్దూల వృత్తాల్లో (240 నుండి 245 దాకా) చెప్పబడింది. మహామహిమాన్వితుడు, శాంతుడు అయిన ఋషి ఆగమనం గురించి రఈ వృత్తంలో శాంత గతిలో చెప్పటం చిత్రం

రామజననవేళ 'వర్షస్వాంబులు' కురవటం (2-228) రాత్రంతా రామ లక్ష్మణులు 'గాధిసూతి కథానకము'లతో పొద్దు పుచ్చడం (3-105), జనక సభలో విరుచుకుపడిన పరశురామ పరుషోక్తులు (4-398, 99, 400) 'దేహ మనన్ విచిత్రమగు దుఃఖారామమని రాముడనడం (5-118), సీతారామ కళ్యాణా నంతరం ప్రకృతి వర్ణన (5-253, 254, 258) ఇత్యాది ముఖ్య సన్నివేశాలు ఈ వృత్తంలోనే ప్రయుక్తమయ్యాయి.

# ఉత్పలమాల*

అతి ప్రసిద్ధమైన వృత్తాల్లో ఇదొకటి. సంస్కృత ఛందమే అయినా దీనికి ఆ భాషలోకంటె తెలుగులోనే ప్రయోగాలెక్కువ. నాట్యశాస్త్రంలో 'ఉత్పలమాలిక' అని ఒక వృత్తం పేర్కొనబడింది ప్రస్తుత వృత్తంతో నామ సామ్యం మాత్రమున్న ఈ వృత్తానికి గణసామ్యం లేదు.[29]

ప్రస్తుత వృత్తానికి పాదానికి ఇరవై అక్షరాలుండి, అందులో ఎనిమిది గురువులు, పన్రెండు లఘువులు వున్నాయి. ప్రతి పాదానికీ మూడు భగణాలుండి అవరోహణగతి సూచకంగా వున్నాయి. దీనివల్ల వృత్తగతి అటు ద్రుతమూ, ఇటు విలంబితమూ కాని మధ్యగతిలో నడుస్తూంది. సుఖదుఃఖ సమన్వయం పొందిన ప్రశాంత చిత్తరీతిని వర్ణించటానికీ వృత్తముచితంగా వుంటుంది.

రాముఁడు నాకు స్నానమగు రాముఁడు నాకు జపంబు ధ్యానమున్
రాముఁడె యెల్ల నా బ్రతుకు రాముఁడు నన్నును గన్నతండ్రి యీ
రాము వినా నిమేషమవురా! మనజాలను గాదయేని నీ
రాముని పీడి యీ యఖిలరాజ్యము గాధిసుతా, గ్రహింపవే! (అహల్యా. 313)

దశరథుడు కౌశికుడితో పల్కిన పల్కులివి. యజ్ఞరక్షణ నిమిత్తం రాముని తోడు కోరాడు కౌశికుడు. 'నేను పంపలేను నా కతడిష్టం' అని దశరథుడిలా అన్నాడు. పద్యమంతటా రామనామం ప్రతిధ్వనిస్తూంది. శ్రీరాము నంటే దశరథునికి చెప్పరానంత ప్రేమ. దశరథుడు వేదాంతి. వేదాంతికి జపతపాలమీదే మనసు. అందుకే అతడి మాటల్లో స్నానం, జపం, ధ్యానం అనే పదాలు వచ్చాయి. రాముడే తనకు జపమూ, తపమూ అన్నీ. 'రాము వినా నిమేష

---

* ఇది కృతిచ్ఛందోజనితమైన వృత్తం. పాదానికి 20 అక్షరాలు. గణాలు: భ-ర-న-భ-భ-ర-వ. యతిస్థానం: 10 వ అక్షరం. ప్రాస నియమముంది.

మవురా మనజాలను' అన్నపుడు యతి స్థానంలో రామశబ్దం వచ్చింది. దశరథుని మనసులో రామునిపట్ల తీవ్రమైన వాత్సల్యం వున్నందున అప్రయత్నంగానే అతడి మాటల్లో రామశబ్దం పలుకుతూంది.

> ఇంకొక వేయి యేండ్లు ప్రభు! యే నినుగూర్చి తపింతుఁ గాని నీ
> వింకకు సౌరవారి; విడువే! యది యెంత ప్రయాసమయ్యెనా
> వంకకు రాఁగ నీ సురలవంక! తరంబులు నాల్గు మేము ని
> ట్టింకులు నింకినాము ప్రభు! యీ నది కంచుఁ బితాళ్ళ కోసమై
>
> (అహల్యా. 402)

ఇది భగీరథుడి దైన్యం. గంగా ప్రవాహాన్ని ఆపోశనం పట్టిన జహ్నుముని పాదాలపై వ్రాలిన భగీరథుడి వేడుకోలు. ప్రతి పాదమూ ఇంచు మించు సగానికి విరిగిపోతూంది. దుఃఖం ముసురుకున్న కంఠం మాటమాటకూ తడబడుతుంది. ఇక్కడ 'ప్రభు!', 'విడువే', 'సురలవంక' ఇలాంటి మాటలతర్వాత కనిపించే విరామం అదే. ఇంకో వేయేళ్ళు నీకై తపిస్తాననడంలో భగీరథుడి దైన్యం కనిపిస్తూంది. 'ఇట్టింకులు' అన్న మాటలోని తొలి అక్షరం పై పాదాంతంలో వుండి, తర్వాతి పాదారంభంలో వున్న ద్విత్వ శకటరేఫ 'ట్టి'పై నొక్కబడుతుంది. భాగీరథిని సాధించటంలోని కష్టమంతా ఇక్కడి ద్విత్వరేఫను ఉచ్చరించటంలోని శ్రమచేత భావితాంశమవుతూంది.

> తన్నువ్యధాకరించిన వృధామతిఁగాంచి క్రుధామతిన్ బలే
> పన్నితి వోరి లౌకికుఁడ! భామిని నీ కనులన్ విలాసముల్
> కన్నది నేను పాపములు కన్నది నేఁటికిరా ఫలించె నీ
> తెన్నున ఛాందసాకృతిని దెచ్చెదవేమి సుఖంబు జారరా!
>
> (అహల్యా. 526)

తన శిరస్థమాణిక్యమ్ము తామ్రమైన చూడముగ నొప్పి, కోడిగా కూసి, మాయాగౌతముడై వచ్చి అహల్యను మోహపరిచిన ఇంద్రునితో గౌతముడన్న మాటలివి. అతడి దివ్యచక్షువులకు ఇంద్రుని దౌర్జన్యం తెలిసింది. ఆగ్రహోద్రిక్తుడైన అహల్యాపతి సంక్రందనుణ్ణి శపిస్తూ అన్నమాటలివి. లక్షణ రీత్యా [illegible]మాలలో జగణాలు లేవు. కానీ, ఈ పద్యరచనలో 'వ్యధాకరించిన వృధామతి', 'క్రుధామతి', 'విలాసముల్', 'ఫలించె' 'సుఖంబు'-అన్నచోట్ల

జగణాలున్నాయి. దీనిద్వారా కలిగే ఉత్ప్లుతి గౌతముడి మనస్సు పొందే క్రోధో ద్రిక్తతకు సూచకంగా ఉంది. మహాప్రాణాక్షరమైన 'ధ' కారం ఒకేపాదంలో మూడుమార్లు జగణ మధ్యాక్షరంగా వచ్చి ఇంద్రుడి మోసానికి గౌతముడెంత తీవ్రంగా చలించాడో భావింపచేస్తూంది. అతడు చేసిన సంబోధనలు రెండు. ఈ సంబోధనల క్రమంలో[30] కూడా అతడి క్రోధమే వుంది. పరమసాధువైన (516) మునిలో చెలరేగే క్రోధం సుకుమారవృత్తమైన ఉత్పలమాలలో జగణాల ద్వారా సూచింపబడింది. అతడి సాధుత్వాన్ని గురించి చెప్పిన పద్యమూ (516), అతడి క్రోధత్వాన్ని గురించి తెలిపే పద్యమూ (526) ఉత్పలమాలలోనే రచింప బడటం చిత్రం.

> రాముస కంతలో నొక విరాగము మైథిలి మీఁద నంతలోఁ
> గాపము కామమెంతయు నికామము సాగి విరాగమున్ హృదా
> రామ విధూత కౌసుమ పరాగము సీతకుఁ దోఁపసీని ని
> ష్కామము పుట్టుకో ననువు చాలని కామము వెంటవెంటరాన్.
>
> (కళ్యాణ. 186.)

కళ్యాణానంతరం రాముడిలో వైరాగ్యభావసలు పల్లవించాయి. అతడిలోని రాగ విరాగాల సందిగ్ధ స్థితిని పద్యం తెలుపుతూంది. విరాగ కామశబ్దాలు పద్యంలో ఒకటి తర్వాత మరొకటి పెనవేసుకుని, అతడిలో ఆలోచనలు ఎంత అల్లిబిల్లిగా అల్లుకున్నదీ తెలుపుతూన్నాయి. 'విరాగ', 'నికామ', 'విరాగ', 'విధూత' 'పరాగ' ఇవి పద్యంలోని జగణాలు. అక్కడక్కడా చప్పున ఎగసిపడే ఈ గణం శ్రీరాముడి మనస్సులోని ఒడుదుడుకుల్ని సూచిస్తూంది.

మేనకా విశ్వామిత్ర ఘట్టంలో తొలిసారిగా మేనకను కౌశికుడు చూసిన పుడు దీర్ఘసమాసంతో నడిచిన ఉత్పలమాల (ధను. 182) వుంది. మోహా విభ్రాంతుడైన కౌశికుడు కన్నార్పకుండా ఆమెకేసి చూస్తూండి పోయాడన్న విషయం ఇక్కడ నిరాటంకంగా దీర్ఘంగా సాగిన సమాసం చేత భావింపబడు తూంది.[31] రాముడు వైరాగ్యభావనలల్లుకున్న మనస్సుతో వశిష్ఠుని ఆశ్రయించి, 'నా యందున నేను మేల్కొనే దెలాగ?' అని అడిగాడు. ఇక్కడ వరుసగా నాలుగు ఉత్పలమాలలున్నాయి. ఈ నాలిగింటా (కళ్యాణ 200 - 203) అనుగ్రహించవే అన్న మకుటం వుంది. ఇది శ్రీమదాంధ్రభారతంలోని ఉదంకి స్తుతిని తలపించే రచనావిన్యాసం.

# మత్తేభం*

సంస్కృత కవులు ఆదరించని మత్తేభ వృత్తం ఆంధ్ర సారస్వత లోకంలో వీరవిహారం చేసింది. అత్యంత ప్రీతిపాత్రమైన వృత్తంగా ఆంధ్ర కవులు దీని నాదరించారు. ఆదిలోనే సగణముండి, ఇరవై అక్షరాల పాదంలో పది గుర్వక్షరాలుండి, ఈ వృత్తగతిలో వున్న నెమ్మదితనం చేత, గజగమన సౌందర్యం కలుగుతూంది. ఆ దృష్ట్యా మత్తేభనామం ఈ వృత్తానికి సొగసుగా అన్వయిస్తూంది.

తమరై రాఘవులర్థ శాస్త్రమును వార్తాశాస్త్రమున్ నేర్చి గౌ
తమ ముఖ్యర్షి కృతస్మృతి ప్రవిల సద్ధర్మంబులన్ నేర్చి రు
త్తమ ధీమంతులు కామ సూత్రముల తాత్పర్యార్థముల్ నేర్చి సా
ధుమతుల్ పారము సేసినా రుపనిషత్తుల్ బ్రహ్మసూ శిష్యులై

(అవతార. 407)

'శిష్యాణాముపదేశార్థే వృత్తిరిష్టా విలంబితా' అన్న ప్రమాణాన్ననుసరించి, శిష్యులకు ఉపదేశించే విషయాల్ని గురించి చెప్పటాని కీవృత్తం ఉచితంగా వుంటుంది. ఈ ఔచిత్యాన్ని పాటిస్తూ శ్రీరామాది సోదరుల విద్యాభ్యాస విషయ మంతా వరుసగా ఇరవై ఒక్క మత్తేభ వృత్తాల్లో (400-420) వర్ణితమయింది. యుద్ధవిద్యలైన 'ఖడ్గక్రీడ గారించుటల్', 'నఱకుటల్ నర్తించుటల్ చూపి యొక్కెడ నింకొక్కెడఁ గొట్టుటల్ పొడుచుటల్ కేరించుటల్ రాచుటల్' (403) నేర్పురని చెప్పిన పద్యంలో హలంత పదాలు ఎక్కువగా వుండి, పద్యమంతా విరిగి విరిగి, తిరిగి అతుకు పడుతూ నడిచింది. దీనివల్ల ఒక్కొక్క క్రియనీ విడదీసి చెప్పే వీలు కలిగింది. ఒక కార్య ప్రశస్తిని గురించి చెప్పేటప్పుడు క్రియా పదాల నెక్కువగా వాడటం లోకసహజమే. 'మా వాడు చదవడం,

---

* ఇది కృతిచ్ఛందోజనితమైన వృత్తం. పాదానికి 20 అక్షరాలు. గణాలు: స-భ-ర-న-మ-య-వ; యతిస్థానం 14వ అక్షరం. ప్రాసనియముంది.

రాయడం, పాడటం, ఆడటం అన్నీ చేస్తాడు' అన్న వాక్యధోరణి ఈ పద్యంలో వుంది. దీనివల్ల విషయానికి ప్రాధాన్యత వస్తూంది. ఇక్కడ రామాదులు విద్యాభ్యాసం చేయటం విశేష విషయం కనుక, ఈ ప్రాధాన్యత ఇవ్వవలసి వచ్చింది.

ఇదె గోబ్రాహ్మణ రక్షకోసమయి యా యీ దేశ సౌభాగ్య సం
పదకై మద్గురు దక్షిణార్థమయి యీ పాపాత్మయౌ తాటకన్
జదియింతున్ జదియింతుసంచును ధనుర్జ్యావల్లి శబ్దించినన్
హ్రద సేతు భ్రమ వారి నిస్వనముగా నార్చెన్ దిశా సంతతుల్

(అహల్యా. 185)

తాటకా వధ హేతు వీ పద్యంలో చెప్పబడింది. 'స్త్రీ హత్య అధర్మమని వెనుకంజ వేయకు' అని కౌశికుడు వివరిస్తే అపుడు రాముడు చేసిన ప్రతిజ్ఞ ఇది. పద్యప్రారంభమే 'ఇదె' అని వుంది 'ఇదిగో, ఇదే నా ప్రతిజ్ఞ' అని చెప్పే తీరు ఇది. రాముడు ధర్మరక్షకుడు కాబట్టి తొలుతగా గోబ్రాహ్మణ రక్షా విషయాన్ని పేర్కొన్నాడు. 'చదియింతు' ననే మాట ద్విరుక్తం కావటం చేత వక్తవ్య ధోరణిలోని వేగం, తిరుగులేని ఆత్మవిశ్వాసం సూచింపబడుతున్నాయి. ఇంతా పలికి ఈ పద్యంలో మద్గురు దక్షిణార్థమయి తాటకవధ చేస్తున్నానని రాముడనటం చాలా గడుసుగా వుంది. పద్యమంతటా పరచుకొన్న నాదాత్మకమైన 'ద' కారం వల్ల పద్యానికొక సాంద్రత వచ్చింది.

ఈ విధంగా బాలకాండలో మత్తేభ వృత్తాలు వివిధ గతుల్లో నడిచాయి. ప్రభాతవర్ణన (అహ. 425), మేనకా కౌశికుల శృంగారం (ధను. 189.), మేనకా వ్యామోహంలో తపోభంగమయిందని కౌశిక పశ్చాత్తాపం (ధను. 201), కళ్యాణంలో తలంబ్రాలవేళ సీత సిగ్గుపడటం (కళ్యాణ 85), కళ్యాణానంతర తొలి గ్రీష్మ వర్ణన (కళ్యాణ. 194), హేమంత వర్ణన (కళ్యాణ. 256) ఇత్యాదిచోట్ల మత్తేభ వృత్తాలు ప్రయుక్తమయ్యాయి. వివిధ సందర్భాలలో ప్రయుక్తమైె వృత్త ప్రయోగ విస్తృతి విశాలమవుతుంది. 'అమరీ కైశిక పారిజాత కుసుమోహస్వాదువీ బాలకాండము' అని కళ్యాణ ఖండాంతంలో చెప్పబడ్డది మత్తేభ వృత్తంలోనే. 'అమరీ' అన్నపుడు పలికే దీర్ఘాక్షరం అమరకాంతల కైశిక దైర్ఘ్యతా సౌందర్యాన్ని స్ఫురింప చేస్తుంది.

# చంపకమాల*

ఆంధ్ర సాహిత్యంలో ఉత్పలమాల లాగానే అతి ప్రసిద్ధమైన వృత్తమిది. ఇరవై ఒక్క అక్షరాలున్న పాదంలో 14 లఘ్వక్షరాలే కావడం చేత ఈ వృత్త గతిలో ద్రుతత్వముంది. పాటిబండవారు భావించినట్లు ఈ వృత్తం ద్రుతోత్ప్లుత గతి గలది కూడా. ద్రుతిలో ఉత్ప్లుతి వుంటే వీరాదుల్లోనూ, అవరోహణముంటే శృంగారాది సుకుమార ఘట్టాల్లోనూ చంపకమాల శోభిస్తుంది.

తిరిగి వసంతకాల మరుదెంచె వినూత్న శిఖి ప్రభా శిఖా
హరణము వోలె నొప్పెఁ జివురాకుల తుట్టతుదల్ జగాజిగుల్
రురువులు లేఁత పచ్చికలు రోసెను సాఁగెను చాగచెట్టు గం
బురలుమిసెన్ వనీ శిలలు మోసిన కస్తురి లేళ్ళ పక్కముల్
(అవతార. 380)

శ్రీరామ జననానంతరం ఎన్నో వసంతాలు గడిచాయి. ఆ సందర్భం లోని దీ పద్యం. ఇదే ప్రారంభంతో ఇటువంటి పద్యం పదేపదే వస్తుంది. 'తిరిగి' 'అరుదెంచె' అనే మాటలే ఆ పద్యాల్లో తిరిగి అరుదెంచినా ఆ తర్వాతి వర్ణనలో మార్పు వుంది. ఈ రెండు పదాలు (తిరిగి, అరుదెంచె) తక్కువ వ్యవధానంతో దగ్గరగా పలుకబడటం చేత పద్యానికి రేఫ ప్రాస ఏర్పడి, అక్షరరమ్యత చేకూరుతుంది 'వసంత' అనే మాటలోని ఉత్ప్లుతి ఆ ఋతువు కలిగించిన చిత్త వికాసానికి సూచనగా వుంది. ద్రుతగతిలో నడిచే ఈ వృత్తంలో కాలసూచకమైన ఈ వసంతవర్ణన ద్వారా కాలం ఎంతో వేగంగా వసంతమధురంగా గడుస్తున్న దన్న విషయం వ్యంజింపబడింది. పదేపదే ఈ పద్యాలే ఆవృత్తి కావడంలోని రహస్యమిదే.

---

* ఇది ప్రకృతిచ్ఛందోజనితమైనవృత్తం. పాదానికి 21 అక్షరాలు గణాలు: న-జ-భ-జ-జ-జ-ర. యతిస్థానం: 11 వ అక్షరం. ప్రాసనియమ ముంది.

మొనసి భృశాశ్వదత్తములు మూల్గుచునున్నవి నాకడన్ మహా
స్త్ర నిభృత విద్యలట్లె రఘురామునకై యవియెల్ల నిచ్చెదన్
మనుజ మహేంద్ర! పంపుము కుమారుని నా వెనువెంట; నూరకే
యనలము దాచుకొన్న ఫలమా? క్రతుయోగ్యము కావలెంజుమీ!

(అహల్యా. 31)

ఇది విశ్వామిత్రుని మాట. యజ్ఞ రక్షణకు రాముని పంపుమని కోరుతూ దశరథునితో అతడన్న మాటలివి. నియమం ప్రకారం పద్యంలో పదారు జగణాలుండాలి. 'భృశాశ్వ', 'మహేంద్ర', 'కుమారుని' - ఇవి మాత్రమే జగణాలు. పద్యంలో మొత్తంమీద మూడే జగణాలు. అంటే వుండవలసిన వాటిలో దాదాపు ఆరవభాగం వున్నాయన్నమాట. ఇది దేనికి సూచన? విశ్వామిత్రుడు కోపస్వభావుడు. అతడెంత తీవ్ర స్వభావుడైనా, దశరథుడివద్ద ఈ సందర్భంలో కార్యకుశలుడి ధోరణిలో నెమ్మదిగా మాటాడుతున్నాడు. ఆ వరి పరిస్థితిని ఈ పద్యం సూచిస్తుంది జగణాలు ఆధిక్యత చూపాల్సిన వృత్తంలో వాటిని భగణాలుగా మార్చి కవి ప్రయోగించటంలోని మర్మమిది. మహాకోపి అయిన కౌశికుడు కూడా మార్దవ స్వరంతో ఆర్ద్రంగా అడిగిన తీరు నీ పద్య నిర్మాణం వ్యంజిస్తుంది. ఇక్కడ 'అనలము దాచుకున్న ఫలమా' అన్న మాటకు నేపథ్యంగా యజ్ఞగత మనస్కుడైన కౌశికుడున్నాడు. ఈ విధంగా ఛందస్సౌందర్యమూ, అర్థసౌందర్యమూ అందంగా అమరిన ఈ పద్యంలో వైదికవాసన పరిమళిస్తుంది.

నిశినిశియెల్ల నింద్రునకు నీలసరోరుహ లోచనా వచో
నిశిత మనోహరార్థ విపణీకృత ధీకునకున్ మనోజ్ఞనుగా
విశదతనూ సమార్ద్ర వినివేశన దర్శన ధీయుగీ సహ
స్ర శకలితాక్షి గోచునకు సాగియు సాగదు కోడి కూయదున్

(అహల్యా. 524)

చంపకమాలలో లక్షణరీత్యా వుండవలసినన్ని జగణాలుంటే పద్యమంతటా ఎగసిపడే ఆవేశం కనిపిస్తుంది. కవి సందర్భానుసరించి జగణహీనం చేసి, పద్యంలో తానాశించిన ప్రయోజనాన్ని సాధిస్తాడు. ఈ పద్యంలో 'సరోరుహ', 'మనోహరార్థ', 'మనోజ్ఞనుగా', 'సమార్ద్ర' మినహా జగణాలు లేవు. జగణహీనం కావటంచేత పద్యంలో ద్రుతగతి విలంబితగతిగా పరిణమిస్తుంది. ఈ వున్న జగణాలచేత గమనంలో వేగం వుందనిపిస్తూ, తక్కిన

పద్యభాగంలోని విలంబితగతిచేత వేగం లేదనిపిస్తూ 'సాగియు సాగదు' అని ఇంద్రుడు పడ్డ అవస్థను సూచిస్తూందీ పద్యం.

పిలపిల నొచు నంత వినిపించె శుకీ కలవింక శారికా
కుల కలరావముల్ తరునికుంజ లతాళులఁ గుహాఁ గూహు సం
కుల నినదార్భటీ మధుర కూజిత కోకిల కాకలీ స్వరం
బులు గగనంబునం దెగిరిపోయెడు సారస హంసరావముల్

(అహల్యా. 542)

శ్రీరామ ప్రవేశం వలన అహల్యాశ్రమంలో కలిగిన పరిణామాన్ని చెప్పే పద్యమిది. ప్రాస స్థానంలో వున్న 'ల'కారం పక్షుల కలరవాన్ని స్ఫురింప చేస్తూంది. 'పిలపిల', 'కల', 'కులకల', (లతా) 'ళుల', (శు) 'కీ', '(సం)కుల', 'కోకిల' - ఇలా పద్యమంతా కలస్వనం శ్రవ్యమానమవుతూంది. 'కూజిత కోకిల కాకలీ 'అన్నచోట 'కూ', 'కో' అని దీర్ఘాక్షరాలు కోకిలాలాపాన్ని వినిపిస్తు న్నాయి.

ఇదియును గాక గౌతమ ఋషీంద్రుని భార్య యహల్యయెంత ప
డ్డది? యలనామె దుఃఖ వికటజ్వలితాగ్ని మదంతరంబు నం
దొదిగిన కోటిజన్మల మహోన్నతదుఃఖముఁ ద్రవ్వి చూపె; నా
సదమల దుఃఖశీల క్షితిజాతను నన్నును నట్లురమ్మనెన్. (కళ్యాణ. 122)

కళ్యాణానంతరం అయోధ్యకు తిరిగిపోతూ రామాదులు అహల్యా దర్శనం చేశారు. అనంతరం తిరిగి అయోధ్యాముఖులై పోతూ రాముడు కౌసల్యతో అన్న మాటలివి. రాముడికి అహల్యపట్ల వున్న సానుభూతి ఈ పద్యంలో ప్రకటిత మయింది. 'దుఃఖ వికటజ్వలితాగ్ని' అన్న సమాసంలోని శ్లిష్టత అతడి వచోగత మైన దుఃఖావేశ సంసూచకంగా వుంది మూడు పాదాల్లోనూ అహల్య దైన్యమే రాముని మాటల్లో వుంది. ఆ మూడుపాదాల్లో జగణాలుండి, అతడిలో ఉబికి ఉబికి వచ్చే దుఃఖభావాల్ని వ్యంజిస్తూంది.

కుశనాభతనయల కథలో వాయుదేవుని మాటలు చంపకమాలలో వున్నాయి. 'మలయ ధరాధరోదర కుమార సమీరునితో' (అహల్యా. 239) ఇత్యాదిగా సాగిన ఆ పద్యంలో 'ద'కార, రేఫపునరావృత్తిచేత పద్యానికి అక్షర రమ్యత చేకూరింది. క్షీరసాగర మథన కథలో 'చిలుకుచు నుండగా నుదధి క్షీరము చిందులు' అన్న ప్రారంభంతో మూడు చంపకమాలా వృత్తాలున్నాయి. ప్రారంభంలో వున్న అవిశ్రాంత ద్రుతగతి సాధించేదాకా వుందన్న సూచన ఈ ప్రారంభం సూచిస్తూంది.

# కందం*

ఇది జాతి ఛందం. సంస్కృత ఛందంలోని ఆర్యాగీతి తెలుగులో కంద పద్యంగా అవతరించింది. దీనికున్న అనేక నియమాల దృష్ట్యా 'కందం రాసిన వాడే కవి' అని లోకోక్తి పుట్టింది.

ప్రాకృత గాథకు, సంస్కృత ఆర్యావృత్తానికీ లక్షణరీత్యా భేదం లేదు. ఆర్యావృత్తాన్ని కొంతమారిస్తే ఆర్యాగీతి ఏర్పడినట్లు గాథను కూడా కొంత మారిస్తే, స్కంధకమనే ఛందస్సు ఏర్పడుతుందని సుదీర్ఘమైన చర్చ జరిపి, పాటిబండవారు ఈ స్కంధకమే తెలుగులో కందమయిందని అభిప్రాయ పడ్డారు. అంటే, ఆర్య, గాథ, కందం - ఈ మూడూ మౌలికంగా ఒకటే. కానీ, కందానికి వీటితో ఒక చిన్నభేదముంది. అది యతి నియమం. గాథకుగానీ. ఆర్యా వృత్తానికి గానీ యతి నియతి వున్నట్లు కనబడదు.[32] పరిమాణరీత్యా అల్పమైన దైనా, ప్రయోగరీత్యా కందం అనల్పమైనది. కల్పవృక్షకారుడు కందరచనలో రకరకాల పోకడలు పోయాడు.

నీకు సుమంత్రుండను పే
రే కలిగె సుమంత్ర ధీధురీ జన్యగిరీ!
నీ కెఱుఁగఁ రాని త్రోవలు
మాకెఱుఁగఁగ రావు చూడుమా మంత్రిహరీ! (ఇష్టి. 22.)

---

* ఇందులో గగ-భ-జ-స-నల- అనే గణాలు మాత్రమే పరిమితాలు. మూడు గణాలున్న యతి లేని పాదం మొదట వుండి, తర్వాత అయిదు గణాలున్న పాదం వుండాలి. ఇందులో నాలుగవ గణాద్యక్షరం యతి స్థానంగా వుంటుంది. ఈ తొలి రెండు పాదాలు గణిస్తే బేసి సంఖ్యలో జగణముండరాదు. ఆరవ గణంగా నలం కానీ, జగణం కానీ వుండాలి. ఇది ఒక సగం. మరో సగం ఇలాగే వుండాలి. 2,4 పాదాలు గుర్వంతం కావాలి. ఈ రెండు సమభాగాలు కలిస్తే ఒక కందం. నాలుగు పాదాలకూ ప్రాస నియమం వుంది.

'గిరి', 'హరి' అన్న అంత్యానుప్రాసల చేత శ్రవణ సుభగత్వ మేర్పడి, సుమంత్రునితో భాషించే మంత్రుల లౌక్యానికి సూచకంగా వుంది.

పాల్ద్రావు రామచంద్రుఁడు
పాల్ద్రావుచు రాఘవుండు పరువెత్తు మఱిన్
పాల్ద్రావు వచ్చి యాతఁడు
పాల్ద్రావఁగఁ దల్లి యెడఁద పాలకడలియౌ (అవతార. 328)

ఇది రాముని బాల్యవర్ణన. ఈ పాదాలు నాలుగూ నాలుగు విడివిడి వాక్యాలు. కానీ చేష్ట మాత్రం అన్నింటా ఒక్కటే. పాలు త్రాగటం. ఒకే విష యాన్ని నాలుగుసార్లు ప్రస్తావించటం చేత సాధించబడే ప్రయోజన మొకటుంది. తిరుగుతూ తినటం, తాగటం పిల్లల లక్షణం. అంటే వాళ్ళొకచోట నిశ్చలంగా నిలవరు. కాసేపు ఇక్కడ, మరికాసేపు మరొకచోట. తిరిగి మొదటికివచ్చి నిల వటం-ఈ విధంగా అనిశ్చలగతిలో అటూఇటూ తిరుగుతారు. ఈ పద్య ప్రారం భంలోని క్రియాపదమే మిగిలిన మూడు పాదాల్లోనూ పునరుక్తమయింది. దాని అర్థ మీ చంచల శిశుగతిని నిరూపించటమే. ఈ పునరుక్తి వెనుక వున్న విశేష మది.

కందపద్య పాదాల్లో సమ పరిమాణం లేదు. హ్రస్వదీర్ఘ పాదాలతో నడు స్తుంది. ఈ నడక పసిపిల్లవాడి తప్పటడుగులకు సూచకంగా వుంది. పరిమాణ రీత్యా చిన్నదైన కందం పసివాడిని పోలి వుంది. ఈ విధంగా ఛందస్సు, విషయమూ రెండూకూడా రాముని బాల్యవర్ణనకు దోహదం చేశాయి.

బృహదారణ్యోపనిష
ద్విహరద్వేదాంత పురుష వివిధ ప్రళయ
ప్రహరహృత దహర విద్యా
ముహురాహరణ ప్రవీణపుం జ్యోతిస్సున్ (ఇష్టి. 299)

జనకమహారాజును యజ్ఞానికి రావలసిందిగా వశిష్ఠుడు ఆశిస్తూ, సుమంత్రు నికి చేసిన ఆజ్ఞలోని భాగ మీ పద్యం. ఈ పద్యమంతా జనకునికి అన్వయించేదే. శ్లిష్టబంధంతో నడచిన పద్యం కావటంచేత జనకుని గురించి వశిష్ఠుడెంత గౌరవ

భావంతో భాషించాడో అవగత మవుతూంది. వ్యక్తిపట్ల గౌరవభావం హెచ్చిన పుడు వాక్యం సాంద్ర నిర్మాణంతో వ్యక్తం కావటం సహజమే. ఇది 'హ'కార ప్రాసచేత ఉచ్చారణలో విసర్గస్ఫురణ కలిగిస్తూ, ఓజోరూపాన్ని పొందుతూంది.

జనకుఁడు ప్రతిదినమును దా
జనెద ననఁగ రాజు ఱేపు చనవచ్చుననున్
దినదినము రోమపాదుఁడుఁ
జనెదనన్ రాజు నేఁడె చనవలెనః యనున్ (అవతార. 132)

ఇది నవం ధోరణి. ఈ పద్యంలో వ్యక్తుల మధ్య నడచిన సంభాషణ వ్యక్తమయింది. అశ్వమేధయాగానికి వచ్చిన హిత సన్నిహిత వర్గంతో దశర థుడు భాషించిన తీరు ఇది. సంభాషణాత్మకమైన కందం.

చిటచిట సవ్వడి వినఁబడెఁ
గిటకిటనన్ బట్టమహిషి కిటికి దెసఁ గనన్
చిటికలు గుటికలు మెటికలు
పటపట చిటచిటని జల్లువాన కురిసెడున్ (అవతార. 227)

శ్రీరామ జననానంతరం కురిసిన వర్షవర్ణన ఇది. ఇందులో అత్యంత ద్రుతగతి సూచకాలైన నలగణాలు పడివున్నాయి. నల బాహుళ్యరీత్యా దీన్ని నల కందంగా పేర్కొనవచ్చు. ఈ పద్యంలో వినిపించే 'ట'కార అనుప్రాస వాన కురవటంలో వున్న చిటపట ధ్వనిని వినిపిస్తూంది. మొదటి పాదంలో 'చిటచిట' సవ్వడి మాత్రం వినిపించింది. గదిలో వున్న రాణి కిటికీలో నుంచి చూడగానే 'పటపట చిట చిట' వాన కురుస్తూంది. తొలుత సన్నగా ప్రారంభమై రానురానూ వేగం హెచ్చేవాన ఈ అనుప్రాసల బాహుళ్యం చేత భావితాంశమవుతూంది.

నాలుగు నెగళ్లుగా నై
నాలుగు దెసలందు సూర్యనారాయణుడై
కాలి శిరస్సున గ్రీష్మ
జ్వాలీఢ తపోఽగ్ని తప్పుఁడై తపియించెన్. (ధను. 218)

ఇది గ్రీష్మతపస్సు. బ్రహ్మర్షి కావాలనే పట్టుదలతో కౌశికుడు జ్వలించే తపోఒగ్ని ఇది. ఇక్కడ కందపద్యంలో తపోనిష్ఠను వర్ణించటం వెనుక ఒక చమత్కారముంది. పద్యానికున్న నియమాల దృష్ట్యా కందరచన కష్టమైనది. తపోనియమాలు కూడా తీవ్రమైనవి. నియమబాహుళ్యం గల కందం చేత తపస్తీవ్రత భావ్యమానమవుతుంది. హ్రస్వదీర్ఘపాదాలతో నడిచే ఈ పద్యం ఒక కాలు పైకి మడచి ఒంటికాలిపై తపస్సుచేసే మూర్తిని తలపింప చేస్తూంది. తపస్సంతా వరుసగా ఆరు కందపద్యాల్లో (ధను 218, 19, 20, 21, 22, 23) చెప్పబడింది. ఛందోభేదం లేకుండా ఏకచ్ఛందబద్ధమైన ఈ వర్ణనచేత కౌశికుడి ఏకాగ్రత సూచించబడుతూంది.

ఈ కందాలన్నింటి లోకీ విలక్షణంగా కనిపించే రచన ఒకటి ఇష్టి ఖండంలో కనిపిస్తుంది.

> అంతట నవ్వేలుఁగు దిశా
> క్రాంతమ్మె యగ్నికంటెఁ గాంతమ్మె సుఖ
> ప్రాంతమ్మె సర్వసుఖ
> ప్రాంతమ్మె సర్వదృగ్ధురాపటువయ్యెన్. (ఇష్టి. 425)

అత్యాంతమైన సమాస నిర్మాణ పునరావృత్తి చేత పద్యంలో మగణ స్ఫూర్తి కలిగి శార్దూలవృత్తంలాంటి పద్యాలు మోయవలసిన భారాన్ని స్ఫురింప చేస్తూంది. సాంద్రతమమైన ఈ పద్యం 'ధురాపటు'వై అక్కడి వెలుగులోని 'సర్వదృగ్ధురాపటుత్వ' సూచకంగా వుంది.

ఇదికాక సంస్కృత మంత్రాలొదిగిన కందాలు (అవతార 107, 385), జోలపాట లొదిగిన కందాలు (అవతార. 296, 298) విలక్షణమైనవి జోల పాటలో వుండే గేయలక్షణాన్ని దీర్ఘాక్షరాల ద్వారా పద్యంలోకి ఒదిగింప చేశాడు విశ్వనాథ.

# తేటగీతి*

అప్పకవి దీనిని నవవిధ గీతులలో సమగీతి భేదంగా పేర్కొన్నాడు. ఉప జాతి ఛందస్సు కనుక దీనికి ప్రాస నియమం లేదు. ఆటవెలదికి, తేటగీతికి గణ సంఖ్య రీత్యా సాదృశ్యమున్నా పాదస్వరూపభేదముంది. రెంటిలోనూ పాదాని కైదు గణాలే. రెండింటా మూడవ గణాద్యక్షరమే యతి. కానీ, ఆట వెలదిలో సమ, విషమ పాదాలలో సమనిర్మాణం లేదు. తేటగీతిలో అన్ని పాదాల్లోనూ ఒకే నిర్మాణముంది. ఈ దృష్టితోనే ఇది 'సమగీతి'గా పేర్కొనబడి వుంటుంది. పాటి బండవారు తేటగీతి గురించి చర్చిస్తూ ఇందులో సాధింపదగిన యతి-ప్రాసయతుల భేదాలనిలా పేర్కొన్నారు.

1. సర్వపాదాల్లోనూ సాధారణయతి
2. సర్వ పాదాల్లోనూ ప్రాసయతి
3. విషమపాదాల్లో ప్రాసయతి
4. సమపాదాల్లో ప్రాసయతి
5. పూర్వార్ధంలో ప్రాసయతి
6. ఉత్తరార్ధంలో ప్రాసయతి.

కల్పవృక్షకారుడు ఈ ఆరు భేదాలను ప్రయోగించాడు.

**1వ భేదం:**

కడుఁ బరభ్రష్టమైన యోగంబు వోని
యాశ్రమముఁ జూచి రాముని యక్షులందు
బాష్పములు గుత్తులై రామభద్రు ముఖము
హరివదలి చన్న వైకుంఠమట్లు తోఁచె. (అహల్య. 511)

---

* ఇది ఉపజాతి ఛందస్సు. ప్రతి పాదానికి 1 సూర్యగణం + 2 ఇంద్ర గణాలు + 2 సూర్యగణాలుచొప్పున నాలుగు పాదాలుంటాయి పాదంలో నాలుగవ గణాద్యక్షరం యతిస్థానం. ప్రాస నియమం లేదు.

**2వ భేదం:**

రాజు కొడుకు కొట చేతనే రాజు గాక
రాజిత జగత్ప్రతిష్ఠా విరాజమాన
తేజుఁడై రాజు రాజుగా; భూజనంబు
రాజనంబులు పండించి రా జగాన. (అహల్యా. 415)

**3వ భేదం:**

కుల విధాత యిక్ష్వాకుని యలఘు కరుణ
సకల వైశాలికులును దీర్ఘాయువులును
వీర్యవంతులు ధార్మికుల్ సూర్యతేజు
లును నరిందములు మహాత్ములును కుమార! (అహల్యా. 491)

**4వ భేదం:**

నోరు మెగలదటే నీకు నూరక తెగి
రాలిపోవదు కూనరాగాల తోడ
బిట్టు బిగిసెడు తొట్టెను బెట్టు స్వామి
నేలగాఁ బాడఁగా నొక్క జోలపాట. (అవతర. 291)

**5వ భేదం:**

తనదు చివురాకు బోఁడు జాఱినది తెలియ
కుండఁ బరువెత్తెఁ బుష్ప బాణుండు తాను
గోకిలయు రివ్వునం దూసికొంచుఁ బోవు
లాలితాన్యవనీ రసాలముల కొఱకు (ధను. 234)

**6వ భేదం:**

జామిపువులోని కేసరచ్ఛవి వహించి
ప్రాచి తెలివెల్గు గీతలు పాఱుదెంచె
నేమి సాగరుల్ వారలదేమి ప్రభువు:
ఏమికథ? యేమి చెప్పుట? యేమి సొగసు? (అహల్యా. 423)

ఈ భేదాలు కాక విశ్వనాథ రచనలో సంబోధనల తేటగీతి కూడా కనిపిస్తుంది.

రామ! రఘురామ! దశరథరామ! యో య
యోధ్యరామ! జానకిరామ! యోయి తండ్రి!
యసుర సంహార రామ! పట్టాభిరామ!
రామ! రఘురామ! రామ! శ్రీరామచంద్ర! (ధను. 51)

ఇది శతానంద వాక్కు. అహల్యా శాపవిముక్తికి హేతువైన రాముని చూసి నిర్భరానందంలో ఎగసిన సంబోధనలివి. ఇవి సంబోధనా గీతులు. తేట గీతి ప్రయోగ పరిధిని విస్తృత పరచే రీతి ఇది.

ఈ పద్యంలో ఒక విశేషముంది. శతానందుడేరీతిలో స్తుతించాడో ఆ స్తుతి తత్పూర్వం అహల్యా శాప విముక్తి అయిన వేళలోనూ చేసింది. ఆ పద్యమిది :

రామ! రఘురామ! దశరథరామ! యో య
యోధ్యరామ! జానకిరామ! యోయి తండ్రి!
యసురసంహారరామ! పట్టాభిరామ!
రామ! రఘురామ! రామ! శ్రీరామయంచు (అహల్యా. 548)

తల్లి ఎంతటి దివ్యానుభవమందిందో తనయుడూ అదేస్థితి ననుభవింటాడు. ఇది సహృదయ లక్షణం. సమాన ఛందమే కాక సమాన వాక్యధోరణి కూడా వుండటం విశేషం.

మరల నిదె యొక్కసారిగా మానవేశ
సతుల గళసూత్రముల్ తెగి జారిపోవ
నేడ్వఁగావలెఁ గాకమ్మ లెగురవలెఁ బు
రములపైఁ బిండుగట్టి పిండముల కొఱకు (ధను. 418)

ఇది పరశురామ ప్రతిజ్ఞ. శివధనుర్భంగకర్త 'ఎవ'డని భీషణాకృతి దాల్చి వచ్చాడతను. అతడు పలికిన సవాలిది. మూడవ పాదంలో తొలి రెండు

గణాలదాకా ఒకే వాక్యంగా సాగింది. మూడవ పాదంలో, 'పురములపై' అనే మాటలోని తొలి అక్షరమే చివరి అక్షరంగా వుండి, 'రములపై' అని తర్వాతి పాదాదిలో వుంది. పాదప్రారంభంలో మూర్ధన్య కంపితాక్షరమైన రేఫవుండటంచేత పాత్రభాషణలోని భీషణత్వ స్ఫురణ పఠితకు కల్గుతూంది. పరశురామ పాత్ర లోని వాచికౌద్ధత్యం ఈ విధంగా భావ్యమాన మవుతూంది.

> పరమ సుకుమారమైన జీవంబులన్ ద
> దాత్వకోరక భావ సుందరములన్ స
> మాన సూక్ష్మరేఖా పరిమళములన్ శి
> శిరము మాఘ్యమ్ముల్ మలన్ వికసింపనీదు (కళ్యాణ. 278)

ఇదొక విలక్షణమైన రచన. ప్రతి పాదాంతంలోనూ వున్న అక్షరం క్రింది పాదంలోని పదాద్యక్షరమై వుంది. ఇది వృత్తాల్లో కనిపించే నిర్మాణ ధోరణి. ప్రుతాంతాల చేత పద్యంలో విరుపు వచ్చి, పాదం పూర్తిగా సాగటం లేదు. ఇది మొల్లలను వికసింపనీని శిశిరాన్ని స్ఫురింప చేస్తూంది. ఇక్కడ వరుసగా తేట గీతుల్లో శిశిర వర్ణన సాగింది. 'ఏకగీతి'గా సాగే లక్షణమున్న వృత్తం చేత ఏక రీతిగా సాగే ఋతువు వ్యంజించబడింది.

ఇదే ఖండంలో అంత్యానుప్రాసతో నడచిన తేటగీతి (కళ్యాణ. 288) రగడను తలపిస్తూంది.

# ఆటవెలది*

ఆటవెలదిని సమగీతి భేదంగా అప్పకవి పేర్కొన్నాడు. వర్గరీత్యా ఇది సమగీతి అయినా, గతిరీత్యా దీనికి ఆ నామ మన్వయించదు. బేసి, సరి పాదాల్లో వున్న లక్షణ భేదం చేత పద్యపు నడక ఒడుదుడుకులుగా వుండి, సమగతిని కోల్పోతూంది. ఈ హెచ్చుతగ్గుం నడకలో ఎత్తి అడుగువేసినట్లుండి. గతి కౌటిల్యం ప్రదర్శించే నట్టువరాలిని స్ఫురింప చేసే లక్షణముంది తప్ప, సమ గతి కనిపించదు. ఇలాగ విషమగతిలో నడచే ఛందోభేదాన్ని సమగీతుల్లో ఒక టిగా లాక్షణికులు గుర్తించటం చిత్రం.

యతి, ప్రాసయతుల పాటింపు భేదాల్నిబట్టి ఆటవెలదిలో క్రింది భేదాలు సాధింపదగినవి. (ఇవి పాటిబండవారి వర్గీకరణ)

1. సర్వ పాదాల్లోనూ సాధారణ యతి
2. సర్వ పాదాల్లోనూ ప్రాసయతి
3. విషమ పాదాల్లో ప్రాసయతి
4. సమ పాదాల్లో ప్రాసయతి
5. పూర్వార్ధంలో ప్రాసయతి
6. ఉత్తరార్ధంలో ప్రాసయతి

---

* ఇది సమగీతుల్లో ఒకటి. బేసి పాదాలు 3 సూర్య గణాలు + 2 ఇంద్ర గణాలతోనూ; సరిపాదాలు 5 సూర్యగణాలతోనూ వుంటూ నాలుగు పాదాలుంటాయి. ప్రతి పాదంలోనూ నాల్గవ గణాద్యక్షరం యతిస్థానం. ప్రాస నియమం లేదు. ఒకవేళ ప్రాస పాటిస్తే దానిని వవడగీతిగా గుర్తించా లని అప్పకవీయం (అప్ప. 4-355) చెపుతూంది.

బాలకాండలో క్రింది విధంగా వీటిని గుర్తించవచ్చు.

**1 వ భేదం :**

ధర్మబుద్ధి మఱి వృధా పోవదెప్పుడు
నశ్వమేధ యజనమందు నీదు
మనసు దవిలినపుడె మానవ నాయక!
నీకు సుతుల కలిమి నిశ్చయంబు (ఇష్టి. 273.)

**2 వ భేదం :**

పూని తేజమగ్నిచే నభివ్యాప్తమై
శ్వేతపర్వతంబు క్షితిజనించె
శరవణంబు బ్రధ్నఘరమును జనియించె
నెందుఁ గార్తికేయు డొందురూపు (అహల్య. 291)

**3 వ భేదం :**

దితి తపోఽర్థ మెఱిగి తతసిద్ధి కృతనియ
మంబెఱింగి యపచయంబెఱింగి
మించివచ్చుటెఱిగి వంచనయే మార్గ
మంచుఁదెలిసి వినయ మతిశయిల్ల (అహల్య 467)

**4 వ భేదం :**

ఒక్కసిద్ధిగోరి యొగి నెన్నిసార్లు నే
మొదలు పెట్టినాఁడ నదిసవంబు
నెన్నిసార్లు వారలెరియించిరి సవంబుఁ
దుదకు విసుగుపుట్టి వదలినాడ (అహల్యా. 38)

**5 వ భేదం :**

ఎన్ని తరువులున్న నన్నియుఁ గాయంగఁ
బూఁటఁ బూఁట వేచుఁ దోఁట మాలి
కడుపు నీది కూడఁ గాచిన నా గుండె
యటమటించు టాగి హర్షమొందు (ఇష్టి. 138)

**6 వ భేదం :**

ఆత్మవంతునకును యశమట్లు కల్మాషి
త్యాజ్యకాదు నాకు ధారుణీశ!
యామె నన్నుఁబీడ జామెను నే పీడ
నామె నాకు నేను నామెకింతె (ధను. 74)

పై విధంగా సాధించిన భేదాలే కాక, ఛందో విషయికంగా అనుశీలించ దగిన శిల్పం ప్రదర్శించిన పద్యాలూ వున్నాయి.

ముట్టె యెత్తి డుస్సిపోఁజేసి శృంగముల్
వంచి మెడను దుసికిలించి పలుపు
వెనుకఁగాళ్ళఁ జిమ్మి మునుగొమ్ములం గ్రుమ్మి
భృత్యకోటి శబళ యెగచి చిమ్మి. (ధను. 79)

విశ్వామిత్రుడు బలవంతంగా శబళను మళ్ళించుకు పోయేటపుడు, వశిష్ఠుని అసహాయస్థితిని చూసి, తనను తాను రక్షించుకోవటానికి శబళ చేసిన యత్నమిది. పద్యంలో 'డుస్సిపో', 'శృంగముల్', 'కొమ్ములం', అనే రగణాలు వున్నాయి. మధ్య లఘువుండి ఇరువైపులా గురువున్న ఈ గణ స్వరూపం తలవంచి కొమ్ములతో కుమ్మే శబళాస్వరూపాన్ని స్ఫురింపచేస్తూంది. మూడవపాదంలో ఒకేసారి వెనకాముందువున్న సైన్యాన్ని ఛిన్నాభిన్నం చేసిన వీరమూర్తిగా శబళ కనిపిస్తుంది.

వండు విఱిగి నీర మొగిఁ దేరుకొన్నట్లు
సాధుమౌని సుప్రసన్నుఁడయ్యె
సర్వఋషులు సేయు సంస్తోత్రముల చేతఁ
బరమమైన తన తపమ్ము చేత (ధను. 107)

ధనుర్వేదం సాధించిన కౌశికుడు వశిష్ఠుని పైకి బ్రహ్మాస్త్ర ప్రయోగం చేయగా ఆయన బ్రహ్మదండం దాన్ని గ్రహించింది. ఫలితంగా ఆయన 'రౌద్ర మనోజ్ఞమూర్తి' (105) అయ్యాడు. అలాటి వ్యక్తిని స్తోత్రాలతో ఋషులు ప్రసన్నం చేసుకొన్నారు. ఈ పద్యంలో ఒక చమత్కారముంది. రెండవసగం సీసలక్షణంతో వుంది.

సర్వఋ-షులుసేయు-స ంస్తోత్ర-ముంచేతc
బరమమై-న తనత-పమ్ము-చేత

స్తోత్రం చేశారన్న భాగమే సీసంతో వుండటం గమనించ దగ్గది. పరిణామ వైశాల్యం గల సీసం ప్రస్తుతికి తగిన ఛందస్సు. ఆ ఛందోస్ఫురణ కలిగిస్తూ గొప్పగా వారు స్తుతించారన్న విషయాన్ని ఈ పద్యం వ్యంజిస్తూంది. ఇది ఛందశ్శిల్పం.

రాని రాము నడుగొ రాముడంచును బల్కుc
గైక, సీత పర్వుగములు పెట్టు
అడవి కోడి కూసినట్లుగా నవ్వును
కైక, సీత తిరిగి రాక కలcగు (కళ్యాణ. 158)

ఇది కైక వినోదం. మొదటి పాదంలో కైక 'అడుగొ రాము'డంది. సగణమైన 'అడుగొ' అనే మాట చప్పున పలికే ఉచ్చారణా ధోరణిని సూచిస్తూంది. కవ్వించే మాటల తీరు నీ సగణం చక్కగా వ్యంజిస్తూంది. ఇందులో కైక గురించి చెప్పిన భాగమెక్కువగానూ, సీత గురించి చెప్పినది తక్కువగానూ వుండటం గమనార్హమైన విషయం. విభజిస్తే ఆయా పాదాలిలా వుంటాయి:

రానిరామునడుగొ రాముడంచును బల్కుc గైక
సీత పర్వుగములు పెట్టు
అడవి కోడి కూసినట్లుగా నవ్వును కైక
సీత తిరిగిరాక కలcగు

ఈ దీర్ఘపాదాల చేత వికసించిన కైక సరసహృదయమూ, హ్రస్వపాదాల చేత తియ్యని సిగ్గుతో ముకుళించిన సీత హృదయమూ సూచితమవుతున్నాయి.

# సీసం*

తెలుగు ఛందః ప్రపంచంలో విశాలమైన పరిమాణం గల ఛందమిది. దీనిని రచించని కవి వున్నాడనటం అతిశయోక్తి. 'కవికి కంసాలికి సీసము తేలిక' అనే నానుడి ననుసరించి పద్యరచన అతి సులువుగా చేయదగిన ఛందంగా దీనిని గుర్తించవచ్చు. ఇక్కడ చమత్కార నిమిత్తం సీసం లోహనామంగా శ్లేషింపబడింది. కానీ, ఇది లోహనామంతో ఏర్పడ్డ ఛందస్సు కాదు. ఇది సంస్కృత శీర్షక భవం. నామరీత్యా సామ్యమున్న ఈ ఛందంతో సీసానికి లక్షణ భేదముంది. శీర్షక లక్షణాలివి: శీర్షకాన్ని నానావృత్త నిష్పన్నాలైన పాదాలతో కూర్చవచ్చు. ఇందులో గణాలు నాలుగు మాత్రలను కలిగివుంటాయి. పాదానికి7$\frac{1}{2}$గణాలుంటాయి. ఇందులో 21 మొదలు 26 దాకా అక్షరాలు వుండవచ్చు. శీర్షకంలో రెండవభాగంలో నియమితంగా లఘువుల నుంచాలి. ఈ లక్షణాలకూ సీసపద్యలక్షణాలకూ సంబంధం లేదు. కనుక సీసం శీర్షకభవమనటం కేవలం నామరీత్యానే. దీని గురించి చర్చిస్తూ పాటిబండవారు ఈ నామకరణ సామంజస్యాన్నిలా నిరూపించారు: "జనాశ్రయుని యభిప్రాయమునుబట్టి చూచినచో శీర్షకమను నామకరణమునకు గారణము ఊహింపవీలగును. ఒకవిధమైన లక్షణము గల పద్యముపై వేరొక విధమైన లక్షణముగల పద్యమును జేర్చినచో రెండును గలిసి శీర్షకమను పద్యభేదమేర్పడును. రెండవ పద్యము మొదటి పద్యమునకు

---

* ఇది ఉపజాతి ఛందస్సు. ఇందులో నాలుగు పాదాలుండి, ఒకొక్క పాదం రెండు దళాలుగా విభక్తమై వుంటుంది. ప్రథమదళంలో 4 ఇంద్ర గణాలు, ద్వితీయదళంలో 2 ఇంద్రగణాలు + 2 సూర్యగణాలు వుంటాయి. ఈ లక్షణమే నాలుగుపాదాల్లోనూ వుంటుంది. ప్రతిదళంలోనూ మూడవ గణాద్యక్షరం యతిస్థానం. ప్రాసయతి కూడా పాటించవచ్చు. ఇలా నడచిన నాలుగు పాదాల కనుబంధంగా ఆటవెలదిగానీ తేటగీతి గానీ వుండాలి. దీని నెత్తుగీతిగా వ్యవహరిస్తారు. సీసపద్యానికి ప్రాస నియమం లేదు.

శిరోభూషణమువలె నుండును. కనుక, మొత్తము పద్యమును శీర్షకమని వ్యవహ రింపవచ్చును. శీర్షకమునకు వికృతి సీసకము."

బాలకాండలో సీసపద్యాలు రకరకాల పోకడలు పోయాయి. స్థూలదృష్టితో వాటి వర్గీకరణ ఇది :

1. నిర్వచన (definition) సీసం :

ఇందులో ఒక విమర్శతో కూడిన నిశిత నిర్వచనం కనిపిస్తుంది.

2. ఉపమానాంత పాదాలతో నడిచిన సీసం :
3. విభక్త్యంత సీసం :
4. ఉపమావాచక సీసం :

'వలె', 'పోలె' వంటి పదాలతో పాదాంతాలు.

5. నమక సీసం :

'అది నీవు, ఇది నీవు' అని చెప్పటం,

6. సంభాషణా సీసం :
7. సంబోధనల సీసం :
8. ఆశ్చర్యార్థక సీసం :
9. అనుప్రాసల సీసం :
10. ఆజ్ఞాసూచక సీసం :
11. విడివిడి దళాల సీసం :

ఇది ఒకటవ భేదంగా తోచినా, అక్కడ సవిమర్శక నిర్వచన ముంటుంది. ఇక్కడ విషయ వివరణ మాత్రమే వుంటుంది.

12. పాదాంతాల్లో క్రియాపదాలు:
13. పాదారంభాంతాల్లో ఏకత వుండటం :

ప్రథమదళం ఏ పదంతో ఆరంభమైతే తక్కిన ప్రథమ దళా రంభాలు అదే పదంతోనూ, ద్వితీయ దళాంత పదమేది వుంటుందో తక్కిన ద్వితీయదళాంతాలదే పదంతోనూ వున్న సీసం.

14. ఆశీరర్థక సీసం :

ప్రతి పాదంలోనూ ఒక ఆశీస్సు వుంటూ, ఆశీరర్థక పదంతో పాదాంతం కావటం,

15. అభ్యర్థన సీసం :

ప్రతి పాదంలోనూ ఒక అభ్యర్థన వుండటం.

16. పాదారంభాల్లో అనుప్రాస :

17. నిందార్థక సీసం :

18. ప్రథమ పాదాంతపదమే తక్కిన పాదాల్లో వుండటం :

19. ప్రశ్న, సమాధానం వున్న సీసం :

ఒక ప్రశ్న ప్రథమ దళంలో వుండటం, దానికి సమాధానం ద్వితీయ దళంలో వుండటం.

20. సంస్కృత సమాస సీసం :

పాదం మొత్తం ఒకే సంస్కృత సమాసం వున్న సీసం. తక్కిన పాదాలు ఇలాగే వుంటాయి.

21. అనిబద్ధ పాద సీసం :

పాదాలు నియమబద్ధంగా వుండక, అనియతగతిలో సాగిపోవటం.

ఇవి స్థూల విభజనకు ఒదిగిన పోకడలు : వీటికి వరుసగా ఉదాహరణ లివి :

**1 వ భేదం :**

ఋషివంటి నన్నయ రెండవ వాల్మీకి
తిక్కన శిల్పపుఁ దెనుగుఁ దోట (అవతారిక. 30)

**2 వ భేదం :**

స్వర్గమన్గోవు వెన్జను త్వత్పురీ వృష
గళమున వ్రేలాడు గంగడోలు (ఇష్టి. 56)

**3 వ భేదం :**

రాగానుసారి భావాగణ్య గీతిచే
నర్థానుగుణ హస్తాప్తి చేత (ఇష్టి. 177)

**4 వ భేదం :**

ఒనర బోర్కాడించి యుయ్యెల తొట్టెలోఁ
బండఁ బెట్టిన పసిపాపవోలె (ఇష్టి. 204)

**5 వ భేదం :**

అశ్వమేధంబు నీవా పుత్రకామేష్టి
కి వధ్వరంబులు నీవ తండ్రి (అవతార. 97)

**6 వ భేదం :**

చీఁకటిలో నంత చెట్టగాఁ దొలఁగి పో
యెదనేమి పుట్టెనే యెమ్మెలాడి (అవతార. 154)

**7 వ భేదం :**

నా తండ్రి రామచంద్రా! నన్నుఁ గన్నట్టి
బంగారు తండ్రి! నా ప్రాణప్రదమ! (అవతార. 329)

**8 వ భేదం :**

ఈ పసికందుల యీ పసిచేతులు
ప్రగ్రహంబుల నెట్లు పట్టఁ గలిగె? (అవతార. 364)

**9 వ భేదం :**

ఎవరయా యా స్వాము లెవరికో యీ వంగ
డపుఁ దొలివెల్గు కప్రపు నివాళి
యెవరయా యా దొర లెవరికో యాదిరా
జ పవిత్ర కీర్తి చొక్కపు వయాళి (అవతార. 376)

**10 వ భేదం :**

కక్ష్యాంతరములఁ జక్కఁగ ద్రోవ వదలుఁడా
ద్వారపాలకుల మొత్తముల వారు (అహల్య. 3)

**11 వ భేదం :**

సుంకులౌ జులపాల జుత్తుల వారలు
మూఁపున నమ్ముల పొదులు వారు (అహల్య. 74)

**12 వ భేదం :**

చలికాలమున హిమాచల గంధకావర్త
ముల నీళ్ళలను వెచ్చగిలఁగఁ దెచ్చి (అహల్య. 260)

**13 వ భేదం:**

మహియందునను శింశుమార మీనంబులు
నలి శింశుమార మీనములు మింట
మహియందున మరాళ మహిత గరుచ్ఛట
శారదాభ్రంబుల ఛాయ మింట. (అహల్య. 391.)

**14 వ భేదం:**

రఘుపుంబకోవ క్షీరధి చంద్రమూరుక
వింటి కోసలయందు విజయమగుత! (ధను. 2.)

**15 వ భేదం:**

ఓయమ్మ భూదేవి! యీ యయ్య రఘుశిశు
బడలఁ బెట్టకు మమ్మ నలుకలందు. (ధను. 4.)

**16 వ భేదం:**

పరులచే దేవకిన్నర సిద్ధ చారణ
దానవయక్ష సంతత భుజంగ
దరులచే ... (ధను. 59.)

**17 వ భేదం:**

ఛీ! క్షత్రియబలంబు ఛీ! క్షత్రియబలంబు
శస్త్రబలంబు ఛీ! యస్త్రబలము (ధను. 109)

**18 వ భేదం:**

కోకిలకొమ్మలోఁ గూసిన నీవటే
నన్నుఁ బిల్చితివంచు నవ్వుమోని
తుమ్మెద పొదలోన ఝుమ్మన నిది యేమి
మణితమే యని మేలమాడు మౌని (ధను 193.)

**19 వ భేదం:**

ఏమి మహోరాశి! యేను బ్రహ్మర్షినా?
యనిసంత నౌను బ్రహ్మర్షివంచు (ధను. 257.)

**20 వ భేదం:**

పునరుద్భవద్దంత ముగ్ధమోహన రుచి
ప్రకట రేఖాహాస భావ పరిధి. (ధను. 300)

**21 వ భేదం:**

ఈ నెలబాలుఁడు నింతలో నింత మొ
న్నటి దాఁకఁ బాలు నన్నమును బైడి
వెండి గిన్నెలలోనఁ బెట్టి తా వచ్చెడుఁ
దినిపింప... (కళ్యాణ.149.)

పై భేదాలే కాక కాస్త కొత్త పోకడపోయిన సీసాలివి:

కౌసల్య యొడిలోన గాని కూర్చుండదు
అఁకసుమిత్రయె గాని మూతవరాదు. (ఇష్టి. 227.)

నిషిద్ధసూచక పదాలను ప్రయోగిస్తూ రచించిన విధానమిది.

క్షీరాబ్ధి తరగలో శ్రీ పయోధరములో
తొలిపాము పొంసులోఁ దూఁగుశయ్య (అవతార. 112)

ఇది రెండవ భేదం క్రిందికి ఒదిగినా, ఇందులో వున్న భేదమేమంటే, ఇది ఉపమేయాంత సీసం. అది ఉపమానాంత సీసం. ఇక్కడ వరుసగా మూడు ఊహలున్నాయి. అక్కడ ఒక్కటే ఊహ వుంది.

వచ్చి రానంతలో వచ్చును మఱల భూ
నాథుండు కౌసల్యా సౌధములకు
నిచ్చి యల్లంతలో నిచ్చుఁగాన్కలు సుమి
త్రకు ధరిత్రీనాథుడొక డొకండు
మెచ్చి యా మెచ్చులే మెచ్చి యింకొకరీతి
మెచ్చు గైకేయి భూమీధవుండు
వచ్చిన వాఁడట్లె వచ్చినట్లుండు భూ
మీనాయకుండు సుమిత్ర కడకు

సంతసంతటి రాజ కార్యములు చూచు
చుండి యుండియు యట్టులే యటకలేచి
ముగురు భార్యల నవసౌధముల గడపల
దాఁక పోయి లోనికిఁబోక తాఁకి తిరుగు. (అవతార. 155)

గర్భిణులైన తన భార్యలను చూసి మురిసిపోయిన దశరథుని మనస్సు పొందిన ఆనందమిది. పాద ప్రారంభంలోని ప్రాసచేత దశరథుడి ఏకస్థిత భావన సూచితమవుతూంది. ప్రథమ దళంలో-ఆతడు తండ్రిగా ఆనందిస్తూ తన ఉనికినే మరచిపోయేటంత ఆనంద వ్యవస్థితుడైపోయేవేళ తాను రాజుననీ, రాజ్యభారం కూడా తాను వహించాలనీ గుర్తుకువచ్చినట్లు భూనాథ శబ్దంలో తొలి అక్షరం వరకూ సాగి, తక్కిన పదం క్రింది దళంలోకి వుంది. ప్రతి పాదంలో. తండ్రిగా ప్రథమ దళంలో, రాజుగా రెండవ దళంలో కనిపిస్తాడు దశరథుడు- ఎత్తు గీతిలో చెప్పబడ్డ విషయమదే. రాజ కార్యాలు చూస్తూ చూస్తూ అలాగే లేచి వస్తాడట. రాజు ఎంతగా పుత్ర ప్రేమ బద్ధుడైనాడో ఈ పద్యం చెపుతూంది.

శంపా సహస్రాభ చండ కాంతిచ్ఛటా
మేయ వారావర్త మెఱసి మెఱసి
ప్రళయ కాలాంభోద పటలీ వినిస్వనా
మోఘగర్జాభంగ మొరసి మొరసి
సప్త సాగర మహాక్షారపాథశ్ఛటా
విభృతభంగా భంగ విరిసి విరిసి
కోటి ప్రపాతవార్ధాజీ నిరాఘాట
తుంగోగ్ర తరవారి దూఁకి దూఁకి

స్వర్గమున నుండి శివుని మస్తకము దాఁక
ఘూర్ణితై రావణాస్యమై కురిసి కురిసి
శివజటా జూటికా మహా సీమలో గు
భిల్లు మని వచ్చిపడె తిరుగుళ్ళ గంగ (అహల్యా. 878)

ఇది గంగావతరణం. పద్యమంతటా పరచుకున్న తగణం ఉవ్వెత్తున ఎగసిపడే ఉత్తుంగ తరంగంలా మీదిమీదికి ముంచుకొస్తూంది. గీర్వాణ లోకం నుండి నేలకు దిగుతూన్న నాకధునిని సమాసాధిక్యతతో వర్ణించటం శోభాదాయకంగా వుంది. పద్యంలో 'మెఱసి మెఱసి' వంటి ద్విరుక్తపదాలు గంగ తరంగాల్లోని చకచ్చకితమైన వెలుగుల్ని స్ఫురింపచేస్తున్నాయి. ఇవి నగణాలు కావటం చేత ఆ మెఱుపుల వేగం, తళతళలాడే తరంగద్రుతి ద్రుతగతి చేత సూచింపబడుతున్నాయి. 'గుభిల్లు' అనే మాటలోని ఉత్ప్లుతి ఎత్తి కుదేసిన ధ్వని వినిపిస్తూ, నేలకు దూకిన గంగ ఔద్ధత్యాన్ని స్ఫురింప చేస్తున్నది. శివుని మస్తకం గంగకు తొలిరంగం. ఆ మహాదేవుని జటారణ్యంలోకి 'ఘూర్ణితై రావణాస్యయై' దూకిన దూకుడు ఇక్కడి పద్యంలోని శ్లిష్టబంధంలోని ధారాశుద్ధి ద్యోతకం చేస్తూంది. 'అద్భుత రౌద్ర వీరానంద కృద్వారిధార'మైన (879) 'ఘనరసాకార' గంగానామాన్ని పద్యం చివరిదాకా దాచివుంచి చిట్ట చివర బయటపెట్టటం చేత హఠాత్తుగా గంగావైభవాన్ని బయల్పరచినట్లయింది. (ఇది తిక్కన మార్గం, 'సకదివియగు చేసె నగరికి'-(విరాట పర్వం) అనే పద్యంలోని నిర్మాణమే ఇక్కడ వుంది.)

ప్రథమమేనిపై గాలి పై వచ్చినంతనే
పాషాణ మొకటికి స్పర్శవచ్చె (అహ్యల. 254)

ఇక్కడ అహల్యా శాపవిముక్త కావటం మహావిషయం. కనుక పరిమాణ రీత్యా విస్తృతమైనదైన సీసాన్ని ఈ విషయ వర్ణనకు స్వీకరించి, అందులోని మహత్వాన్ని ఛందోరూపంలో సూచించాడు కవి. ఈ పద్యానికి పూర్వం అహల్య చేసిన స్తుతి వుంది. అక్కడ ఏడు సీసపద్యాల్లో స్తుతించింది. ఈ సంఖ్య బహు శార్థ ప్రతిపాదకం.

చటులము నెట్టినై చూచెడు చివురాకు
చివురాకు వెనుకఁ బొంచిన లతాంత
బాణుండు విసరగా బట్టిన పిడిబాఁకు
పిడిబాఁకు లివ్వున విసరదూసి
చన్న నవ్వుడివోని సన్నని పికిపాకు
పికిపాకుతో మేళవించి సన్న
గొంతు రాగముతోడఁ గులుకు నచ్చరసోకు
పిరుపీఁకుగా నొక్క పెట్టిఁదోచి

తోఁచుటాలస్యముగఁ కింకిణీ చిణచిణ
నినద కనదబ్జపద సమానీత మధుర
గీతికారసవార్ధి పొంగిన తరంగ
మచ్చరయుఁ గన్నులను హృదయమునఁ బొడువ (ధను. 231)

ఇది రంభాగమనం. అనేకాక్షౌహిణీ సేనతో దాడివెడలే చక్రవర్తిలాగా, విస్తృత కామోద్దీపక సామగ్రితో కౌశికుడి పైకివచ్చింది రంభ. పాదప్రారంభంలో శకటరేఫతో కూడిన దిరుక్త పదం వుంది. ద్రుతగతి సూచకమైన నలంతో ఆరంభం కావటం చేత పద్యంలో ఆ త్వరపాటు ప్రథమంలోనే సూచించబడింది. పద్యంలోని ప్రతిపదమూ మరొక దళంలోకి చొచ్చుకుని వుండి, 'పదపద'మని (229) పరుగెత్తిన మన్మథ సేనను భావింపచేస్తున్నాయి. ముక్తపద గ్రస్తా లంకారం చేత విశ్వామిత్రుని కూపిరాడనంత పని చేయటమే కాదు, ఒకేధ్వని

కలిగించే పదాల చేత మరో ప్రయోజనం సాధించాడు కవి. చివురాకు, పిడిబాకు, పికివాకు, పిరువీకు - ఇవి పద్యంలో వచ్చిన మన్మథ సామగ్రి. ఒకే పదంలాగా భ్రమింప చేసే అక్షర నిర్మాణం వుంది వీటిలో. అన్నీ సల గణాలే. రంభావతరణకు రంగం చిత్రిస్తున్నపుడు కౌశికుడికి అనుమానం రాకూడదు. అందుకని ముందు ఎలా వున్న ప్రకృతి అలానే వుందన్న భ్రమ కలిగిస్తూ మార్చాలి. ఇది ఆ పదాల ద్వారా కవి సూచించింది. పదాలు ఒకలాగే వున్నాయనిపిస్తూ చివురాకు పిరువీకుగా పరిణమింపచేయటం అక్కడ ఇంద్రుడు, ఇక్కడ కవి చేసిన పని. ఈ సల గణాల నాధారంగా కవి 'అచ్చరసోకు' అనే మరో మాట పెంచాడు. ఒక్క అక్షరం పెరిగిన సలమిది ((అ)చ్చర సోకు = (U)IIUI) ఈ హెచ్చిన అక్షరం చేత ఆ సంభారాలు సమకూర్చుకున్న రంభ ధైర్యంగా బయల్పడి, కౌశికుని కలవరపరచే యత్నం చేయటం స్ఫురిస్తూంది. ఎత్తుగీతిలో ఎంత కాదనుకున్నా 'చిణచిణ' ధ్వనం వినిపిస్తూనే వుంది. సలగణంలో నిబద్ధమైన ఈ ధ్వని ద్రుతగతిని సూచిస్తూ రంభ ప్రయత్నంలోని తొందరపాటుకు సూచకంగా వుంది. పద్యంలో వినిపించే శబ్దాలంకారం చేత, రంభ రాకలోని ఆంతర్యం చప్పున గ్రహింప చేసేటట్లున్న అలంకరణ భావ్యమాన మవుతూంది.

ఒక పెద్ద కెరటము నొకపెద్ద కెరటము
　　గలసి యన్యోన్యంబుఁ గౌగిలించు
నొక చిన్న కెరటము నొక చిన్న కెరటము
　　గలసిపోవును రెండు గానియట్లు
ఒక చిన్ని కలువపూ వొక చిన్ని కలువపూ
　　వును గూడి యంచుల కొనలు ముట్టు
నొక రాజ హంసమ్ము నొకరాజ హంసమ్ము
　　భువనోన్నతత్వంబు పుక్కిలించు

దివిజ భాగిరథీ సరయువుల సంగ
మమ్ము పోలిక నైక్ష్వాకు మైథిలావ
నీశ్వరులఁ బెండ్లి వారికి నృపుని కనక
మయ మహాసౌధముల సంగమమ్ము గలిగె (కళ్యాణ. 63)

ప్రతి పాదంలోనూ రెండు సమాసాలున్నాయి. ఆ రెండూ ద్విరుక్తమైన ఒకే సమాసరూపాలు. 'ఒక పెద్ద కెరటం' అనేమాట ద్విరుక్తమైతే మొదటి పాదంలో ప్రథమదళం. తక్కిన పాదాల్లోనూ ఇదే విధానమే. పద్య ప్రథమ దళాల్లోని నిర్మాణం ఒకటే తీరులో వుంది. సలము, సలము, సలము, సలము - ఈ ధోరణిలో నడచింది. వియ్యంకులైన దశరథ, జనకుల సమత్వాన్ని ఈ విధంగా వ్యంజించాడు కవి :

అడుగొ రాముఁడు వచ్చునన్నంతలో దూసి
కోలు వెట్టును చువ్వవోలె సీత
యా రామచంద్రుఁడే యరుగుదెంచిన లేచి
నిలుచుండుఁ బుత్రిక వలెను సీత
యెదురైన నతఁడు తా నెవలేఁ బ్రపాహత
యగు వార్షుక సరస్సునట్లు సీత
ఉల్లపోయెడు రాము మొల్లంపుఁ జూపుం
గాంచు జాబిలివెల్గు కరణి సీత

కడు సమీపంబుగా సాగి కడచు రాము
నింత దగ్గరతనము సహించు సీత
యిట్టులే పోనుపోను దా నెదుట చూచు
వంచి తల సీత పతి పల్కరించు నంచు (కళ్యాణ. 161.)

సీతారాముల దాంపత్యపరిణామ మీ పద్యం. ఇందులో ఆరు జతల పాదాలున్నాయి. దీర్ఘపాదంలో రామప్రసక్తి, హ్రస్వపాదంలో సీతప్రసక్తి తేబడింది. వివాహానంతరం సీతారాముల మధ్య సమాగమం జరగడానికి ఆరేళ్ళ వ్యవధి అవసరమయింది. మొదటి సంవత్సరంలో 'అదిగో రాము'డంటూనే గబుక్కున పరిగెత్తేది. 'అడుగొ' అన్న నగణంలోని ద్రుతగతి ఉచ్చారణలోని వేగాన్నీ కవ్వింతనూ సూచిస్తున్నాయి. ఇలాగే రెండవయేడు రాముని రాకతో లేచి నిల్చోవటం, మూడవయేడు సిగ్గుపడటం, నాల్గవయేడు చూడగల్గటం, అయిదవ యేడు దగ్గరితనాన్ని సహించటం, ఆరవ యేడు పల్కరింపుకై ఎదురు చూడటం జరిగాయి. ఈ విషయం ఆరేళ్ళ విస్తృతికలది. ఇద్దరు వ్యక్తులకు సంబంధించింది.

ఈ విషయ వ్యంజన ఛందోరీత్యా సీసపద్యంద్వారా చేయదగినది. ఎందుకంటే, ఎత్తుగీతితో కలిపి 12 పాదాలున్న సీసంలో ఈ అమరిక సులువు. కవి ఒక దళంలో రామునీ, ఒక దళంలో సీతనూ గురించి చెపుతూ, అటువంటివి ఆరు పాదాలు వ్రాశాడు. దీనిచేత కవి చెప్పదలచుకున్న ఆరేళ్ళవ్యవధి ఛందోనిర్మాణం ద్వారా సూచితమయింది.

ఈ కవి సీసరచనలో 'నల', 'సల', తగణాలు విస్తృతంగా ప్రయోగిస్తాడు. దీనివలన పద్యానికి ఒక ధారాశుద్ధి ఏర్పడుతుంది. ఇది ప్రసిద్ధకవిమార్గమే

'కఠినస్తనోపరి గ్రైవేయ మణికాంతి
కర్ణతాటంకంబు గాడిపఱుప (అవతారిక. 27.)

'ప్రతిరసాల కుంజంబుఁ బచ్చిపిందెల తోడ
నెలమసలిన కాంత వలెనెదోఁచె (ఇష్టి. 255)

సచ్చిదానందముల్ స్కంధత్రయము గుర్రు
గానున్న యొక చెట్టుగాని చెట్టు (అహల్య. 551)

మాకంద తరుశాఖికా కోకిలాలాప
కౌతూహలాకార కలనఁజేసి (ధను. 181)

ఎలయించి కికురించి వలపుల ప్రాకించి
దొంగయౌ కన్నెసంపంగి చేత (కళ్యాణ. 218)

ఇవి కొన్ని ఉదాహరణలు. బాలకాండలో విస్తృతమైన ఈ సీసపద్య నిర్మాణ విషయం విశేషించి పరిశోధించదగ్గది.

## ఛందశ్శిల్పం - పాదసూచికలు :

1. క్షేమేంద్రుడు; సువృత్త తిలకం - 3-20.
2. ఈ వృత్తాన్ని "భారతమున తిక్కన మాత్రమే స్త్రీ పర్వ ప్రథమా శ్వాసాంతమున హరిహరనాథదేవుని సంబోధించుటకు ఒక్క పర్యాయమే ఉపయోగించెను."

   డా॥ పాటిబండ మాధవశర్మ; ఆంధ్ర మహాభారతము : ఛందశ్శిల్పము పు. 281.
3. క్షేమేంద్రుడు; వృత్త రత్నాకరము 2-31.
4. ఆంధ్ర మహాభారతము; స్త్రీ పర్వము 1-187 ప
5. ఏడు సూర్యగణాలపై ఒక గురువుండటం ఉత్సాహ లక్షణం. అక్కడి సూర్య గణం సగణమైనా కావచ్చు. గలమైనా కావచ్చు. అందే అక్కడి వృత్తగతి గురు లఘువుల మార్పుల ననుసరించి వుంటుంది. విచికిలితం అట్లా కాదు. ఒక పాదంలో ఏ గణక్రమం నిబద్ధితమైందో తక్కిన పాదాలన్నిటా అదే క్రమముంటుంది.
6. పాటిబండ వారి ఛందశ్శిల్పం; పు. 355.
7. డా॥ పి.ఎస్.ఆర్. అప్పారావు; నాట్యశాస్త్రము; అనుబంధం-5 పు. 909.
8. చూ. డా॥ పాటిబండ మాధవశర్మ; తరల వృత్తవివరణ; ఆంధ్ర మహాభారతము; ఛందశ్శిల్పము : పు. 343.
9. శ్రీ కృష్ణశ్రీ సంకలనం; స్త్రీలపాటలు; పు. 80. 'శ్రీరాములవారి అలుక.'
10. డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు; నాట్యశాస్త్రం. పు. 909.
11. ఈ 'మాలిని'కి రగణం, మగణం కలిసి రెండే గణాలు. వ్యాసంలో పేర్కొన్న వృత్తానికి దీనికి సామ్యం లేదు.
12. డా. పి. ఎస్. ఆర్. అప్పారావు, నాట్యశాస్త్రం; పు. 415.
13. పైదే. పు. 908.
14. పైదే పు. 424.
15. అప్పకవీయం. పు. 249.

16. డా॥ పాటిబండ మాధవశర్మ; ఛందశ్శిల్పం. పు. 341.
17. డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు; నాట్యశాస్త్రం. పు. 401, 406.
18. పైదే. పు. 910.
19. పైదే. పు. 437.
20. పైదే. పు. 421.
21. అప్పకవీయం 4 వ ఆశ్వా. వృత్తలక్షణాలు.
22. నడి కన్నడ కాలానికి చెందిన ఛందమిది. ప్రాచీన ఛందోగ్రంథాలు ఈ ఛందాన్ని గురించి చెప్పకపోవటం చేత, కన్నడ ఛందోగ్రంథమైన 'ఛందోంబుధి'లో మొదటగా నాగవర్మ ప్రక్షిప్త పాఠంగా పేర్కొనటం చేత, దీనికి పుట్టుక కన్నడదేశంలో జరిగి వుండవచ్చునని భావించవలసి వస్తూంది. ఆ దృష్టితో ఇది 'కర్ణాటక చతుష్పద'గా తొలుత ఏర్పడి, మెల్లగా 'కర్ణాట చతుష్పద' అయివుండవచ్చు. దీనిని కన్నడ ఛందస్సులో 'చౌపద'గా పేర్కొన్నారు.

చూ. డా॥ టి వి. వెంకటాచలశాస్త్రి,
కన్నడ ఛందఃస్వరూప: పు. 368.

23. ఛందశ్శిల్పం. పు. 385.
24. తిక్కన, నిర్వచనోత్తర రామాయణము; అవతారిక.
25. ఛందశ్శిల్పం. పు. 388, 89.
26. శ్రీ జువ్వాడి గౌతమరావు; విశ్వనాథ కవితావైభవం.
27. 'శౌర్యస్తవే నృపాదీనాం శార్దూల క్రీడితం మతం.' —క్షేమేంద్రుడు.
28. 'నలదమయంతు లిద్దఱు' అనే పద్యంలో ఇద్దరి విరహాన్నీ ఒకే పద్యంలో బద్ధం చేశాడు కవి. ఇక్కడ కల్పవృక్ష పద్యంలో సీతారాములు వ్యక్తు లిద్దరైనా మనస్సు ఒకటేననే సూచనతో ఇద్దరిప్రేమా ఒకే పద్య బద్ధమైంది.
29. 'ఉత్పలమాలిక'కు మ-స-య-గ అనే గణాలుంటాయి. 'ఉత్పలమాల'కు భ ర న భ భ ర వ అనే గణాలుంటాయి. నామసామ్యమే కానీ, ఈ రెంటికీ గణసామ్యం లేదు.

చూ. డా॥ పి.ఎన్.ఆర్. అప్పారావు;
నాట్యశాస్త్రము; 15 వ అధ్యా. పు. 411

30. 'లౌకికుడ', 'జారరా' అని రెండు సంబోధనలు. ఒకటి లోకసంబంధం. రెండవది అగ్నిసూచకం కనుక అధిలోక సంబంధం. వరుస ప్రకారం అధిలోక వ్యవహారం ముందుగా ప్రస్తావించబడాలి. సృష్టి మూలాలు అక్కడ వున్నాయి కనుక. ఇంద్రుడిలో పైకివొంగిన పరసతీవ్యామోహం లోకసంబంధం. అందుకే ముందుగా దాన్ని నిందిస్తూ 'లౌకికుడ' అన్నాడు ఋషి.

31. ఆ యెడ మందహాస కలితానన దీధితి గాంచుచున్న గా
ధేయుని నేత్రమార్గ పరిధీకృత మోహన మోహనాంగ రే
ఖాయత మాన గోపన వికంపిత ముగ్ధతరాంగుళీ గ్రహీ
తాయత సిక్తచేల కలితాంచిత కాంచి పదాభిరామయై.

శ్రీ మద్రామాయణ కల్పవృక్షము;
బాలకాండ-ధనుష్ఖండము ప. 182.

32. పాటిబండవారి 'ఛందశ్శిల్పం' పు. 435-36.

# వాల్మీకి – విశ్వనాథ

కల్పవృక్ష బాలకాండలో మూల రామాయణాన్ని కించిత్తు మార్చినచోట్ల గురించి ఇక్కడ స్థూలంగా సూచింపబడుతుంది.

1. వాల్మీకంలో కైక రాముడికి భిక్షవేయటమన్న ప్రస్తావనేలేదు. కల్ప వృక్షంలో 'పిడిని మరకతమ్ము తొడిగిన చురకత్తి, వజ్ర పుంఖితమ్ము వాలు టమ్ము' నిచ్చింది.

2. ఋశ్యశృంగుని కథలో రోమపాదుడు అతడిని ఎలా పిలిపించాలో ఆలోచిస్తున్నప్పుడు పురోహితులు 'వేశ్యల నతని దగ్గరికి పంపటమనే ఉపా యంతో అతని నిక్కడకు రప్పించగల'మన్నారు (బాల. 9వ సర్గ. 16 శ్లో). ఇది మూల విషయం. కల్పవృక్షంలో వేశ్యలు 'మేము వెళ్ళి తెస్తా'మని తామే ప్రకటించారు.

3. వార యువతులు ఋశ్యశృంగుని వశపరచుకోవటానికి పాడారు. 'గాయంత్యో మధుర స్వరాః' అని వాల్మీకి స్థూలంగా చెప్పాడు. దీనిని విశ్వనాథ 'తనగొంతులోన' అనే పద్యంతో వ్యాఖ్యానించాడు.

4. రాముని బాల్యాన్ని విపులంగా వర్ణించటం అమూలకం. 'తానో లాములు...' ఇత్యాది పద్యాలు కవి ప్రతిభకెత్తిన నీరాజనాలు.

5. గంగావతరణ కథలో మూలంలో గంగ భగీరథు ననుసరించింది అన్న మాటకు (43వ సర్గ-33వ శ్లోకం) కల్పవృక్షంలో 'ఒకవేళ తమ కులో ద్భవుడెవ్వడైన గంగనావిర్భవింప' జేసిన నామె దే పలసిన త్రోవగా తమ పూర్వు లేర్పరచిన గుర్తుల వెంబడి నిమ్నధాత్రిగా భగీరథుండు రథము పోనిచ్చె' (అహల్య. 387 ప) అనే వర్ణన వెలిసింది.

6. అహల్య శిలాకృతి పొందడమన్న అవాల్మీకాంశం ఇతర రామాయ ణాలలాగా దీనిలోనూ వుంది. అయితే, ఆమెను నిర్దోషిగా నిలిపే ప్రయత్నం కల్పవృక్షంలో అదనంగా వున్న విషయం.

7. విశ్వామిత్రుని కథలో శునశ్శేపునికి రక్ష కలిగించే ఘట్టంలో మూలానికి కల్పవృక్షం భిన్నంగా వుంది. మూలంలో 'మీరంతా యజ్ఞపశువులై అగ్నికి తృప్తి కలిగించండి. ఇతని జీవితాన్ని నిలపండి' (62వ స. 11వ శ్లో.) అని కౌశికుడు తన కొడుకులతో అన్నాడు. కల్పవృక్షంలో 'మీలో ఒక్కరు ఇతని బదులు యజ్ఞపశువు కండి' (అహల్య. 167వ) అన్నాడు. మూలంలో 'అందరూ' అని వుండగా, కల్పవృక్షంలో 'ఒక్క'రని చెప్పబడింది.

8. పదేళ్ళు మేనకతో చరించాక, విశ్వామిత్రుడికి తన తప్పు తెలిసింది. వణకిపోతూ నిలబడ్డ మేనకను తియ్యని వాక్కులు పలికి పంపించాడు. ఇక్కడ 'మధురై ర్వాక్యై ర్విసృజ్య' అని మాత్రం వుంది. కల్పవృక్షంలో ఆ మధుర వాక్యాలంటే ఏమిటో వివరించబడ్డాయి.

9. విశ్వామిత్రుడు మేనకతో అన్నాడు 'నీ గర్భాన్ని కణ్వాశ్రమ సీమలో వదలి వెళ్ళు' అని, ఇది కల్పవృక్షంలో మాత్రమే వుంది. అవాల్మీకాంశమిది.

10. కౌశికుడి తపోభంగం చేయటానికి రంభను పంపినపుడు ఆమె 'ఇది మేనకకు ఈర్ష్యాపదమవుతుందేమో' అంది. అలాగే, కౌశికుడు బ్రహ్మర్షి అయినపుడు మేనక ఆనందంతో నృత్యం చేసింది. ఇవి అమూలక విషయాలు.

11. కౌశికుడు రాముడికి చెప్పిన చిన్న కథల్లో కొద్ది మార్పులున్నాయి. తాటక వధ ఘట్టంలో రాముడు 'స్త్రీని వధించటం నా చేతకా'దంటాడు. ఇది అమూలకం.

12. తాటక వధానంతరం రాముని ప్రశంసించిన దేవతలు కౌశికునితో, 'భృశాశ్వవిద్యలను రాముడి కివ్వ' మంటారు. ఇది మూలం. కల్పవృక్షంలో ఇది కించిత్తు కల్పనతో కూడి వుంది. రాత్రి రామలక్ష్మణులు నిద్రిస్తూంటే దేవేంద్రుడు కౌశికునికి మాత్రం చెబుతాడు. 'నిద్రామధుమూర్తు'లైన రామలక్ష్మణులకు దేవతలు నమస్కరిస్తారు. ఇది అమూలకం.

13. మారీచ సుబాహులను తరిమికొట్టే సందర్భంలో కూడా మూలంతో కల్పవృక్షం భేదిస్తుంది. మూలంలో ముందుగా మారీచ సుబాహుల్ని తరిమి, తర్వాత రాక్షసులను తరిమాడు. (30 స 23 శ్లో.) కల్పవృక్షంలో ముందుగా రాక్షసుల తరిమి, తర్వాత మారీచ సుబాహుల సంగతి చూచాడు, రాముడు.

14. దితి గర్భాన్ని ఇంద్రుడు చీల్చిన కథలో ఇంద్రుడు ఆమె యోని వివరం నుంచి ప్రవేశించి గర్భచ్ఛేదన చేశాడని మూలం (47 స. 18 వ శ్లో). ఆమె శ్వాసద్వారా ప్రవేశించాడని కల్పవృక్షంలో మార్చబడింది.

15. ఇక ప్రధాన కథా విషయంలో, పరశురాముడి ప్రవేశం విషయంలో ఒక చిన్న మార్పు వుంది. వివాహితుడై అయోధ్య మార్గగామి అయిన రాముడికి దారిలో పరశురాముడు ఎదురుపడ్డాడు. ఇది మూలం. కల్పవృక్షంలో రాముడి వివాహానికి పూర్వమే పరశురామ ప్రవేశముంది. పైగా జనక సభలోనే వీరిద్దరి సమాగమం జరిగింది.

16. వివాహితులైన సీతారాములు అహల్యాశ్రమం మీదుగా అయోధ్యకు వెళ్ళటం అమూలకం.

17. వివాహానంతరం రాముడిలో వైరాగ్య భావనలు చెలరేగి, వశిష్ఠ బోధతో మనసు సమత్వ స్థితి నందుకుంది. ఇది అమూలకం.

ఇవి స్థూలమైన భేదాలు.

# ఉపసంహారం

ఆధునికాంధ్ర సంప్రదాయకవితలో ప్రభుస్థాన మలంకరించిన కృతిగా కల్పవృక్షం గౌరవించబడింది.[1] లక్షణ గ్రంథాల్లో తప్ప మరెక్కడా కనబడని ఎన్నో అపురూపఛందస్సులు ఇందులోవుండటంతో ఈ కవిని 'మూలనున్న ముసలి దాన్ని కట్టుకున్నా'డని సమకాలికులు పరిహసించినా,[2] ఆ పరిహాసం రూపానికి (form) సంబంధించినంతవరకే పరిమితం. విషయంలో విశ్వనాథ నవీనుడే. అతడు చెప్పేది పాతకథే అయినా, నవీన మానవుడి ఆర్తినీ, అనుభూతినీ దానిలో దాచి 'కొత్తసొమ్మొనరించి'నట్లు[3] రచిస్తాడు. అందుకే కల్పవృక్షం చదువుతూంటే ఆ పాత్రలు మన కాలంలోనివే అనిపిస్తుంది. బాలకాండలోని రాముడు మన ఇంటిలోని పసివాడనిపిస్తుంది. ఇదొక నేర్పు, కథన శిల్పం. ఈ కారణం చేతనే అందులో 'సమసామయికత'[4] గుర్తించబడింది. 'ఆధునికేతిహాసం'గా ప్రశంస నందింది.[5] ఆ మహాకావ్యంలోని బాలకాండగత రచనా శిల్పాన్ని వ్యాసకర్త శక్తిమేరకు ఇక్కడ వివేచించటం జరిగింది. సహృదయ లోకానికి నమస్కరిస్తూ ఈ గ్రంథమిక్కడ సమాపన చేయబడుతున్నది.

## పాదసూచికలు

1. 'సంప్రదాయ కవితలో ఇది ప్రభువు'.
   డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి;
   'సంప్రదాయకవిత-కల్పవృక్షం' (వ్యాసం)
   'మహతి'; 'ప్రయోగం'-పు. 39.
2. శ్రీ దేవరకొండ బాలగంగాధర తిలక్; 'అమృతం కురిసిన రాత్రి' (కవితా సంపుటి) 'త్రిమూర్తులు' (ఖండిక).
3. "-కడుక్రొత్తగు సొమ్మొనరించి, విష్ణుసే
   వం దులకించు నప్పరమవైష్ణవకోటి నలంకరింపుమా"
   తెనాలి రామకృష్ణకవి;
   పాండురంగ మాహాత్మ్యం; 1-26ప.
4. చూ. డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి; 'కల్పవృక్షము- సమసామయికత' (వ్యాసం); 'జనధర్మ'-విశ్వనాథ అభినందన సంచిక; నవంబర్, 1971. పు. 45-53.
5. చూ. a) డా॥ కోవెల సుప్రసన్నాచార్య; 'కల్పవృక్షము - ఆధునికేతిహాసము'; పైదే; పు. 71-84
   b) రామాయణము-ఇతిహాస లక్షణము (వ్యాసం) డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు.
   రామాయణ రసవాహిని (ఉపన్యాస సంకలనం) పు. 24-28.

# అనుబంధం-1

తెలుగులో విశ్వనాథ ద్వారా సహస్రాధికంగా విజృంభించిన వృత్తం మధ్యాక్కఱ. ఈ వ్యాసంలో ఆ వృత్త పూర్వాపరాల గురించిన చర్చ చేయ బడుతుంది.

'విశ్వనాథ మధ్యాక్కఱలు' అనే పేరిట విశ్వనాథ పది మధ్యాక్కఱ శతకాలను వ్రాసి వుండటం ప్రసిద్ధ విషయం. ఈ వృత్తం మొదటగా కావ్యస్థమై నన్నయ భారతంలో కనిపిస్తుంది. ఏ తత్పూర్వం అది రాతి పలకలపై కనిపించినా, శాసన ప్రకటనకు ఉద్దేశ్యించబడినట్లు మాత్రమే తెలుస్తూంది. ఈ విధంగా కావ్య ప్రపంచానికి దూరంగా బ్రతుకుతున్న వృత్తాన్ని కావ్యబద్ధంచేసే ప్రయత్నం చేశాడు నన్నయ్య. ఆయన యతి విషయంలో కానీ, గణాల విషయంలో కానీ మార్పు చేయక, శాసన పద్య లక్షణాన్ని యథాతథ మనుస రించాడు.

'స్వస్తి నృపాంకు శాత్యంత వత్సల సత్యత్రినేత్ర
విస్తర శ్రీ యుద్ధమల్లుఁడనవద్య విఖ్యాత కీర్తి
ప్రస్తుత రాజాశ్రయుండు త్రిభువనాథ రణుండు సకల
వస్తు సమేతుండు రాజసల్కి భూవల్లభుండర్థి'[1].

ఇది శాసన పద్యం. ఇందులో అయిదవ గణాద్యక్షరం యతి స్థానంగా ప్రతి పాదంలోనూ కనిపిస్తుంది. నన్నయ పద్యమూ అలాగే నడిచింది.

'తను మధ్య దానొక్క కన్యక సురనదీ తటమున నన్ను
గనిన—' (ఆదిపర్వము : 4-142)

ఈ యతి విధానంచేత పద్యపునడక మందగించింది. పద్య నిర్మాణంలో (యతి విషయికంగా) సమత్వం లోపించింది. ఈ కారణంగా తరువాత వచ్చిన

కవులు దీని నాదరించలేదు. నన్నయ తన రచనలో 39 మధ్యాక్కఱలు వ్రాస్తే, తరువాత వచ్చిన తిక్కన వాటిజోలికి పోకపోవడం గమనార్హం.[2] ఆయన నన్నయను గురించి 'ఆంధ్ర కవిత్వ విశారదుండు'[3] అని గౌరవ వచనాలు పలికినా, అతడి మధ్యాక్కఱలకు తాను చోటివ్వలేదు. అత్యధికంగా విశేషవృత్తాలను ప్రయోగించిన తిక్కన ఈవృత్తాన్ని ఎందుకు పరిహరించినట్లు? అతనిది 'కావ్యరసముం గొనియాడుచునుండు'దృష్టి.[4] ఆ దృష్టితో పద్యత్వం కంటె వచనత్వం ఎక్కువ నిల్పుకొన్న ఈ వృత్తం కావ్య మార్గానికి కుదరదన్న ఆలోచన వుండి వుండాలి. నన్నయ చేసిన ప్రయోగం తిక్కన కాలానికి ఫలించలేదు. తర్వాత వచ్చిన ఎఱ్ఱన భారతంలో ఒకే ఒక్క మధ్యాక్కఱను రచించాడు. ఇది కూడా 'తద్రచనయకా' అనిపింపచేసే యత్నంలో ఒక భాగం. అయితే, ఈ ఒక్క వృత్త ప్రయోగంలోనూ అతడొక మార్పును ప్రవేశ పెట్టాడు. నన్నయ అయిదవ గణాద్యక్షరాన్ని యతి స్థానంగా నిలిపితే, ఇతడు నాల్గవ గణాద్యక్షరాన్నే యతిగా నిలిపాడు. దీనిచేత పద్యానికి ఒక సమత్వం వచ్చింది. ఈ ప్రయత్నంతో మధ్యాక్కఱకు మళ్ళీ వ్యాప్తి కలిగించే ఉద్దేశ్యం కనిపిస్తూంది.

> అసదృశ తేజుడు బ్రాహ్మణానీక సహితుడై కదగి
>
> (అరణ్య. 4-310)

దీనిచే ఒక సుభగత్వం, ఒక సమత్వం శ్రుతిలోనూ, గతిలోనూ కనిపిస్తూంది. ఈ లక్షణంచేత ఇది పద్యంగా కంటె, గేయంగా ఎక్కువ శోభించింది. ఫలితంగా పాటలలోకి ఈ వృత్తం ప్రచ్ఛన్నంగా ప్రవేశించింది.

> 'అంతట రాములవారూ - అంగన సీతనుగూడీ
> సంతసమందుచు వేగా - స్వపురమునకు చనుదెంచీ
> తమ్ములతోడను గలసీ - నెమ్మది రాజ్యములేలే
> ధర్మముతో ప్రజలెల్లా - తామరతంపరలైరీ.'[5]

అనే పాటలో ఈ విషయం స్పష్టీకరించబడింది.

ఎఱ్ఱన ప్రయోగం ఆధు సాహిత్యంలో పాటలుగా ఫలించింది తప్ప, పద్యంగా ప్రకాశించలేదు. పద్య నిర్మాణంలో పాదాంతాలు హ్రస్వాక్షరబద్ధం

కావటంచేత వేగలక్షణం లోపించింది. ఫలితంగా అనాదరణకు గురైంది. దీర్ఘాక్షరం పాదాంతంలో వుంటే కలిగే సౌకర్యం, హ్రస్వాక్షరమున్నప్పుడు పఠితకు కలగదు. ఈ నెమ్మదితనంచేత ఈ వృత్తం ఆలోచనకు అవకాశమిస్తుంది.[6] తర్వాత సాహితీరంగంపై 'జగన్మోహినీ అవతార'[7] మెత్తిన శ్రీనాథుడి రాకతో పద్యానికి ధార[8] ప్రధాన లక్షణమైపోయి, ఆలోచన కంటె ముందు ఆవేశం పరుగులెత్తింది. అంటే కథకంటె వర్ణనకు ప్రాధాన్యం హెచ్చింది. (కథాదృష్టి పోతనలో కనిపించినా అది అతని కవిత్వ శ్రావ్యతలో కప్పబడిపోయింది.) తొలి దశలో జగన్మోహనంగా వున్న ఈ వర్ణనావైదుష్యం రానురానూ వికారరూపం దాల్చింది. ముప్పేట గొలుసుతో ముచ్చటగా కనిపించే కావ్యసుందరి దిగవేసుకున్న నగల బరువుతో దిగులుగా కనిపించింది. ఎవరు ఎక్కువగా వర్ణిస్తే వారే గొప్ప అనే పోటీ కవులమధ్య ఏర్పడింది. ఈ దుమారంలో కథాదృష్టి మరుగున పడిపోయింది. క్లిష్ట సమాసాలతో, దుష్కర ప్రాసలతో నడిచే పద్యమే గొప్పదన్న ప్రమాదకరమైన స్పృహ ఒకటి ఏర్పడింది. అపుడు వీరేశలింగం 'సరస్వతీ నారద సంవాదం' వ్రాయవలసి వచ్చింది.

దయమాలి తుదముట్ట తలకట్లు నిగిడించి
        ధీరుడై నన్ను బాధించు నొకడు
పాదంబులోపల పాదంబు లిమిడించి
        వీరుడై నన్ను నొప్పించు నొకడు
ప్రాసంబుపై పెక్కు ప్రాసంబు లడరించి
        పోటుబంటయి నన్ను పొడుచునొకడు
బెండుపల్కులు గూర్చి నిండైన నగలంచు
        దిట్టయై చెవులు వేధించునొకడు

ఖడ్గ చక్రాది రూపముల్ గానిపించి
వర్ణముల్ మార్చి నను చిక్కుపరచునొకడు
కుమతు లొడలెల్ల నిరిచి ప్రాణములు తీయ
ఒడలి పసలేక కృశించి యున్నదాన.[9]

ఈ వేదన అంతా సాహిత్య పరిణతిని కాంక్షించిన కవి మనసులోనిది. ఈ విధంగా నవ్యకవిత్వంలో అతివర్ణనకు స్థానమివ్వక కథా దృష్టిని తెచ్చారు. గురజాడ దానిని 'పూర్ణమ్మ కథ', 'కన్యక' వంటి గేయాల్లో స్పష్టం చేశాడు. వీటిలో కథ ప్రధాన పాత్ర వహించడం గమనార్హమైన విషయం. కవిత్వ దృష్టికంటె కథా దృష్టి అధికంగా వున్న ఈ ప్రయోగం రానురానూ సాహిత్యంలో ఆలోచనకు మళ్ళీ తావు కల్పించింది. వ్యావహారిక భాషోద్యమ ప్రభావం చేత వ్యవహార భాషకూ స్థానం కలిగించారు. ఈ భాష పద్యంలో సరళత్వాన్ని తెచ్చింది. తిరుపతి వేంకట కవుల సాహిత్యస్వైరవిహార విజయాల్లో ఈ వ్యావహారిక రూపాలు తళతళలాడాయి. 'బావా యెప్పుడు వచ్చితీవు', 'అదిగో ద్వారక' - ఇటువంటి పద్యాల్లో జన వ్యవహారం చోటు చేసుకుంది. నాటక నిమిత్తం వ్రాయబడినా పద్యంలోకి వ్యావహారిక రూపాలు వచ్చాయనడానికివి సాక్ష్యం. వీరి శిష్యపరంపరలో అగ్రగామి అయిన విశ్వనాథ ఈ వ్యావహారిక రూపాల్ని కావ్యస్థం చేయడమనే సంప్రదాయానుసరణం చేశాడు. ఈ భాషకు అత్యంత అనుకూలమైన వృత్తంగా మధ్యాక్కఱను గుర్తించాడు. 'మా జాతి కీవొకండవు తెలుగు దైవమవు కసితీర నుతియింతు నిన్ను తెలుగు వక్కాణముల తోడ'10 అనడంలో ఈ దృష్టి విశ్వనాథకున్నట్లు స్పష్టమవుతూంది. పైగా, 'నాది వ్యవహార భాష అని చెప్పుచున్నాడు. కనుక, ఆ తెలుగు వ్యవహారానికి ఒదిగి ఇది వచనం లాగ, ఛందోబద్ధం కావటం చేత పద్యంలాగ కనిపిస్తుంది.'11 'మధ్యాక్కఱ శతకం' వ్రాయడానికి గల హేతువును చెప్పిన విశ్వనాథ మాటల్లో కూడా ఈ విషయముంది. ఆయన మున్నంగి వేణుగోపాల స్వామిని దర్శించినపుడు, అక్కడి పెద్దలు కొందరు వచ్చి స్వామిపై శతకం వ్రాయుమని అడిగారట. 'మున్నంగి వేణుగోపాల' అనే మాట ఏ పద్యానికీ మకుటంగా రావటానికి వీలులేక, మధ్యాక్కఱ ఒక్కటే దీనికి సరిపోతుందని ఆయన ఆ శతకం వ్రాశారట.12 మరి మిగిలిన తొమ్మిది శతకాల విషయంలో మధ్యాక్కఱలే ఎందుకు వ్రాయాలి? కొన్నిచోట్ల గణాల కూర్పు మకుటానికి ఒదగక పోగా, మిగిలిన చోట్ల వ్యవహార భాషకు సన్నిహితమైన గణవ్యవస్థ వుండటమన్నవి కారణాలుగా గుర్తించాలి.

విశ్వనాథ మధ్యాక్కఱ నాదరించటంలోని రహస్యమిది.

## పాదసూచికలు : అనుబంధం —

1. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి; తెలుఁగు మెఱుఁగులు; పు. 41. (తెలుగు తేటదనము)
2. చూ. ఆంధ్రమహాభారతము; ఛందశ్శిల్పము: పు 379-80.
3. తిక్కన; ఆంధ్రమహాభారతము - విరాటపర్వము: ప్రథమాశ్వాసము; ప. 6.
4. హరిహరనాథుడే ఈ మాట అన్నాడు, తిక్కనను గురించి. చూ. పైదే, ప. 15.
5. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి; తెలుగు మెఱుగులు: పు. 42.
6. "సాహిత్యంలో కవిలో ఆవేగం పొందే హృదయస్థానాన్ని ఆలోచనానుయమైన మేధస్సు ఆక్రమించింది. కవిత్వంలో కూడా ఈ భావచ్ఛాయాభేదం వల్ల వచనత్వం ఎక్కువయింది. విశ్వనాథ సత్యనారాయణ ఏనాడో విడువబడ్డ మధ్యాక్కఱను పునరుజ్జీవింప చేయడానికి ఇదే కారణం." డా॥ కోవెల సుప్రసన్నాచార్య; సాహిత్య వివేచన; పు. రెండు.
   పై అభిప్రాయం సరిగ్గా దీన్నే ప్రకటిస్తూంది.
7. 'శ్రీనాథుడు ఆంధ్ర సాహిత్యలోకమున జగన్మోహిని అవతారము.'- శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ; సాహిత్య కౌముది: శ్రీనాథావతార తత్త్వము.
8. 'శ్రీనాథుడు రసప్రసిద్ధ ధారాధుని' విశ్వనాథ సత్యనారాయణ; కల్పవృక్ష బాలకాండ అవతారిక - 30 ప.
9. ఇది వీరేశలింగం గారి పద్యంగా డా॥ సి. నారాయణరెడ్డిగా రుదాహరించారు. చూ. ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు పు. 140.
10. విశ్వనాథ సత్యనారాయణ; విశ్వనాథ మధ్యాక్కఱలు: భద్రగిరి శతకము; ప. 10.
11. డా॥ కోవెల సుప్రసన్న గారీ విషయాన్ని గుర్తించారు. చూ. సాహిత్య వివేచన; పు. 2.
12. విశ్వనాథ సత్యనారాయణ; నేనూ-నా సాహిత్య రచనలూ. 'మహతి'; విభాగం : ప్రతిభ. పు. 7.

# అనుబంధం - 2

మూల రామాయణంలో బాలకాండలో చెప్పబడ్డ కథల శ్లోక సంఖ్యావివరమూ, కల్పవృక్ష పద్య సంఖ్యావివరమూ ఇక్కడ ఇవ్వబడుతున్నాయి. అనుసృజన కర్త కథను పెంచినచోట్లు ఈ సంఖ్యలనుబట్టి ఊహించవీలుంది.

1. **ఋశ్యశృంగ కథ :**
   మూలం : 9వ సర్గ. 3వ శ్లోకం ⟶ 10వ స. 31 శ్లో. దాకా = 50 శ్లోకాలు
   కల్పవృక్షం : ఇష్టి. 148 పద్యం ⟶ 201 ప. దాకా = 53 పద్యాలు
2. **తాటక చరిత్ర :**
   మూ : 25. స; 4 శ్లో ⟶ 14 శ్లో = 11 శ్లోకాలు
   క : అహల్య. 120 ⟶ 129 ప. = 10 పద్యాలు
3. **సిద్ధాశ్రమ కథ :**
   మూ : 29 స; 1 శ్లో ⟶ 28 శ్లో = 23 శ్లోకాలు
   క : అహల్య. 177 ప ⟶ 191 ప. = 14 పద్యాలు
4. **కుశవంశ కథ :**
   మూ : 32 స. 1 శ్లో ⟶ 34 స. 12 శ్లో. = 64 శ్లోకాలు
   క : అహల్య. 227 ప ⟶ 254 ప. = 27 పద్యాలు
5. **గంగకథ :**
   మూ : 36 స. 6 శ్లో ⟶ 44 స. 19 శ్లో = 233 శ్లోకాలు
   క : అహల్య. 307 ⟶ 415 ప. = 108 పద్యాలు
6. **దితిగర్భము నింద్రుడు చీల్చిన కథ :**
   మూ : 45 స. 15 శ్లో ⟶ 47 స. 11 శ్లో. = 51 శ్లోకాలు
   క : అహల్య. 430 ప ⟶ 482 ప. = 52 పద్యాలు
7. **అహల్య కథ :**
   మూ : 48 స. 15 శ్లో ⟶ 49 స. 22 శ్లో. = 41 శ్లోకాలు
   క : అహల్య 516 ⟶ 556 ప. = 40 పద్యాలు
8. **విశ్వామిత్రుని కథ :**
   మూ : 51 స. 17 శ్లో ⟶ 65 స. 26 శ్లో. = 359 శ్లోకాలు
   క : ధనుస్సు. 56 ⟶ 260 ప. = 204 పద్యాలు
9. **పరశురాముని కథ :**
   మూ : 74 స. 8 శ్లో ⟶ 76 స. 22 శ్లో. దాకా = 65 శ్లోకాలు
   క : ధనుస్సు. 392 ప ⟶ 496 ప. దాకా = 104 పద్యాలు

# ఉపయుక్త ముఖ్యగ్రంథ సూచి


1. అప్పకవి, కాకునూరి : అప్పకవీయం; వావిళ్ళ రామస్వామి శాస్త్రులు & సన్స్, చెన్నపురి; 1934.
2. అప్పారావు, పి.ఎస్ ఆర్., నాట్యశాస్త్రం (గుప్తార్థప్రకాశిక) నాట్యమాల ప్రచురణ; 1982.
3. కోటీశ్వరరావు, తుమ్మపూడి; 'ఆంధ్రమహాభారతం - అనుశాసనిక పర్వ పీఠిక' ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు, 1974.
4. నారాయణరెడ్డి, సి; ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు; స్వీయప్రచురణ, 1977.
5. ప్రభాకరశాస్త్రి, వేటూరి; తెలుగు మెఱుగులు; ఆంధ్ర గ్రంథమాల, మద్రాసు, 1948.
6. మనుస్మృతి: వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్; చెన్నపురి,1928.
7. మాధవశర్మ, పాటిబండ; ఆంధ్రమహాభారతము: ఛందశ్శిల్పము; అభినవ భారతి ప్రచురణ, హైదరాబాదు, 1966.
8. 'మేఖల' సంచికలు, సంపాదకుడు : శ్రీ జువ్వాడి గౌతమరావు.
9. విమర్శిని: విశ్వనాథ వాఙ్మయ జీవిత సంచిక; సంపాదకుడు : డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి; కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు, 1977.
10. విశ్వనాథ శారద : శ్రీ విశ్వనాథ సత్యనారాయణ స్మారక సమితి, హైదరాబాదు, 1982.
11. విశ్వశ్రీ : విశ్వనాథ సాహిత్య సంచిక; సంపాదకుడు : పురాణపండ రామమూర్తి, 1954.
12. వెంకటాచల శాస్త్రి, టి.వి., 'కన్నడ ఛందఃస్వరూప' (కన్నడ భాషా గ్రంథం) డి.వి.కె. మూర్తి ప్రచురణ, మైసూరు, 1978.
13. వెంకటరామయ్య, తుమ్మల: రచయితా-శిల్పమూ; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు, 1986.

14. 'శ్రీమద్రామాయణము - బాలకాండము'; తాత్పర్యకర్త : శ్రీ చలమచెర్ల వేంకటశేషాచార్యులు, జయశ్రీ పబ్లికేషన్స్, హైదరాబాదు, 1979.

15. సత్యనారాయణ, విశ్వనాథ: నన్నయగారి ప్రసన్న కథా కలితార్థయుక్తి, 1968.

16. – నా రాముడు; ప్రకాశకులు : డా॥ ముక్తినూతలపాటి గురునాథరావు; శ్రీ పమిడిఘంటం కోదండరామయ్య, 1978.

17. – What is Ramayana to me? (వ్యాససంపుటి) వల్లీ పబ్లికేషన్స్, విజయవాడ, 1976.

18. – శ్రీమద్రామాయణ కల్పవృక్షము (ఆరు కాండలు); వల్లీ పబ్లికేషన్స్, విజయవాడ, 1976.

19. –'సీతాయాశ్చరితం మహత్'; శ్రీ విశ్వనాథ సన్మాన సంఘ కార్యవర్గము, హైదరాబాదు, 1976.

20. Aesthetics - a text book; By Yuri Borev; Progress Publishers, Moscow, 1985.

21. Ascetism and erotism in the mythology of Siva By Wendy Doniger O flaherty; Oxford University Press, Bombay, 1975.